శ్రీ ర స్తు.

# శ్రీరామవనవాసము

## వచనకావ్యము.

పురాణం. పిచ్చయ్యగారిచే వ్రాయఁబడినది



ఇది.

గ్రంథకర్తగారివలన బరిష్కరింపఁబడి

యన్. వి. గోపాల్ అండు కో.,

ఆనందభారతి భవన్ ముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రచురింపఁబడియె.

చెన్నపట్టణము.

1938

[రూ 1


ఆంజనేయుడు　　లక్ష్మణుడు　　శ్రీరాములు.　　సీతా

# దైవప్రార్థన.



ఉ॥ శ్రీకరునబ్జలోచనుని - శేషగిరిస్థితు వేంకటేశ్వరున్
ప్రాకటభక్తి నెంచి యిభ-వక్త్రుని సంస్మరియించి భారతిన్
జోకనుతించి పండితుల-సూరుల సత్కృపులందలంచి యు
త్సేకమెలర్ప రామకథఁ-జెప్పెద నెంతయు మేలుచేకురన్

ఉ॥ శ్రీవివాభిరాముఁడగు-శేషనగాలయ వాసుభక్తుఁడన్
భూవిబుధోత్తయాన్వయభ-వుండఁ బురాణ పిచ్చయ్యనాఖ్యుఁడన్
పావనశీలురౌకవి-పండితవర్యులకున్ విధేయుఁడన్
భావములోన రామకథఁ-బల్కఁగఁగోరిక సంభవించుటన్

మ॥ జగధీశుండగు రామచంద్రువనవా-సప్రేషణోదంతమిం
పుగఁబూర్వోత్తర సంగ్రహ క్రమమునం-బూనిక్కిన్ జనుల్
(మెచ్చఁగా
దగియొప్పన్ వచనంబుగా మృదులనూ-త్నస్వాదు సచ్ఛైలిమీ
లఁగుభంగిన్ రచియించి యంకితముమం-గాభక్త కర్పించెదన్.

క॥ ఏమాడ్కి నెన్నిరీతుల । రాముని సచ్చరితములను రచియించిననా
క్షేమకరంబెట్లునని । నామదిలో నెండచెప్పి నాఁడన్ దీనిన్.

క॥ క్షితిఁగవులుఁబండితులు మ । త్కృతిఁ దొడరినతప్పులరసికి-నియుక
(సదయా
మతులై మన్నింపుఁడు నే । సతతంబును సంస్తుతింతుఁ జాలగభక్తిన్

# పీఠిక.



ఆర్యులారా!

శ్రీమద్రామాయణమును తెనుఁగున నింతవరకును, పద్యకావ్యములుగాను, గద్యకావ్యములుగాను, మహాకవు లెందఱెందఱో రచించి లోకంబునఁ బ్రసిద్ధి నొందియున్నారు. దీనినిఁబట్టి యోజించినచో, శ్రీరామాచరిత్రము నెందఱు వ్రాసినను, నెన్నివిధముల విరచించినను కవివరులకుఁ దృప్తిఁ గొలుపఁదనుట తెల్లమగును. ఆగ్రంథములను చదివినపుడు మఱియుం జదువవలయు నవియే బుద్ధి గలుగుచుండునుగాని తనివి యిసుమంతయుం బొసంగదు. ఇది నాయొక్క యనుభవ విషయము. అప్పుడప్పుడును రామ కథాపఠనముఁ జేయుటచేత తదీయ చరిత్రంబును నేనును నొకటి వ్రాయవలయుననెడి తలంపుఁ గొన్నవాఁడనై మున్ను వ్రాసియున్న మహాకవులంబోలు సామర్థ్యము లేనివాఁడనయ్యు, రామాయణమందుఁగల గౌరవమును బట్టియైనను, నా వ్రాయుగ్రంథమును లోకులాదరింపఁ గల రనెడి దృఢ విశ్వాసముఁ గలవాఁడనై యత్నించి, ఎన్నియో రామాయణగ్రంథములుండగా, వానికంటె నధికముగ నేనుచెప్పఁ గలది యేదియుం గలుగమిఁ దలంచి యందే దేనియు నొక భాగంబును గొని వచనముగా వ్రాసి ముగించుట మేలని నిశ్చయించి, రామచంద్రుని వనవాస వృత్తాంతముం బలుకుట యుక్తమని తోఁచినందున తత్కథను వ్రాయఁగడంగి లిఖించి సంపూర్ణముఁగావించి, యస్మదిష్టదైవంబైన శ్రీమద్వేంకటేశ్వరున కంకితముఁజేసి కృతార్థుఁడనైతి. ఈ గ్రంథము వనవాసమునుగూర్చి రచించినదైనను, పాఠకులకు పూర్వోత్తరకథా సందర్భములు సుబోధకంబుగా నుండుటకొఱకు రామాయణాద్యంత వృత్తాంతములను మిక్కిలి సంగ్రహముగా లిఖించి, వనవాస కథను, తగినంత మాత్రము విపులముఁజేసి వ్రాసినాఁడ. ఇందు నేను గావించిన విశేష

మేదియును లేకపోయినను, ప్రత్యేకముగా యీకథ లేక యుండుటవలన నిది లోకు లాబాల వృద్ధముగా చదువుట కింపుగా నుండుననియు పావన చరిత్రంబగుటచే నెల్లరును జదువఁగలరనియు నమ్మకమున నిట్లు గావించితిమి. ఈ గ్రంథమును, స్త్రీలును, నల్పజ్ఞానముఁ గలవారును సయితము పఠించి సంతసించుట కనువుగా మిక్కిలి సులభశైలిని సుబోధకముగా నుండులాగున లిఖించినాఁడ. ఇందలి యితి వృత్తము జగద్విదితమే యైనను, పుణ్యచారిత్రంబుగావున పఠనార్హంబే యగునని నాతలంపు.

అల్పజ్ఞడనైన నాచే రచింపఁబడిన యీ గ్రంథమందు తొడరిన తప్పులంగని కినిసి యనాదరింపక మన్నింపవలయునని పండితోత్తములను కవిపుంగవులను మిక్కిలి ప్రార్థించుచున్నాఁడ. ప్రయాసకోర్చి నేను వ్రాసిన యీ చరిత్రమును కర్చులన్నియు తానేభరించి స్వకీయముద్రాలయంబున నచ్చొత్తించినవారును, ఇదివరకును నాచే పెక్కు గ్రంథములు వ్రాయించి ప్రచురించినవారును యగు శ్రీ యన్. వి. గోపాల మొదలియారుగారికి నేనెంతయుం గృతజ్ఞుఁడను, ఇట్టి మహోపకార మొనరించిన యీసద్భావున కాయురారోగ్య భోగభాగ్యంబులొసంగి రక్షించవలయునని భగవంతుఁని ప్రార్థించుచున్నాఁడను.

ఇట్లు గ్రంథకర్త,

పురాణం. పిచ్చయ్యశాస్త్రి.


విషయసూచిక

# శ్రీరామవనవాసము

## వచనకావ్యము.



### —(*) కథా ప్రారంభము. (*)—

శ్రీమత్సమస్తనిస్తుల సద్గుణ గణాభిరాముఁడైన శ్రీరామునిచరితంబును వచన ఫక్కిని వివరించెద. మదీరచనా సంవిధానం బెట్లనిన.

అఖండ వైభవ సముపేతంబై చతురబ్ధిపరీతంబై విరాజిల్లు ధరణీ రమణీమణికిఁ దిలకంబు చందంబున నందమింపొంద బృందారక పురంబునుం దలపించునదియైన యయోధ్యయనెడి మహానగరంబొండు సకల సపత్పరిపూర్ణంబును జగద్వందితానంతభోగాభిరామంబును నగుచు ప్రసిద్ధికెక్కి యెల్లవారలకునుం గన్నులపండువ గావించుచుండు. ఇక్ష్వాకుఁడను మహీపాలుని వంశభవులైన ప్రభువులు పారంపర్యముగా నయ్యయోధ్య తమకు రాజధానిగా కోశలదేశంబు నిరంకుశులై ధర్మంబుఁదప్పక పాలించుచుండిరి. పెక్కండ్రు మహా ప్రసిద్ధపురుషులు పెద్దకాలంబు రాజ్యము గావించినంతట యా వంశమందు దిలీపుఁడను నృపాలుఁ డుదయించి దిగంత విశ్రాంత యశో ధురంధరుండై ప్రజాపాలనంబు గావించి దివంగతుఁ డయ్యె. పిమ్మట నతని పుత్రుం డజుండు రాజై పెక్కేఁడులు భూమి నేలెను. అమ్మహారాజు ననంతరము ధర్మస్వరూపుఁడును, సర్వసద్గుణ పరిశోభితుండును, నద్వితీయ శౌర్య, ధైర్య, గాంభీర్య, పరాక్రమ కలితుండునునైన యజనందనుండగు దశరథుండను మహారాజు రాజ్యాధిపతియై న్యాయంబుఁదప్పక, ప్రజానురాగంబునకుఁ బాత్రుఁడై రాజ్యపాలనముఁ జేయఁదొడంగెను. అతనికి, కౌసల్య, కైక, సుమిత్ర యనెడి నామములు గల ముప్పురు భార్యలు గలరు. వారలంగూడి సమస్త భోగములు ననుభవించుచు, మిక్కిలి బుద్ధిమంతుఁడగు సుమంతుఁడను మంత్రి సహాయమున దశరథావనీపతి నిరుపద్రవముగా ననేక శతవత్సరములు రాజ్యము గావించుచుండెను. అమ్మహారాజున కేకొఱంతయు లేకున్నను సంతానహీనుండై యున్నందున యా కొఱంతమాత్ర మతని మనంబును

సదా బాధింపుచున్న బహుకాలంబునుండి పరంపరగా వచ్చుచున్న వంశము తన యనంతరము రాజ్యముచేయువాఁడు లేక క్షీణింపవలసినట్లు తటస్థించెనుగదా యని యెల్లప్పుడును చింతామగ్నుండై, భార్యాత్రయ సహితంబుగా నెన్నియో ధానధర్మాధి సత్కార్యములు గావించుచు, పెద్దలఁ బూజించి వారి యాశీర్వాధములం గొనుచుండినను నెందువలనను నతనికి సంతానము గలుగదయ్యె. దశరథుం డొకనాఁడు తమ కులగురుండైన వసిష్ఠమహర్షి వర్యునితో తన మనోదుఃఖమును విశదపరచి "స్వామీ! నేను పుత్రవంతుఁడ నగుటకుం దగిన యుపాయంబు నానతి యొసంగుఁ" డని ప్రార్థించెను. మహాత్ముఁ డగు వసిష్ఠ మునిశ్రేష్ఠుండు యోగదృష్టిచే భవిష్యద్వృత్తాంతముం దెలిసికొని "ఓయినృపాలా! నీవు పుత్రకామేష్టియను యాగంబొనరింపుము. నీకు పుత్రులు గలుగుదు" రని యాదేశించెను. తత్క్రియంబా మునీంద్రునివలనఁ దెలిసికొని యతని సాయంబుచే దశరథుడు విద్యుక్తముగా పుత్రకామేష్టి నొనరించిన వేలుపులు సంతుష్టినొంది ప్రీతులై యజ్ఞపురుషుని మూలమున యారాజునకు పాయసంబును బంపిరి. మహీవరుండు మహా సంతోషముతో దానిం గైకొని తన ముగ్గురు భార్యలకుం బంచియొసంగె. తత్ప్రభావంబుచే, వారు గర్భంబుదాల్చిన దశరథుం డానందముఁ జెందగా శుభలగ్నముల యందు కౌసల్యా కైకల కొక్కొక్కరుండును సుమిత్ర కిరువురునుగా నలువురు సుపుత్రులం గనిరి.

వసిష్ఠుని యనుమతంబున నృపాలుం డాకుమారులకు జాతకర్మంబు నిర్వర్తించి, కౌసల్యాభవునకు రామచంద్రుడనియు కైకజునకు భరతుం డనియు సుమిత్రాసంభవులకు లక్ష్మణ, శత్రుఘ్నులనియు నామంబులిడి వారల నత్యంత ప్రియంబునఁ బెంచుచుండి యుక్తకాలమున చౌలోపనయ నాదులుగావించి వసిష్ఠాదులైన యుత్తమగురువులయొద్ద విద్యాభ్యాసముఁ జేయించెను. పసితనంబుననుండియు, సుమిత్రాసుతులతో పెద్దవాఁడైన లక్ష్మణుండు రామచంద్రునియందును, రెండవ వాఁడైన శత్రుఘ్నుఁడు భరతునియందును బద్ధానురాగముగలవారై యెపుడును నెడబాయక కూడి మెలంగుచుండిరి. ఆ నలువురును పదునైదు సంవత్సరముల వయసునకు లోపల సమస్త శాస్త్రములును పఠించి, యశ్వగజారోహణముల యందును, విలువిద్యయందును నారితేరి సకల శుభలక్షణముల తోడ గూడి యొప్పారుచు తల్లిదండ్రులకును బంధుమిత్ర సముదయంబునకును,

ప్రజా సమూహంబునకును కన్నుల పండువ గావించుచుండిరి. దేవతలచే ప్రార్థింపఁబడి లోకంబున దుష్టులను శిక్షించి శిష్టుల రక్షించుటకై శ్రీమన్నారాయణుం డత్యుత్తముఁడై నదశరథునకు కౌసల్యయందు సుతుఁడై జనించెననియు, నతనికి సహాయంబుగా, శేషాహి లక్ష్మణుండుగను, శంఖ చక్రములు భరత శత్రుఘ్నులుగను జనించిరనియు వారిమూలమున దుష్ట రాక్షసాది బాధలుతొలంగి ప్రపంచంబు నిష్కంటకముగా శాంతిఁబొంది వర్థిల్లగలదనియు, సత్కార్యంబుల కంతరాయములు గలుగక జరుగఁ గలవని యెఱింగినవారై, తపోధనులెల్లరును వారికి సకల శుభములునుం గలుగవలయునని యాశీర్వదించుచుండిరి.

అటుల రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులు విశ్వానందకరులై విలసిల్లుచుండ బహుకాలముగా సంతాన హీనుఁడై యున్న దశరథమహారాజు తన ముద్దుకుమారులం గాంచి పరమానందమును జెంది చిన్నతనముననే వారికి వివాహములుగావించి చూడవలయునని తనలో తలంచుచుండెను. ఒకదిన మాయవనీవర శేఖరుండు, మంత్రి సామంత హిత పురోహిత దండనాయక బంధుజనంబులు పరివేష్టించియుండ భట నట గాయక పాఠక వైణిక మౌరజిక మార్దంగిక వందిమాగధ ప్రకరంబులు సేవింపగా నిండుకొలువుండి రాజ్యకార్య విమర్శనానిమగ్నుండై యున్న సమయంబున మహానుభావుండును ఋషి జనోత్తముఁడునునైన విశ్వామిత్రుం డచ్చటికి కరుదెంచెను. నౌవారికులవలన నమ్మునివరుని రాక యెఱింగి దశరథా వనీపతి త్వరితముగాలేచి యెదురేగి తోడ్తెచ్చి యుచితాసనాసీనుంజేసి పూజించి సాష్టాంగ నమస్కృతు లొనరించి యతని యనుమతింగొని తానునుం గూర్చుండి యాగమన కారణంబు నడిగిన తానొనరించు జన్నంబునకు మారీచ సుబాహుల నెడి దైత్యులు

—(*) విశ్వామిత్రుండు రామలక్ష్మణులం దోడ్కొనిపోవుట. (*)—

విఘ్నమాచరించుచున్నారనియు యజ్ఞరక్షణమును జేయుటకు శ్రీరామచంద్రునకు దక్క యన్యులకు సాధ్యముకాదనియు కర్తవ్యం బాలోచించి సహాయార్థము రాముని వెంటఁబెట్టుకొని పోవుటకై వచ్చితిననియు సవనంబు పూర్ణమైనంతట దోడ్కొనివచ్చి విడిచిపోయెదననియు తన వెంట పంపవలసినదనియుం జెప్పెను. రాముని విడిచి యుండజాలని దశరథునకాప్రకారము చేయుటకు సమ్మతము గాకున్నను తమ కులగురుండైన వసి

ష్ఠుండు పనుపవలసినదిగా యాజ్ఞాపించిన కారణము విధిలేక సమ్మతించి రామచంద్రుని ప్రయాణముఁజేసెను. అటుల ముని వెంట రాముఁడరుగుచుండగా నిమిషమైన నతని విడిచియుండని లక్ష్మణుండును దన యన్నతోడ గూడిపోవుటకు ప్రయాణంబయ్యెను ఆకుమారు లిరువురును, ధనుర్బాణములు ధరించి విశ్వామిత్రుని వెంట యతని యునికిపట్టైన సిద్ధాశ్రమంబునకు ప్రయాణమై పోయిరి. మౌనివర్యుండు వారలఁ దోడ్కొని చనిచని యరణ్యము ప్రవేశించి యరుగుచుండ తాటకయను దుష్టరాక్షసి వారిమీఁదికి వచ్చుటయు ముని యాజ్ఞచే శ్రీరామచంద్రుఁడు దానిని ఖండించి యావనంబు నిష్కంటక మొనరించి తపసింగూడి సిద్ధాశ్రమంబునకు నిజానుజ ద్వితీయుండై యరిగెను అట విశ్వామిత్రుండు వారి నాదరించి, నిజ యత్నీకృతంబైన జన్నంబు సాగించుట కుపక్రమించి సంరక్షణార్థము రామలక్ష్మణుల నియమించి దీక్షవహించెను. అపుడా హోమకుండమున పూర్వోక్త రాక్షస ద్వయము రక్తమాంసములను పై నుండి వర్షింపఁ దొడంగిరి. మహా పరాక్రమ వంతుఁడైన దశరథాత్మజాగ్రేసరుండు తమ్ముఁడు సహాయుండై యుండఁగా యా దనుజులలో సుబాహుఁడను వాని నొకవాడి తూపున నేలఁబడఁగూల్చి మారీచు నొకయమ్మున నంబరమున కెగరఁగొట్టుటయు వాఁడా విసరుచే మీఁదికెగసి వాయువశంబున నెగసిన తృణఖండముంబోలెపోయి సముద్రంబులోబడి ప్రాణంబులు దక్కించుకొని పాఱిపోయెను. ఆదుష్టుల యుపద్రవము తొలంగుటచే మునీంద్రుని జన్నంబు నిర్విఘ్నముగా సంపూర్ణము గావింపఁబడెను విశామిత్రుఁడు యజ్ఞదీక్షను వీడి మహాసంతోషముతో రామలక్ష్మణుల నాలింగనముఁజేసి వారికి బహు శాస్త్రంబుల నుపదేశించి మిథిలాపురంబున జనకమహారాజు చేయు యజ్ఞమును చూచుట కనెడి కారణముతో వారల దనవెంటఁ దోడ్కొని యచ్చోటికిఁ బోవుటకు ప్రయాణంబై నడి

—(*) అహల్య శాపము తొలగుట. (*)—

చెను. వారు ముగ్గురును నరణ్యమార్గంబున చాలదూరము క్రమక్రమముగానడిచి గౌతమాశ్రమము జొచ్చిపోవుచున్న యవసరమున, తత్పూర్వము మహాత్ముఁడైన గౌతమునివలన శపింపఁబడి శిలారూపంబున నటబడ్డియున్న యమ్మునిపత్నియైన యహల్య రామచంద్రుని పాదధూళిపై సోఁకిన కారణమున శాపముతీరి నిజస్వరూపమునొంది రామలక్ష్మణులు

మ్రొక్కిన వారి నాశీర్వదించి యప్పు డచ్చోటికివచ్చిన నిజవల్లభునిం గూడి కుటీరంబున కరిగెను. అంతట దారిం దోఁచెడి విశేషములను గూర్చి యనేక విషయంబులు రామలక్ష్మణులకుం దెలియఁ బలుకుచు వారిం దోడ్కొని మిథిలఁ జేరి జనకుని కొలువుఁజొచ్చి యతనిచే పూజితుఁడై రామలక్ష్మణుల వృత్తాంత మెఱిగించుటయు, రాజన్య శిఖామణియైన జనకుఁడు వారినెంతయు మర్యాదఁగావించి గౌరవించెను. పిమ్మట జనకునింట బహుదినంబుల నుండియున్నను మనుష్యమాత్రుల కెత్తుటకు సాధ్యము కానిదియు నయిన హరుని విల్లును మునిపతి యాజ్ఞచే నెక్కుబెట్టఁబూని తృణప్రాయంబుగా గైకొని యల్లెత్రాడును బిగించుటయు నవ్విల్లు పెళ్లున రెండుతునుకలయ్యెను. ఆ శరాసన మెక్కుబెట్టిన వానికి తన కుమార్తెయైన సీతనిచ్చి పెండ్లి గావింతునట్టుల జనకుండు ప్రతిజ్ఞఁజేసి యున్నందున, నపుడు రామచంద్రునకు జానకినొసంగ నిశ్చయించెను. విశ్వామిత్రుండు సంతోషించి దశరథునితోడ సంబంధముఁ జేయుట మిగుల శ్లాఘ్యమైన కార్యమనియు మఱియుం గల యతని నందనులకు నయితము పెండ్లిగావింప వలసినదనియుం జెప్పుటయు సంతసించి జనకుండు తన పుత్రికలైన సీతను, ఊర్మిళను రామలక్ష్మణులకును తన తమ్ముని తనయలైన మాండవీశ్రుతకీర్తుల నెడివారల భరత శత్రుఘ్నులకును నొసంగుటకు నిశ్చయము గావించి లగ్నపత్రిక వ్రాయించి దశరథునకుఁ బంపెను. ఆముహూర్త శుభలేఖం గాంచి యానృపాలుం డానందంబుఁ జెంది బంధు మిత్ర గురుమంత్రి పరివార సమేతముగా పయనమై మిథిలానగరంబున కరిగిన యతని యాగమనం బెఱిఁగి జనకమహారాజు మహావిభవంబుతోడ నెదురుచని సౌమ్యభావంబున తగిన మరియాదలతోడ దోడ్కొనివచ్చి యుచితసాధనమునవిడియించె అంతట విశ్వామిత్రుండు రామలక్ష్మణులం గొనివచ్చి వారితండ్రికప్పగింతచేసెను. జనకునకు వినమ్రులై రామలక్ష్మణులు నమస్కరించినవారిని దీవించి యాపుడమిఱేఁడు గాధేయు ననేక విధంబులఁ బ్రస్తుతించె. అటుమీఁదట పెద్దలచే నిర్ణయింపఁబడిన సుము

—(*) దశరథాత్మజులకు వివాహము జరుగుట. (*)—

హూర్తమున మిథిలావిభుండు విధ్యుక్తంబుగా వంశ మరియాదల ననుసరించి జరుపవలసిన కార్యములు జరిగించి శుభలగ్నంబున సీత నొసంగి రామునకును, లక్ష్మణున కూర్మిళనొసంగియు, మాండవీశ్రుతకీర్తుల భరతశత్రుఘ్నుల కొసంగియు పెండ్లిగావించి భూసుర బృందములకును యాచ



శ్రీరాములువారికి వివాహము జరుగుట.

కులకును ననేక దానధర్మములు గావించి యల్లుండ్రకును, కుమార్తెలకును నగణిత మణిభూషణాంబర ధనకనక వస్తువాహన, దాస దాసీజనములను బహుమతిగా నొసంగెను. ఇటుల మహావిభవంబున వివాహకార్యంబు నెఱవేఱుటయు, దశరథుండు జనకుని యనుమతినొంది కోడండ్రును గొడుకులనుం దోడ్కొని పూర్వోక్త విధంబున పరిభవ సమన్వితుండై యయోధ్యాపురంబునకు ప్రయాణంబై వచ్చుచుండ మార్గంబులో కానన మధ్యంబున మహా పరాక్రమశాలియైన పరశురాముం డడ్డపడి బెదరించి శ్రీరామునిచే భంగ మొంది గర్వంబువీడి యటనుండి వెడలి పోయెను క్షత్రియకులభయంకరుండైన జమదగ్నినందనుం డవ్విధంబున ముక్తబలుండై యరుగుటయు సంతసించి పంక్తిరథుండు బహువైభవంబున నయోధ్యం దరిసి, పౌరుల జయధ్వాన మతిశయింపగా పురప్రవేశము గావించి యెల్లరకును నుచిత క్రమంబున ననేకములైన బహుమానము లొసంగి సంతృప్తులంగావించె. తదనంతరము కొలది దినంబులకు తలిదండ్రులయొద్దను, రామచంద్ర భూనందలయొద్దను శలవుగైకొని తన తాతగారైన కేకయావనినాథునింటికి మాతుల ప్రభృతులం జూచి వచ్చుటకై భరతుండు శత్రుఘ్నునిం దోడ్కొని ప్రయాణంబై పోయెను. అటుల వారలరిగినంతట కొన్ని దినంబులకు దశరథమహారాజు తాను వృద్ధుండై రాజ్యభారంబువహించి నిర్వహించుటకు శక్తి సన్నగిల్లుటయు, ప్రజాపాలనంబునకు జ్యేష్ఠపుత్రుండైన రామచంద్రుండు సర్వవిధములం దగినవాండై యుండుటయు, నదియునుంగాక సకల జనులును నతనియం దత్యంత ప్రీతి గలవారై తమ కతండే రాజుగావలయుననెడి కోర్కెమీఱఁగా నపుడపుడు ప్రస్తావ వశంబున తమ యభిప్రాయములను సూచించుచుండుటయుం దలంచి సకల కల్యాణ గుణాభిరాముండైన రామునకు పట్టాభిషేకమొనరించి ధరాపాలన భారం బతనిపై మోపి తాను విశ్రాంతిం గైకొనుటకు నిశ్చయించి వసిష్ఠాదులైన పెద్దలతోడను, మంత్రి సామంత ముఖ్యులతోడను తద్విషయంబునుగూర్చి యాలోచించి వారలందఱును తమపరిపూర్ణమైన సమ్మతముం దెలుపుటయు సంతుష్టుండై లగ్నమునిశ్చయముం జేయించి పురాలంకారాది కృత్యంబులు జేయించుటకును, వలయు సకల సంభారంబులును సేకరించి కొఱంతలేక సన్నాహంబంతయు గావించుటకునుం దగినవారల నియమించి పట్టణంబునను, తనదేశంబు కడకును, శ్రీరామభద్రుని పట్టాభిషేక మహోత్సవ వృత్తాంతమును చాటంబంచెను.

మహీపాలుండే యేపనుల కెవ్వరెవ్వరిని నియమించెనో వారు వారాయా కార్యంబుల నతి చాతుర్యంబున బహు శీఘ్రంబుగా నొనరించి యావర్తమానము రాజున కెఱింగించిరి. సర్వకార్యములును సిద్ధంబయ్యె. అయోధ్యానగరం బత్యంతశోభాయమానముగా నలంకరింపఁబడి, యమరావతీ యలకా నగరంబులకంటె నెక్కుడు రమణీయమైనదిగా కనుపట్టుచుండెను. పౌరులు తమతమ మందిరంబులు శృంగారముగావించి రఘునందన

—(*) దశరథుండు రామునికి పట్టంబుగట్ట యత్నించుట. (*)—

నుని పట్టాభిషేక మహోత్సవంబుఁ గాంచి యానందించుట కువ్విళ్లూరుచుండిరి. దశరథా వనితల నాయకుండు మహా సంతోషంబుతో మహర్షి శ్రేష్ఠులను సద్బ్రాహ్మణోత్తములను, సామంత భూకాంతులను, బంధు మిత్ర జనంబులను నాహ్వానించి యందఱకును సముచితంబులైన విడుదలిప్పిస్తూ విడియించి శ్రీరామచంద్రునకును, సీతాదేవికిని మంగళస్నానముఁ జేయించి యనర్ఘ భూషణాంబర పుష్పచందనా ద్యలంకృతులం గావించి మఱునాఁడు సింహాసనాసీనుం జేసి పట్టంబుఁగట్టుటకు సంసిద్ధుండై యుండెనుఁ. ఆసంఖ్య జనంబు లమ్మహోత్సవంబును జూచుట కరుదెంచిన కారణమున నయోధ్యానగరమున జన బాహుళ్యంబు కతని నెంతుజూచినను సందు లేక క్రిక్కిఱిసియుండెను. నాఁడా వృత్తాంతమునంతయు బాగుగా దెలిసికొని రామునకు కలుగఁబోవుచున్న సామ్రాజ్య భోగసిద్ధియు, సకల జనానురాగ పాత్రుఁడై పట్టాభిషేకార్హాలంకారములతోడ నొప్పుచున్న యతని శుభలక్షణములుం దలంచి యసూయనొంది, కైకకు పుట్టించి వారు ప్రీతిపూర్వకముగా నొసంగినదియు, సదా కైకకు ప్రాణతుల్యమై వర్తించుచు, మహా చనువుగలిగి కైకకు ప్రీతి బాజనంబైనదియు నగు మంథర యనెడి పేరుగల పరిచారిక తన యెడల రామచంద్రుండు చిన్నతనమునఁ జేసియుండిన దేదియో యల్పాపరాధంబు మదినిడికొనిపగఁగొని సమయంబున తటస్థించినపుడా పగఁదీర్చుకొన నెంచియుండి యపుడా విరోధంబును దలంచి యెటులనైన రాముని పట్టాభిషేకంబు విఘ్నంబుగావింప వలయుననెడి దురుద్దేశముగలదియై వెరవాలోజించి నిశ్చయించి కపట భయశోకంబులు గనఁబడఁజేయుచు దీనవదనంబుతో బిరబిర కేకయ రాజనందన సదనంబున కరిగి తన యెఱింగిన విషయంబుఁ జెప్పి తత్పూర్వము దశరథుండు వాగ్దానముఁ జేసియున్న వరద్వయంబు నడిగి కైకొని, రామునకు చేయదలంచియున్న రాజ్యాభిషేకమును మానిభర

త్తునకుఁ జేయవలసినదనియు, రాముఁడు నారచీరలుదాల్చి పదునాలుగేడు లడవులలో వసింపవలసినదనియు నిర్ణయింపుమనియు, నటుల చేసితివేని నీకును నీకుమారునకు సౌఖ్యంబు గలుగును గాని లేకున్న లేదనియు చెప్పి పట్టుపట్టి దుర్బోధగావించి మహా ప్రయాసమున నామెను సమ్మతించునట్లు చేసెను. కైకయా మాయలాడియైన దుష్టచిత్త మాటలకు లోనై పతి మందిరమునకు రాగానే కపటపుటలుక నభినయించి యతని చిత్తమును రాదీసి తనకు మంథర బోధించిన ప్రకారముగా జరిగించెను. కైకకుపుట్టిన దుర్బుద్ధికై దశరథుండు మిక్కిలి చింతించి యేమియుంబలుక లేక మూర్ఛాక్రాంతుఁడయ్యె. అంతట మతిలేని యాకేకయ రాజపుత్రి తానే రామచంద్రునిఁ దన యింటికి బిలిపించి నిజోద్దేశము నెఱింగించి "నీతండ్రి వాక్యముల నసత్యములు గాకుండునట్లు చేయు"మని చెప్పెను. సకల శుభగుణములకును నిక్కమైన రాముఁ డామె తలంపు నెఱింగి జనకు నివాక్యములు పాలించుట తనకు కర్తవ్యమని తలపోసి కైకయుద్దేశించిన ప్రకారము జరిగించుటకు పరిపూర్ణమైన సమ్మతిని గనపరచెను. అపుడా వార్త నగరంబంతయు వ్యాపించిన కతంబున కైక దురుద్దేశమునకై దుఃఖించి పురజనులు, నాగతులై యున్నవారును నామెను దూషింపఁ దొడంగిరి. కౌసల్య సుమిత్ర మొదలుగాగల యంతఃపురకాంతలు దుఃఖ సాగరమున మునింగి వాపోవుచుండిరి. పరమ పతివ్రతారత్నమైన జనక నందన తానును పతితోడ కాననంబులకుబోవుటకు సిద్ధమయ్యెను. రాఘ వేశ్వరునియందు మహా భక్తిగలిగి క్షణమైన నెడబాసి యుండఁజాలని లక్ష్మణుండును నతనివెంటఁ బోవుటకు ప్రయాణంబయ్యెను. కైక తానే యా ముప్వురకును నారవస్త్రములు తెప్పించి యిచ్చి వానిని ధరించి పొండని యాజ్ఞాపించెను. సీత దక్కతక్కిన యిరువురును తమ భూష ణాదులఁ దీసివైచి యామె యొసంగిన చీరలు కట్టుకొని మునివేషంబులు దాల్చిరి. సీతాదేవియు నారచేలమును గట్టుకొనెను. అంతట రామ లక్ష్మణులును, ధరాసుతయు నిష్కళంకచిత్తులై మూర్ఛిల్లియున్న తండ్రి కిని కైకకును నమస్కరించి నగరువెలువడి వచ్చుచుండగా గని పుర జనులు వారికా కైకవలన తటస్థించిన కష్టములం దలంచియు వారు ధరించిన వేషములం గాంచియు నెనలేని దుఃఖమును జెందుచుండిరి. పట్టాభి షేకమహోత్సవాలోకన సంతోషమున నుండిన వారందఱును నపుడు దుఃఖభాజనులై సంతాపించిరి క్షణమున వారియానందమును శోకముగా

మాఱిపోయెను. ప్రజలటుల చింతాక్రాంతులై యట్లుచూచుచుండ సీతారామలక్ష్మణులు కౌసల్యాదులకును, వసిష్ఠాదులకును మ్రొక్కి శోకించుచున్న వారిని శాంతవచనంబుల నూరార్చి యయోధ్యా నగరంబును విడిచి యరణ్యమునకు ప్రయాణమై మంత్రి సత్తముఁడైన సుమంత్రుండాయితంబుఁజేయించి తెచ్చిన తేరునెక్కి పోవఁ దొడంగిరి. రామచంద్రునియం దత్యంత ప్రీతులై యతని మేలునే తమ మేలుగా నెంచుచుండిన పురజనులా పుణ్యశీలుండు భార్యా సోదర సహితుఁడై సకల వైభవంబులనువిడిచి మునివేషంబున నరణ్యమున కరుగుటం జూచి సహింపనోపక తమలో "ఛీ! శ్రీరామచంద్రుఁడు లేకపోయినంతట పాపాత్ములైన యీకైక ముఖముంజూచుచు మన మీపట్టణంబున వసింపరాదు. పరమ దయాకరమూర్తియు భద్రలక్షణాభిరాముఁడును, ధర్మవ్రతుండును, సత్య ప్రవర్తకుఁడునునైన రఘుకులశేఖరుని వెంట నందఱమును కుటుంబములతోడ నడవులకేగి యాపుణ్యస్వరూపుల సేవించుచు కాలము గడపుద"మని దృఢనిశ్చయులై గుంపులు గుంపులుగా నగరంబు విడిచి వారివెంటఁ బోవఁదొడంగిరి.

—(*) శ్రీరాముఁడు సీతాలక్ష్మణులతో కానకేగుట. (*)—

రాఘవేశ్వరుండు వారినందఱను బహువిధంబుల నూరార్చి నిలువరింపఁ బ్రయత్నించెను. కానివారలు "ఓరఘువీరా! క్షణమైనను మిమ్ము విడిచియుండజాలము. మమ్ము వాధింపకు" మని పట్టువీడకవచ్చుచుండిరి. వారు తమవెంట వచ్చుట సమ్మతము గాకున్నను వారి నిశ్చయము నెఱింగి చేయునది లేక రామభద్రుం డెటులనైనను పురంబున కరుగునటుల చేయవలెననెడి యుద్దేశము గలవాఁడై వెరవు నాలోచించుచుం బోవుచుండెను. ప్రజలునుం బోవుచుండిరి. ఇంతవరకును జరిగిన చరిత్రంబాతయు సంగ్రమముగా పాఠకులకు కథాసందర్భంబు తెలియుటకై వ్రాయఁబడినది. ఇఁక నిదిమొదలు రామచంద్రుని వనవాస వృత్తాంతంబు విపులముగా వ్రాయుచున్నాఁడ.





శ్రీరాములవారు వనము కేగుట.

# శ్రీ రామ వన వాసము.

## వచనకావ్యము.

### రెండవ ప్రకరణము.



సీతాలక్ష్మణ సహితుఁడై సుమంత్రుఁడు తెచ్చిన రథంబు నారోహించి యతఁడే తేరు నడుపుచుండగా శ్రీరామచంద్రుండు వనవాసంబున కరుగఁ దొడంగుటయు పురజనులు వారిని విడిచియుండ నొల్లక యరదంబువెంట పయనమై వచ్చుటయు, రాముఁడు వారల మరలింపఁ బ్రయత్నించియు వారు మరలిపోకుండుటయు పూర్వ ప్రకరణమున సంగ్రహముగా వ్రాయఁబడినది. అటుపిమ్మట జరిగిన చరిత్రం బింక వివరించెదను.

—(*) దశరథుఁడు మూర్ఛజెరి విలపించుట. (*)—

శ్రీరామచంద్రుం డయోధ్యవిడచి యరిగినంతట కొంతవడికి దశరథ మహారాజు తెలివినొంది రామభద్రుండు సీతాలక్ష్మణ సహితుఁడై మునివేషముదాల్చి సుమంత్రుండు తెచ్చిన యరదము నారోహించి వనవాసమున కరిగెననుటం దెలిసికొని తలపైఁ బిడుగుపడినట్లు తోఁచిన మొదలు నరికిన వృక్షము తెఱంగున నేలఁగూలి యత్యంత శోకార్తుండై కన్నుల నీరుకాలువలై పాఱుచుండ పరితాపము మించి యేడ్చుచు లేచి మేను దూలుచుండగా భార్యలుచుం దక్కుంగల వారలనుం గూడి రాపురము వెలువడి రామచంద్రుండు పోయిన మార్గమున దృష్టిసాధించి చూచుచు, గద్గద స్వరంబొప్ప "హా రామా రామా! రవికులవంశాంబుధిసోమా! జగదభిరామా సుగుణరామా! నాముద్దుపట్టీ అయ్యయ్యో నిన్ను విడిచి నేనెట్లు జీవింపగలను? నీముఖము నొకనిమిషము చూడకుండిన నెన్నియోదినము లెడబాసియున్న వాని చందమునఁ బరితపించుచుండు వాఁడనైన నే నెవ్విధమున నింక నిర్వహింపుదును. నీవు లేనపుడు యీ రాజ్యమును, సంపదలును, భోగములును నేమిటికి?

పుత్రకా! పుణ్యవర్తనా! జగన్నుత నిష్కళంక చరిత్రా! ఎపుడు నన్ను విడిచి నీవరిగితివో యపుడే నేను ప్రాణరహితంబైన తనువునుం బోలె నిస్తేజుండనైతి ఇంక నాకీబ్రతుకేల? లోకోత్తర సుగుణాకరుండవైన నీకిటువంటి దుర్దశ నొందనటుల విధించిన విధాతచేత కేమనవచ్చును? కుసుమ సుకుమార గాత్రుండవైన నీవా? వనవాసముం జేయవలసిన వాఁడవు. దుర్గ మారణ్య గమన క్లేశము నెటుల సహింపగలవు? మృదువులును కోమలములునునైన నీచరణములు శిలాకంటక మయప్రదేశముల నడుచుటచేత నెంతకందునో యెట్టిబాధ నొందుదువో, ఏయేకష్టముల ననుభవింపగలవో, తలంచిన నాగుండెలు నీరగుచున్నవి. ఎంతటి కఠిన హృదయునకైనను నీకు తొడరిన దుర్దశ వినిన చిత్తమున నుత్తరపాటు జనింపకుండునా? నేనింక భవన్ముఖారవిందమును కన్నులార నెపుడుచూడగలను? పదునాలుగేడులు నీవియోగ దుఃఖమునోర్చి యుండిన గదా లభించును. క్షణము యుగముగా దోఁచుచున్న నేనంతకాలము జీవించుట యెట్లు? అకటా! దైవమా! నేనేమి చేయుదును? వంశభూషణుండైన నాకుమారుని నృపగణ తారకా నికర సుధాకరుని రామచంద్రుని విడిచి బ్రతుకశక్యమా? ఏమిగతి? ఎందుజొత్తును? నాశోకము దీఱుమార్గమెయ్యది" యని యెలుగెత్తి పలుకుచు పనవిపనవి కండ్లచీకటులు గ్రమ్మగా సత్వంబెడలి, ధైర్యముడూలి, వివశుఁడై మరల మూర్ఛిల్లి నేలఁబడెను. ప్రాణములు తొలంగిన చందమున బడియున్న యమ్మహీవల్లభుని యున్నవిధము గనుంగొని దిగులొంది కౌసల్యయు కైకయు సుమిత్రయు బహువిధముల నుపచారము లొనరించుచుండఁ గొంతవడికి తెలివినొంది మెల్లనఁ గన్నులవిచ్చి రామచంద్ర వియోగ చింతాతిరేక నిమగ్న మానసుండై పరితపించుచు తన కుపచారము లొనరించుచుంచొతనున్న కైకను గనుంగొని మనంబెరియగా "ఓసి పాపాత్మురాలా! ఓకైకా! కఠిన హృదయా! క్రూరచిత్తవును పాపకారిణివియును గు నిన్ను బెండ్లాడిన కారణమున తద్దోషముచే నేనును దోషినగుట తటస్థించినది. వంశ భూషణుండైన నాముద్దుపట్టికిని నాకును నెడబాటు గలిగించి నన్ను దుఃఖసాగర మగ్ననిఁ గావించి యలయించుటకొఱకే నీవు కేకయ రాజునకు పుత్రివై జన్మించి నాకు భార్యవైతివి కాఁబోలు. ఓ దుశ్శీలా! అయ్యో! నీమూలమున నేను ప్రాణములు కోలుపోవలసిన కాలము తటస్థించినది దుర్గుణ రాశివైన నీముఖము జూడరాదు.

వంశ నాశకారిణివగు నిన్ను లోకమున నెవరె మెచ్చెదరు? సూర్యవంశమునకు నీవలన మహోపద్రవము సంభవించిన" దని నిర్దాక్షిణ్యముగా బలుకుచున్న యతని దుఃఖాలాపములు విని కౌసల్యాదులైన యంతఃపుర స్త్రీలును తక్కుంగల యచ్చోట నుండినవారును కైకను బహువిధముల దూఱనాడఁ దొడగిరి. వారి దూషణోక్తులు విని కైక లజ్జావనతముఖియై మాఱు పలుకక తలవాంచి నేలఁజూచుచు మిన్నక నిలిచి యుండెను. అంత దశరథుం డింక రఘూకులేశ్వరుండైన రాముని జూచు భాగ్యము తనకు లభింపదని తలంచి వెంట నుండెడివారు బలాత్కరించి తోడ్కొనిరాగా విలపించుచు మరలి పురముఁజొచ్చి కౌసల్యా మందిరమున కరిగి వ్యసనాధిక్యమున నిలువనేరక తల్పముపై మేనువైచి రామా! రామా! యని రాముని దలంచుచు, కౌసల్యంగాంచి దుఃఖ జలార్ద్ర

—(*) దశరథుండు కౌసల్యతో రాముని కష్టంబుం జెప్పి వగచుట. (*)—

ముఖియై శోకించుచున్న యామెను చేరఁబిలిచి "ప్రేయసీ! చూచితివా దైవతంత్రమును, బళీ! తానొకటి తలంచిన దైవమొకటి తలంచుననుట తథ్యమైనది. సర్వ సన్నాహములును గావించి పట్టాభిషిక్తుడై కన్నుల పండువుఁ జేయునటుల నభిషిక్తు నొనరింప నిశ్చయించి యుండిన నాయత్నమంతయు వృథయై పోయెనుగదా! క్రూరచిత్తయైన యాకైకవలన నింతదుఃఖ మందఱకును సంప్రాప్తమైనది. ఇటువంటిపాపాత్మురాలెందైనం గలుగునా? అయ్యో! తన కుమారునకు పట్టాభిషేకమును జేయఁ దలంచిన యటులనేచేసి యానందింపరాదా? సుకుమారమూర్తిని, సుగుణనిధిని, లోకప్రియుని, న్యాయశీలుని, సజ్జనవందితుని, సకల ధర్మజ్ఞుని నాప్రాణతుల్యుండును రఘుకులశేఖరుండునునైన రామచంద్రుని దయారహితయై యడవులకు బనుపనేమిటికి? తన యెడల నతఁడేమి యపరాధ మొనరించెను

దైవమునయితము కైకకే తోడై మదీయసంతోషమునకు సహింపక యివ్విధమున రామునకును నాకును వియోగము గలిగించెను దైవము పాపాత్ములకే సహాయముగా యుండునని పెద్దలు చెప్పుదురు. అది కల్లయగునా? నాప్రియ నందనుడగు రామచంద్రుం డిప్పటి కెంతదూరము పోయియుండునో, ఏ వృక్షముల నాశ్రయించెనో, కాయగసరులు దిని యెవ్విధమున కాలము గడపునో, కోమలమైన దేహమెంత వాడినదో, యేకష్టములు తటస్థించెనో గదా! అడుగైనను నడువఁజాలనిదియు సుకు

మార శరీరిణియు నెండ కన్నెఱుంగనిదియునై పరిచారకులవలన పనులు గొనుచు హాయిగా తూఁగుటుయ్యాలపై మృదులమగు తలగడనాని యూఁగుచుండిన భూపుత్రియెటుల క్లేశపడుచున్నది. యోపల్లవ కోమలము లైన యామె పదము లడవిలోని రాలును ముండ్లునుం ద్రొక్కుచు నడచుటచేత నెటుల కందియుండునో యెంత నొచ్చియుండునో, తన యన్న నొక నిమిషమైన యెడబాసియుండనివాఁడైన సౌమిత్రి కైకవలనఁ గలిగిన యీ మహాకష్టమును దలంచి యిదియంతయు నావలన గల్గిన నేరముగా నెంచి నన్నెవ్విధమున దూఱెనో, వారిగతి యెట్లైనదియు, నెచట నున్నదియుం దెలియుట యెట్లు? కోమలాంగియు ప్రియ సతియునైన జనకనందన నడువఁజాలక కష్టపడుటంగాంచి రాముండు తనలో నేలాగున చింతించుచున్నవాఁడో, హా! ఈశ్వరా! నాదుఃఖమునకు మేరయే లేదు. నేనెటుల జీవింపగలనో తెలిసినదికాదు. రామచంద్రుండు లేకపోవుటచే నాకన్నుల కీపట్టణము జనశూన్యంబైన గహనమువలె కనుపట్టుచున్నది" యని చెప్పిచెప్పి పలవించుచుండగా, కౌసల్యా సుమిత్రాదులు "పాపజాతియైన కైకవలన పరమయోగ్యుండైన రామచంద్రుఁడనుజసతీ సహితుఁడై యరణ్యమునకు బోవుటయు మన మందఱమును నంతములేని యిట్టివంటి చింతాసాగరమున మునింగి తల్లడించుటయుం దటస్థించినది. ఈఫలమును కైక యనుభవింపకపోవునా?" యని వ్యసనాధిక్యత వలన తమకు తోఁచిన చందమున బలుకుచు వాపోవుచుండిరి. అయోధ్యానగరము కళాహీనమై శోకదేవతకు నిలయమై పాడుపడినదియుం బోలె కనుపట్టుచుండెను.

—(*) రామచంద్రుండు సీతాలక్ష్మణులతో తమసా నదీతీరంబుఁ జేరుట. (*)—

అయోధ్యాపుర వృత్తాంతం బిట్లుండ నట రామచంద్రుండు సీతా లక్ష్మణ సహితుఁడై సుమంత్రుండు త్వరితముగా తేరు నడుపుచుండగా సూర్యాస్తమయ కాలమునకు తమసా నదీతీరముఁ జేరి రథము నిలుపుమని డిగ్గి జనకనందననుడించి సౌమిత్రినిం దిగుమని చెప్పి "సుమంత్రా! ఈరాత్రి కిచ్చోట విశ్రమించి రేపటి ప్రొద్దుపొడుపునతరంగిణిందాఁటుదమనిన యతఁడు సమ్మతించె. అంత యానదిలో దిగి సంధ్యాకాల కృత్యంబులుదీర్చి యందలి మధురజలంబులు పానంబుఁజేసి యట నొక

చోట దర్భలను బరచుకొని విశ్రమించెను. సీతాలక్ష్మణులును కెలన నటులనే శయనించిరి.

ఆహా! కాలమహిమ నెవ రెఱుంగుదురు? మృదుతర శయ్యాతలంబున హాయిమీఱ శయనించు శ్రీరామభద్రుండు కటికనేల దర్భలు శయ్యగా బవళింపవలసి వచ్చెను గదా విధి చెయిదమునకు విరోధము గలుగునా? అటులవారు విశ్రమించుటయు వెంటవచ్చిన జనులును తమకు రాఘవేశ్వరుని సేవించుచుండుట దక్క మఱియేమియుం గావలసినదియే లేదను నిశ్చయము గలవారై యయోధ్య మాటనే మఱచి తామును నచ్చోట రామాదులకు కొంచెము దూరముగా శయనించి మార్గాయాసము పెంపున గాఢ నిద్ర జెందిరి. తనయందు గల భక్తి ప్రియముల పెంపున పౌరు లారీతి కష్టము లొందుచు వెంట వచ్చుటయు, వారి యలసటయుం గాంచి వారు తనవెంట వచ్చుటయు నిండ్లు వాకిళ్ళు విడిచి యడవులలో వెత లొందుటయును యుక్తము గాదని యెంచి రామచంద్రుండెవ్విధముననేనియు మరల వారిని పురముం జేరునటులం జేయవలయునని తలంచి వెరవును యోచించి మెల్లగా సుమంత్రునిం బిలిచి యిట్లనియె.

—(*) శ్రీరాముఁడు పౌరుల గికురించి తమసా నదిని దాఁటిపోవుట. (*)—

"ఓయి సుమంత్రా ఇటు చూచితివా! ఈ ప్రజలు నాయందు తమకుఁగల ప్రియాతిరేకమున నన్నువిడిచి పురమున నుండనొల్లక నా వెంట ప్రయాణమై వెతలను సయితము లెక్కచేయక గహనమునకు వచ్చుచున్నారు. అయ్యో! నాకొఱకై వీరిటుల కష్టము లనుభవించుట న్యాయమగునా? ఎన్నివిధములఁ జెప్పినను నామాటలనువినరైరి. పాపము, అపుడే యెటుల నలసిపోయి గాఢనిద్రా పరవశులై యుండెదరో కనుము. వీర లిటుల ప్రయాస లొందుచుండగా నేను చూచుచుండఁ జాలను. నామనంబోర్వదు. ఏ యుపాయముచేత నేనియు మరల వీరి నయోధ్యకుఁ బోవునట్లు చేయవలయును. అటులఁ జేయకున్నచో నాచిత్తంబున నుత్తరపాటు తొలంగదు. దీనికి నేనొక విధమైన వెరవుఁ దలంచినాను, ఆలాగు గావించి త్వరితముగా వీరిని విడిచిపోవుట మంచిది. ఎట్లనగా, నీవు సడిలేక రథంబుఁబూన్చి కొంతదూర మయోధ్యాపుర మార్గముగా బోవనిచ్చి యటుతరువాత జాడ యేర్పడకుండు చోటనుండి దారిఁ దప్పించి తప్పుదారుల రథమును ద్రిప్పుకొని యతి శీఘ్రముగా వచ్చి మమ్మా తమసానది దాఁటించికొని పొమ్ము.

వీరు మేల్కాంచి రథ సహితముగా మన మిచట లేకుండుటం గని జాడనుబట్టి మరలి మన మయోధ్యకే పోయినారమని యెంచి ముక్తదుఃఖులై తాము నయోధ్య కరుగుదురు. అంతట నావ్యాకుల మడంగును. వీరును సుఖమున నుండగలరు. ఇప్పటికి కిదియతగిన యోచన ఒక వేళ నయోధ్యకు పోయినంతట నచట నేను రాకుండుటం దెలిసికొనినను మరల నావెంట రాఁదలంపరు. ఎందువలననగా, యరణ్యమున నింక నన్ను తాము కనుకొనఁజాలమని నిరాశులై యేమరి వచ్చిన తమ పొరబాటునకు చింతించి పిమ్మట స్వస్థచిత్తులై యుండగలరు. కర్తవ్యము దీనికిమించి మఱియేదియు దోఁచలేదని చెప్పెను. బుద్ధిమంతుఁడైన యా సుమంత్రుఁడు రాఘవేశ్వరునకు ప్రజలపైఁగల దయావిశేషమున కెంతయుం బ్రమోదమొంది తనకు రామచంద్రుండు చెప్పిన చొప్పుననే యరదమును కొంతదూర మయోధ్యా పథమున నడిపి తప్పుదారులం ద్రిప్పి కొనివచ్చెను. అప్పటి కర్ధరాత్రి యయ్యెను. నిద్రించుచున్న పురజనులకు దెలియకుండునటుల రామభద్రుండు సీతాలక్ష్మణుల మేలుకొలిపి వారి తోడ రథారోహణముచేసి సుమంత్రుండు రథము నడుపగా తమసా తరంగిణి నుత్తరించి పోవుచున్న సమయమున రఘువీరుండు తత్తీర భూవన దుర్గములను భూమిజకుం జూపుచు, నటనట జనపదములను గురించి వర్ణించి చెప్పుచు పోయిపోయి సూర్యోదయ కాలమునకు వేగవతీనదిని దాఁటి పిమ్మట సరయూనదిని గడచి నిలువక ప్రయాణముఁ గావించి సాయంసమయమునకు గంగానదీ తీరముఁజేరి యచ్చోట గొప్పదిగా పెరిగియున్న యొక గార చెట్టుచెంత రథావతరణం బొనరించి విడిసె.

ఇవ్విధంబున రఘువీరుఁడు పురజనుల నేమరించి పోయి నంతట నట తమసా తరంగణి తీరమున నిద్రించుచున్న పౌరులు సూర్యోదయ కాలమున మేల్కాంచి, రామలక్ష్మణులంగానక యాశ్చర్యమున నివ్వెఱపడి నలుగెలంకులను వెదకి తేరు సాకేతపుర మార్గమున జనియున్న జాడఁగను గొని రామచంద్రుండు నిద్రించుచున్న కతమున తమ్మమేలు కొలుపక మరలి యయోధ్యకే పోయెననెడి తలంపు గలవారలై కదలి తాము వెంట బోవకుండిన నేరమునకై చింతింపుచు త్వరిత గమనమున నయోధ్యకేగి యానగరము తమ వచ్చునప్పటి చందముననే రామలక్ష్మణులు లేక యమంగళకరంబై కనుపట్టుటయు, రాఘవేశ్వరుం డయోధ్యకురాలేదనియు, తమ్మునివిడిచి నిశాసమయమున నేదిక్కుగా నోపోయె

ననియు, నింక వారిని కనుగొనుట దుర్లభమనియు నెంచినవారై దురంత చింతాకలిత స్వాంతులై రామచంద్రునిం దలంచుచు చేయునది లేక తమ తమ గృహములయందు జేరి వగచుచుండిరి అట శ్రీరామచంద్రుండు సీతాలక్ష్మణ యుతుండై వచ్చియున్నవాడన సేవకులవలన తత్ప్రాంతా రణ్య ప్రభుండైన గుహుండను పేరుగల బోయతేఁడు విని మహా సంతోషముతో పెక్కు రత్నాంబర విభూషణాదులను కానుకగా గొని దర్శనార్థియై చనుదెంచి మహాభక్తితో నమస్కరించి రాజచిహ్నము లెవ్వియును లేని యవ్విధమున మునివేషములతో నుండెడి వారిఁదిరుం గని వెఱఁగంది చేతులు మొగిచి "రఘుకులేశ్వరా! హేరామచంద్రా! నీయున్న వేషమును జూడగా నధిక సందేహమును నాశ్చర్యమునుం బొడ ముచున్నది. వెంట సైన్యము లేక రాజాడంబర మెట్టిదియుంగలుగక తపస్వి చందమున నారచీరలుదాల్చి యనుజుండును జనకనందనయు నీచందమున వల్కలాడినధరులై వెంటరాగా నీవిటుల నరణ్యమునకు వచ్చుట కేమి కారణము? దేవా! నీకివ్విధమున సంకటమును కలిగించిన దుర్మార్గుం డెవ్వఁడు? వాని నెఱిగింపుము.

ఈక్షణమున వాని గర్వంబడంచి మదీయతీక్ష్ణ శరజాలములచే య మసదనమునకుం బుచ్చి నూడుఁదీర్చెదను మీ సేవకుఁడనైన నేను యెంత పనికైనను జాలి చేయుటకు సంసిద్ధుఁడనై యున్నాఁడ. మీ యనుజ్ఞయైన చాలును. స్వామీ! సేవకున కేమియానతియో శలవొసం గుడు" అని పలికెను. అతని మాటలు విని రామచంద్రుండునగి కరుణా వి లోకనము లతనిపైం బ్రసరింప విలోకించి యిట్లనియె "నిషాధేశ్వరా! నీకు నాయందు మిక్కుటమైన భక్తిగలుగుట నే నెఱుగుదును అదియును గాక నీవెంతటికైనం జాలిన శౌర్యవంతుఁడవు. నాకొఱకై యెంతటి కష్టకార్యమును చేయుటకుగాని వెనుకంజవేయువాఁడవుకావు. భవద్వచ నమునకు మిగుల సంతుష్టి నొందినాఁడనుగాని, అయినను నీవు చెప్పిన లాగున పగతురవలన నేమియు నాకు సంకటముగ కలిగినదిగాని తత్కా రణముననే నిటువంటి వేషమునుదాల్చి వచ్చినదిగాని లేదు. దీనికి నిమి త్తము వేఱు. చెప్పెదను వినుము" అని పలికి, తాను మునివేషముతో వచ్చుటకు కారణమైన వృత్తాంతమును సర్వమును నుడివి యతని యను ద్రేకమును వాదించి శాంతచిత్తుని గావించెను.

రామచంద్రుండు చెప్పిన యుదంతం బంతయు శబరనాయకుండు
విని కైకచేసిన పాపకృత్యమునకును, నివారించుటకు శక్తుండై యుండియు
నామె యిష్టానుసారముగా జరిగించుటకు సమ్మతించిన దశరథ నృపాలుని
యవివేకమునకును, పరమ సాధుశీలుండును, సద్గుణధాముండునునైన
రాఘవేశ్వరునకుం దొడరిన దురవస్థకును, మహా భోగము లనుభవించు
చుండవలసిన వాండైన యానృపకుల శేఖరుండు సామాన్యుని చందం
బున ననుజునితోడను భార్యతోడను తాపస వేషములు ధరించి
యరణ్యముల వసించుటకై పురమువిడిచి వచ్చుటయుం జింతించి మిక్కిలి
వ్యసనాక్రాంతుం డయ్యెను రామచంద్రు డతని దుఃఖము నెఱింగి
యూఱట మాటలు బలికి శాంతచిత్తునిం జేసి సంధ్యాకాల కృత్యములు
నిర్వర్తించి శబరపతి తెచ్చియిచ్చిన ఫలము లాహారించి భూమిపై శయ
నించి నిద్రించె. సీతాదేవియుం గూర్కు జెందియుండె. లక్ష్మణుం
డయోధ్యనుండి ప్రయాణంబై వచ్చునపుడే వనవాసముం జేయవలసి
నట్లు కైకవలన నిర్ణయింపఁబడిన పదునాలుగు సంవత్సరములును కడచి
మరలి యయోధ్యకు చేరువరకును, రేయుంబగళ్ళు నిద్రలేకయుండి రా
మమూర్తి కెట్టిసంకటమును గలుగనీయక కాచియుండి సేవించుటకు శప
థమునుబూనియున్న కతముననతండు నిదురబోవక ధనుర్ధరుండై మేల్కా
నియుండి రఘువల్లభుని దురవస్థకు దురపిల్లుచు తనవలెనే నిదురబట్టక
చింతానిమగ్నుండైయున్న గుహునింగని భూశయ్య నొడళ్ళు దెలియక
నిద్రించుచున్న సీతారాముల నతనికిం జూపుచు చింతాకుల మానసుండై
యిట్లనియె.

శబరవల్లభా! నిరుపమాన సామ్రాజ్య భోగానుభవుండగు యా
నృపకుల శిఖామణియైన రాఘవేశ్వరుండు యివ్విధమున కటిక నేలం
బరుండి భార్యాసహితముగా నిద్రించుచున్నాండు చూచితివా! పాపమతి
యైన కైక నిమిత్తమున నీపురుషోత్తమునకు యిటువంటి కష్టము సంప్రా
ప్తించినది ఈపుణ్యాకథనునింగనిన కౌసల్యయు నామెకు తోడుగా సుమి
త్రయు ననుభవించుచుండెడి దుఃఖంబింతయని వర్ణించి చెప్పుటకు సాధ్య
ముకాదు. చూచినవారికే యెఱుక. రాఘవేశ్వరుం డెంతబుద్ధి విశే
షము కలవాండయ్యు, ఈ విషయంబున తన వివేకము నుపయోగింపక
తప్పు నడిచినాండు. ఏమనగా, ఆకైక, యాక్రూరురాలట్టుల కోరినపుడు
తానేల సమ్మతింపవలయును? ఆమె మాటల నేల నిరాకరింప కూడదు?

తనకు ముప్పు గలుగు పనిని చేయవలసినదని యొకరు మతి హీనులై చెప్పిన పక్షమున యా కార్యమును నిరాకరించుటచే గలిగెడి నేరమే య్యది? ఇదియే రామభద్రుం డొనరించిన పొరబాటు, కావుననే యిటువంటి దుర్దశ సంప్రాప్తించినది. ఇంక వగచిన ప్రయోజనము లేదుగదా విధి కృతంబు నెవ్వరును దప్పింపజాలరు. వీరి కష్టములను జూచుటకు నా మనం బోర్వకున్నది. ఏమిచేయుదును?" అని రాత్రి యంతయుం దత్ప్రసంగముతోడనే వ్యసనచిత్తంబున కడపెను. రామభక్తుండైన యా గుహుండును నటులనే యుండెను, పిమ్మట ప్రభాతంబయ్యెను.

—(*) రామాజ్ఞచే సుమంత్రుఁడు రథంబుఁగొని యయోధ్యకేగుట. (*)—

అంతట రామచంద్రుండు మేల్కాంచి కాలకృత్యంబుల దీర్చి సుమంత్రుం జేరఁబిలిచి, "మంత్రిశేఖరా! ఇకమీఁదట మేము రథారోహణంబుచేసి చనుట యుక్తంబుగాదు కావున నీవు మరల తేరుంగొని త్వరితముగా పురంబునకేగి సత్యశీలుండైన మాతండ్రికిని, తల్లులగు కైక, కౌసల్యా సుమిత్రలకును మేము నమస్కరించితిమని చెప్పుము. మేము వనవాసంబునకై వెడలుటచే మాకొఱకు మిక్కిలి శోకించుచుండెడి కౌసల్యాదులకును, మహీనాథునకును దుఃఖోపశమనంబుఁ జేయుచుండుము. ఆలస్యముఁ జేయకుము పొ"మ్మని చెప్పుటయు వారినివిడిచి పోవుటకు సమ్మతిలేక సుమంత్రుం డత్యంత విషాదపూరిత మనస్కుఁడై "హే రామచంద్రా! మిమ్ము వీడి యయోధ్యకేగుటకు నామనం బొల్లకున్నది నేను పోఁజాలను. వట్టిదైన యీ తేరును దోలుకొనిపోయి యచ్చోట మిత్రులకును బంధువులు మొదలుగాఁగల వారిని నే నే మని చెప్పుదును? అయ్యో! మిమ్ము నరణ్యమున విడిచివచ్చితిని గదా చెప్పవలయును. అటుల పలుకుటకు తెగింపలేను. నాలోన దుఃఖం బతిశయించుచున్నది. రఘుకులేశ్వరా? అయోధ్యాపుర వాసంబుఁజేయుట నాకిష్టములేదు. నేనును మిమ్ముఁగొలిచి మీవెంటవచ్చెద నాయందు దయఁగలవాడవై నా యాగమనంబునకు సమ్మతింపు" మని కన్నులనుండి శోకాంబుధారలు గాఱగా బోరున నేడ్చెను. అతనికి తనపైఁగల విశ్వాస ప్రియంబుల నెఱింగినవాఁడగు దాశరథి శాంతవచనంబుల నూరార్చి యిట్లని చెప్పెను.

"సుమంత్రా! నీవు మాతోడ గూడి వచ్చుట యుక్తముగాదు. అయోధ్య కేగుటయే మంచిది. ఏలననగా, రిక్త రథంబునుకొని నీవు

పోయినపుడుగాని కైక మేము నిజముగా నరిగినారమని నమ్మఁజాలదు అటువంటి సంశయ మామెకు నివర్తిఁ జేయవలసినది ముఖ్యము కావునఁ నామాటలకు సమ్మతించి నీవరిగి, మేము గంగానదిని దాఁటిపోయినారమనియు నీవు దాటించి రథంబు గొనివచ్చితివనియు నామెకు దృఢముగ చెప్పుము. దీనికొఱకు నీవు పోవలసిన దావశ్యకము. మారాడక శీఘ్రముగాగను"మని గట్టిగా చెప్పుటయు నేమియు బదులు బలుకలేక మహదుఃఖముతో శలవుఁగైకొని సుమంత్రుండు తేరుఁగొని, తిరిగితిరిగి చూచచు చేయునది లేక యయోధ్యకరిగె. పిమ్మట కౌసల్యానందనుండు గుహునిఁబిలిచి మమ్ము భాగీరథిని దాఁటింపుమని చెప్పిన, విషాదంబుతో నతండు పడవఁదెప్పించి తానే కర్ణధారుండై యుండి సీతాలక్ష్మణ సహితుండైన రఘువరుని గంగానదిని దాఁటించి యావలియొడ్డుం జేర్చె సముచితాలాపంబులం గుహుని దిగులుఁ దీర్చి యంతట రఘుకులుం డతని వలన మార్గమును దెలిసికొని తమకు నమస్కరించిన నతని మన్నించి వీడ్కొని యరణ్యమార్గమును బట్టిపోవఁ దొడంగెను.

—(*) శ్రీరాముఁడు జనకనందన కష్టమును గని చింతించుట. (*)—

చనునపుడు భూపుత్రి యడుగులు తడబడుచుండ నడుమసియాడగా నడవఁజాలక మిక్కిలి ప్రయాస నొందుచుండుటం గాంచి యాయబలకు తొడరిన యిడుముల కెంతయు వగచుచు తమ్మునిఁజూచి "లక్ష్మణా! మావదినె పడుచున్న కష్టమును గనుము కఠిన శిలాకంటకమయంబైన యీ యరణ్యమార్గంబున నడుగులిడలేక యెంతయు నాయాసంబు జెందుచుండుటకు నామనంబు సహింపకున్నది. దైవకృతంబున కేమి చేయుదుము? ఎండ కన్నెఱుంగనిదియు నించుక మృదుల ప్రదేశమున విలాసార్థముగా నడిచినను నలసట నొందుచుండునదియునైన యీసుకుమారగాంత పల్లవ కోమల సదృశంబులైన పదంబులు గందగా యీ తీరున సంకటము నొందవలసి వచ్చెగదా! ఎటుల మనవెంట రాగలదు? బింకమునకు పెదవులు తడుపుకొనుచు తన కష్టంబుం జెప్పినచో నేను మనంబున సంతాపంబును బొందుదునని తలంపున నెంతయో సైరణతో వచ్చుచున్నది సుమా." యని చింతాక్రాంతుడై పలుకుచు, నచ్చటచ్చట నీడల నిలుచుచు మెల్లగా నడిపించుచు, గమన శ్రమము తోఁపకుండుటకై యరణ్య విశేషంబులు వర్ణించి చెప్పుచు మహా ప్రయాసముతో నాఁటి సాయంకాలమునకు మూడు యోజనంబుల దూరంబుచని

సుదర్శనంబను పేరుగల సరోవరంబుగాంచి తత్తీరంబునం గలవట మూలంబున విడిచి యక్కోలంకునందలి తామరతూడుల నాహారంబుగాఁ గొని యా రేయి యచ్చోట కడపిరి.

మఱునాఁడు ప్రభాతకాలంబున లేచి జనకజను శ్రమ నొందకుండునటుల నడిపించుచు యోజనత్రయంబరిగి, గంగా యమునా సంగమ ప్రదేశంబుఁజేరి యట ప్రయాగ వటముంగాంచి, యచ్చోట నివసించుచున్న మహా తపోనిధియు ననేక శిష్య గణసమేతుఁడును, త్రికాల వేదియునైన మహితమూర్తిని భరద్వాజ మహర్షిని సందర్శించి నమస్కరించిన దీవించి, సీతాలక్ష్మణ సహితుఁడైన యారాఘవేశ్వరుండున్న తెఱంగుఁగాంచి వెఱగొంది, యోగ విద్యా ప్రభావంబుచేత యతీదానాగత వృత్తాంతంబు సర్వంబును దెలిసికొనినదై నిర్ణయంబగుట నిశ్చయించి వారల కనేకవిధంబుల నతిథి సత్కారంబులు గావించిన సంతుష్టులై యా రేయి యచ్చోటనిలిచి వేగుటయు నమ్మునీంద్రునివలన చిత్రకూట పర్వతంబున కరుగుటకు మార్గంబునడిగి తెలిసికొని నమస్కరించి తపోధనునిచే దీవనలొంది పిడ్కొని తత్పథంబు ననుసరించి పోవఁదొడంగిరి. చనుచున్న సమయంబున సీతకు కష్టంబు తోఁచకుండుటకును, మనోత్సాహంబు గలుగుటకునై కోదండ గుణధ్వని మ్రోయించి యాశబ్దంబు విని బెదరి పఱచుచున్న మృగావళులంజూపి ప్రీతిఁబొందునట్లు చేయుచు, పోయిపోయి కాళిందీనది దాఁటి సిద్ధవటంబను మహావృక్షంబుఁ బొడగని తదీయోన్నతింగాంచి మెచ్చుచు, ముందట నంబరంబును దాకుచుండెడి శిఖరములు గలదియు, ననేకమహర్షి సత్తముల నునికిపట్టయినదియు, గంధర్వుల మంజుల గానంబువలనను, కిన్నరుల వీణాధ్వనుల వలనను, శుకపిక శారికా ప్రముఖ విహంగ కలరవంబునలనను, హంసకారండవ చక్రవాక బలాకాది జలపక్షి నికర కోలాహలంబులతోఁగూడి, కమల కల్హార శోభాసురంబై యొప్పు సరోవరంబుల వలనను, వర్షాకాల మేఘ సదృశంబైన ధూపంబు గమనంబు బర్వ హోమక్రియావిధులు జరుపుచున్న మునులవేదమంత్ర ధ్వనులవలనను, మనోజ్ఞంబుగా మీఁద నుండి జలజల క్రిందికిఁ జాఱుచున్న సెలయేళ్ళ రావంబువలనను, గాలిచే

—(*) శ్రీరామమూర్తి చిత్రకూటంబుఁ జేరుట. (*)—

శబ్దించుచున్న వేణువుల నినాదంబుల వలనను, గైరికాది ధాతువులతో కూడిన చరులవలనను స్ఫటిక శిలా ప్రదేశంబువలనను, పరిపూర్ణ పత్ర పుష్ప ఫలభరిత శాఖా సహితములై కన్నుల పండువగా నొప్పుచున్న నానావిధానోకహ ప్రకరణమువలనను మనోహరంబై యద్వితీయసౌఖ్య కరముగా విలసిల్లుచున్న చిత్రకూట పర్వతమునుచూచి మహా దానంద మును జెంది సమీపించి తదీయ విశేషముల నభివర్ణించుచు లక్ష్మణుండు వెంటరా, ధరాసుత కరముఁ బట్టుకొని మెల్లగా నన్నగేంద్రము నారోహించి తత్ప్రదేశస్థిత వివిధ మృగపక్షి విసరములను, మత్త భృంగ ఝంకార నినదాభిరామ వికచారవింద సందోహ రాజిత కమలాకరములను సీతకుం జూపుచువచ్చి యచ్చోట నివసించుచున్న మహా మునులం బొడగని భక్తి కలిత చిత్తుండై నమస్కరించి వారిచే దీవనలుగొని, యత్తపోధనులవలన సత్కారమునొంది వారికి తమ వృత్తాంతము సర్వంబును నివేదించి యనుమతి వడసి యందొక్కరమణీయ ప్రదేశమున పర్ణశాల నొకదానిని మునుల సహాయమున నిర్మించుకొని యందుఁజేరి యనుపమములైన నిజరాజ్యభోగంబులు మఱచి సదా యా తపోధనులతో సద్గోష్ఠి సలుపుచు వారి ప్రీతికి పాత్రుండై భార్యయుం దమ్ముఁడు నుచితవిధమున సేవింపగా నట వసించియుండెను.

ఒకనాఁడు మధుర ఫలోపహారంబులం బరివేష్టితుండై రామభద్రుండు జనకనందన యంకముపై శిరమునిడి శయనించియుండ నసురుం డొకఁడు వాయస రూపమున జనుదెంచి ముక్కుతో నామెయురోజ ప్రదేశముఁ బలుమాఱుఁ బొడుచుచు నెంత జోపినను బోక యలయించుచుండ పతికి నిద్రాభంగముఁ జేయనోడి యామె మేల్కొలుపక యా దుష్టకాకము నదలించుచుండె నట్టియెడ కాక కృతక్షతమునుండి రుధిరముజాఱి మీఁదఁబడుటయు రఘువల్లభుండు దిగ్గన మేల్కని యామెపైనుండి స్రవించు రక్తముఁగాంచి మహా కోపముఁ జెంది రక్తారుణిత నయనుండై "వనితాశిరోమణీ! ఏదుష్టుండు కాలంబుదీఱి నీయెడల నిట్టి యపరాధము నొనరించెను? ఎవఁడు నిప్పుతోడ చెరలాట మాడుటకు ప్రియమొందెను? ఎవఁడు మృత్యువదన గహ్వరముఁ జొర నెంచి

ద్ధుండై యిటులగావించెను? ఇటుల నెత్తురు గారుట కేమికారణము? శీఘ్రము తెలియబలుకుము. ఏదుర్మార్గుం డిటువంటి క్రూరకృత్యముఁ జేయ సాహసించెనో వాని నీక్షణమున యమలోకమున కనిచెద"నని మహోగ్రముగా నడిగెను.

—(*) రామచంద్రుండు కాకంబుపై బ్రహ్మాస్త్రవేయుట. (*)—

ఆదేవి జరిగిన వృత్తాంతముజెప్పి యప్పటికినిం బోవక యటనించుక దూరముననిలిచి కనుచున్న యా కాకమును జూపి, యదియే యిటుల చేసెననిన విని రామచంద్రుం డత్యంతాగ్రహమును జెంది తటాలున నిషీకము నొకటింగొని యభిమంత్రించి యా దుష్ట వాయసముపై విసరివైచె తక్షణంబ యాయిషీకము బ్రహ్మాస్త్రంబై భయంకరముగా మండుచు కాకమును భస్మముఁ జేయునదియై వచ్చుచున్న యమ్మహాసాయకం బరుదెంచెడి యుగ్రిముంగాంచి యధికమైన భీతినొంది కాకము పరుగిడదొడగె. అయ్యస్త్రము దానిని విడువక వెంటనంటి తరుమఁ జొచ్చుటయు కాకము త్రిలోకములుం గుమ్మరి రక్షించు వారలగానక మహదార్తితో మరలి రాఘవేశ్వరునియొద్ద కరుదెంచి పాదములపైఁబడి స్వామీ! వివేకములేక చేసిన నాయపరాధమును క్షమించి నా ప్రాణములు రక్షింపుము నీశరణుజొచ్చితి" నని ప్రార్థించెను. అపుడు కరుణాపరిపూర్ణుండైన రాఘవేశ్వరుండు కోపంబడంచుకొని "ఓ కాకమా! నాశరంబమోఘుంబైనది రిత్తపోవునది కాదు. కావున జీవింపగోరెద వేని ముఖ్యమైన నీయంగములలో నొకదానిని నీవిశిఖంబునకొసంగి బ్రతికిపొ" మ్మని చెప్పెను. వాయసము తన నయనములలో నొకదాని నాసాయకమున కొసంగి దాశరథికిని నమస్కరించి ప్రాణములు దక్కించుకొని నిజేచ్ఛంబోయెను. అని సీత నూరార్చి మధుర ఫలముల నాహారించుచు మునులంగూడి నిర్వ్యసనమున కౌసల్యానందనుండు కాలము గడపుచుండె.

—(*) సుమంత్రుండు రామచంద్రుని గమనవృత్తాంతంబు జెప్పుట. (*)—

సుమంత్రుఁ డయోధ్యాపురమును జేరి రాజమార్గమున దీనవదనుండై వచ్చుచుండగా పురజనులు తేరు చప్పుడువిని రామచంద్రుండు వచ్చుచున్నాఁడు కాఁబోలునని యెంచి సంతసమును సంభ్రమమును నతిశయింపగా గృహములువీడి పఱతెంచి రామలక్ష్మణ విరహితంబైన రథము

తోడ వచ్చుచున్న సుమంత్రునిం జూచి పలుదెఱంగుల నతని దూషింపుచు మిక్కిలి చింతాక్రాంతులై పోవుచుండిరి. వారు తిట్టుచున్నమాటలాలింపుచు నతండేమియుఁ బలుకక యరదమును నగరి వాకిటికిఁ దెచ్చి యవరోహించి, యంతఃపురమునకరిగి, కౌసల్యాసుమిత్రులతోడ వగలఁ బొగలుచున్న దశరథేశ్వరుని పొడగని యతని యడుగుల పైఁబడి మ్రొక్కిలేచి శోకబాష్ప పూరిత నయన యుగళుండై గద్గదికగదిరిన యెలుంగుతోడ నిట్లని విన్నవించె. "మహీవల్లభా! కకుత్స్థవంశ సుధా రత్నాకర రత్నాకరుండైన శ్రీరామచంద్రుండు గంగానదీతటమున, జడలుధరించె రాఘవేశ్వరుండు నీకును తమతల్లులకును మ్రొక్కినటుల చెప్పుమని నన్ను వీడుకొలిపి యా నదిని దాఁటి చిత్రకూటాద్రికిం బోయెదమని యరిగె" నని యెఱిగించె. అటుల నతండు బలుకగానే దశరథావనీశ్వరుండు వెల్లుకొనిన శోకముతో యావాక్యములు విని మైవడంకగాలేచి కూర్చుండి "సుమంత్రా రామునివిడిచి నేను జీవింపనోపఁను. శీఘ్రముగా నన్ను చిత్రకూటమున నుండెడి నాపుత్రరత్నము చెంత కిపుడే ప్రయాణంబై తోడ్కొని పొమ్ము తడవుచేయవల"దని గద్గద స్వరమునఁ బలికి త్వర చేయుటయు, వివేకవంతుడైన యామంత్రివరుం డయ్యవనీపతితో "రాజశేఖరా! ఇపుడు నీవు పుత్రమోహముచే పురము విడిచిపోవుట లగ్గుగాదు. ఎందువలన ననిన, నీవు పైనంబై పోవుదువేని పురజనులందఱును నీవెంట బడుదురుగాని యొక్కరును నిలువ నొల్లరు. అదియును గాక యువ్విధమున పౌరులతో గూడి నీవరుగుటంజూచి కైక యెందు విధముల భావింపఁగలదు. కాఁబట్టి నీవిపుడు పోవుట యెంతమాత్రమును యుక్తము కాదు. రామచంద్రుండిచ్చోటి సుఖములను మఱచి మహాత్ములైన మునీంద్రుల సన్నిధిని నెమ్మది నుండగలండు. కావున నింక నీవనిత్యకై చింతింపక ధైర్యం బవలంబించి శాంతచిత్తుండవై యూఱడిల్లి యుండుట కర్తవ్యము. నా వచనములనుగూర్చి బాగుగా నాలోచించి ప్రయాణోద్దేశమును వర్జింపు"మని చెప్పెను.

—(*) కౌసల్య దశరథునితో నిష్ఠురోక్తులు పలుకుట. (*)—

భూమీశ్వరుండు మంత్రి పలుకులు విని సందర్భం బట్టిదియనై యుండుటం దలంచి వేఁరపాటు నడంచుకొని యతనిని వీడ్కొలిపి కౌసల్య

ను చేరఁబిలిచి, రామచంద్రునకుఁ గలిగిన దుర్దశయును తన దుఃఖము
నుం జెప్పి బహుప్రకారముల శోకించుటయు నమ్మానిని శిరోమణి పతి
దుఃఖముఁ గాంచి "రాజేంద్రా! ఏల వాపోయెదవు? ఇదియంతయు భవ
త్కృతంబ కాని వేఱుకాదు ఈకపటకృత్యమును చేసినవాఁడవు నీవుగాక
మఱియెవ్వఁడు? నేనేమిగాఁ దలంతునో యని నా మోమోటమికై లేని
దుఃఖమును దెచ్చుకొని యివ్విధమున నటించుచుండుట నెఱుంగుదు.
ఎంత కపటముగా నటించినను నిజ మెట్లైనం దెలియరానే వచ్చును.
ఆహా! నీచేసిన యుక్తి కేమనవచ్చును? పదుగురును మెచ్చుకొనుటకై
బహుకాలవ్రతము లాచరించి పడసిన పరమ సద్గుణ విశారదుండైన
నందనకు పట్టము గట్టువాని చందమున నెల్ల రాజులు వినఁగా కడుగౌర
వముగాఁ బలికి నిజముగా నటులనే చేయువాని రీతిని డంబముగా నేమో
గొప్పగా ప్రయత్నము గావించుచున్నటుల నభినయించి కైక యింటికరిగి
క్రూర చిత్తయైన యామెతోడఁ జేరి దురాలోచనఁ జేసి కపటమున నక్కు-
మారు నచ్చోటికిఁ బిలిపించి యడవుల వసింపుమని బంపినాఁడవు. ఇటు
వంటి పాపచింతలేని పరమ సాహసికుడైన నీ కా పుత్రునిపై కరుణ
మెట్లు కలిగినది? అతనికై యింతగా నీవు చింతించుటేల? నీకు న్యాయం
బును, సత్యమును, నెక్కడివి? ఇంతటి నిర్దయా స్వాంతునకు సద్గతి కలు
గునా? ధర్మప్రవర్తనము విడనాడి చేయవలసినంతయుం జేసి లోకదూ
షణను దప్పించుకొనుటకై యీరీతి వగలు జూపుచుండెదవు గాని నిజ
మైన దుఃఖము నీచిత్తమున గలుగదు. ఇంక నీకల్ల యేడుపులు వీడి
నీవును నీ ప్రియసతియుం దలంచినపని నెఱవేఱినదిగాన యా వన్నెలాడి
తోఁ జేరి సంతసింపుము. పుత్రశోకార్తనై క్రుంగుచుండవలసిన దానను
నేనుగాని నీవుగా"వని శోకావేశముచే తోఁచినట్లు కఠినముగా బలికెను.

ఇటుల పరుషోక్తులు బలుకుచున్న యామెను చూచి దశరథుండు
మించిన సంతాపముతో "ఓ సాధ్వీ! ఇన్ని తప్పులు నాయందు గలవని
నీకు దోఁచినదో యటులనే తలంపుము. సత్యమును దైవ మెఱుంగును.
ఈ విషయమున నా యపరాధం బావంతయుం గలుగదు. విధికృతం
బివ్విధమున జరుగవలసియుండి జరిగినది. నీవు నన్ను గూర్చి యెటుల
నెంచినను, మఱి యేవిధమునఁ దూలనాడినను నేను గాదనజాలను.
అయ్యయో! నానోముల పంటయైన రామచంద్రుఁడు లేకుంటచే
నా బుద్ధికి రాత్రియనియుం బగలనియు నేర్పఱుపరాక లోకము శూని

గినట్లు తోఁచుచున్నది. ఈ ప్రాణములును తనువువిడిచి పోకున్నవి. నిలుచునట్లును లేదు. ఏమిచేయుదును? ఇటుల దుఃఖసముద్రమునం బడి తల్లడిల్లుచున్న నన్నేల పరుషోక్తులుపలికి మఱియు శోకింపజేసెదవు? నే రీతి దుఃఖము ననుభవించుటకును, కష్టము లివ్విధమున తటస్థించుట కును కారణము లేకపోలేదు. కర్మఫలము ననుభవింపకున్న తప్పదుగదా! ఇదియంతయు మదీయ పాపక్రియా ఫలమేకాని యితరముకాదు. ఆనిమి త్తమును నీకెఱింగించెద నాకర్ణింపుము నాచిన్నతనమున నేనొకనాఁటి రాత్రి ధనుర్బాణములు ధరించి సరయూనదీ తటమున కరిగి యట వృ క్షముల మాటునఁజేరి పొంచియుండి యా నదికి జల పానార్థముగా నేనుంగును నేనుపందులు పులులు నెలుగుబంట్లు నెనుబోతులునువచ్చి నీరుద్రాగుచుండ యా చప్పుడునుబట్టి శబ్దవేధులైన బాణములు ప్రయో గించి వానిని పొరిగొనుచుంటిని ఆ సమయము నొక మహాత్ముఁ డచ్చోటి కేగుదెంచి భాండముతో నదియందు జలములు ముంచుచుం డెను. ఆ ఘుబఘుబ ధ్వనినివిని యేనుగు నీరు గ్రోలుచున్నదనెడిభ్రాం తితో వింట శరము సంధించి ప్రయోగించితి, సూటిగా యా ప్రేటా మహాత్మునకుం దగులుటయు. "హా! ఈశ్వరా! ఓం నమశ్శివాయ నమ శ్శివాయ నమశ్శివాయ"యని పలుకుచు భూమిపై నొరిగెను. ఆరవమును విని నేను మిక్కిలి వెఱగందుచుండ మరల "అయ్యో! ఈరాత్రివేళ చీకటిలో నొంటరివాడనై నదీ జలములకై వచ్చి యిటు తీవ్రప్రదరాహ తింగూలితి. పాపకృత్యంబని తలంపక యేకర్రాత్ముఁడో నన్ను నిరపరా ధునిఁ గూలనేసె, ఏమిచేయుదును? హరిహరి! నీరుసట్టుగొనియున్న యతి వృద్ధులును, నంధులునైన నా తల్లిదండ్రు లింక నెంత యడలుదురో గదా, నన్ను వారెట్లు వెదకఁగలరు? నాస్థితి వారెటుల నెరుంగుదురు? అడవులలోనుండి కందమూలములును వన్యఫలంబులును భుజింపుచు, నిత్యనైష్ఠిక వృత్తిం దలంగక సదా పితృసేనా పరాయణుండవై వర్తిం చుచుండెడి వాడనైన నేనీరీతి నాయుధముచే మృతినొందుట కేమిపాప మొనర్చినాఁడను? ఒకరికొక కీడుచేసి యెఱుఁగని మునికుమారుఁడనైన నన్ను హింసించుటేల? నన్ను చంపుటచే మూట గట్టుకొనబోయెడిలాభ మేమిగలదని యెంచి యా మనుష్యుఁడు బాణమును ప్రయోగించెను? నాతల్లిదండ్రులకు దిక్కు లేకపోవుటయు నేను దుఃఖించి బాధనొంది ప్రాణంబులు విడుచుటయుందప్ప దీనివలన నేమి ప్రయోజనము గలదు?

హా తల్లిదండ్రు లంధులై యున్నను వారింకా దుఃఖము తోఁచకుండులా ఘన నేనే కన్నులకు మాఱుగాయుండి, వారికే కొఱంతయుం గలుగనీక రక్షించుచుంటి ఇకమీఁదట వారిగతి యేమికావలయును? వారిని రక్షించువాఁ డెవ్వఁడున్నాఁడు? నాతల్లిదండ్రులు జలములు గొనిరమ్మని పంపగా ఘటముం గొనివచ్చితి. వచ్చినవాఁడ నిచ్చోట క్రూరబాణ హతిచే నేలఁగూలితి ఘోరమైన నాదురవస్థను వారెఱుంగరు. ఎటుల తెలియును? తెలియక పోవుటచేత నేనుశీఘ్రముగా నీళ్ళుకొనిపోకయున్న యెంతకోపమును జెందుదురో, యెటుల నిందింతురో, లేక ధృతి దూలి యేవిధంబు నాకొఱకై దుఃఖింపుదురో, కటకటా! ఆముదుసళులు దిక్కుమాలినవై ఖరికిలోనైరిగదా ఇంక వారిని రక్షించుట కెవ్వరున్నారు నీరు వట్టుఁగొని నాకొఱకునీరుదెచ్చెదనని యాశతో గూర్చుండి యున్నవారికి పానీయంబుఁ గొనిపోయి యెవ్వఁడొసంగును? నే నిటుల బడిన వార్తను విని రేని యా క్షణంబుననే తమ ప్రాణంబులను విడుతురుగాని బ్రదుకరనుట నిశ్చయము హా! దైవమా! ఈయొక బాణఘాతముచే మేము ముువ్వురము జచ్చునటుల నేర్పడినది. ఏమిచేయుదును. హా! తండ్రీ! హా! తల్లీ! మాకు దాహముఁదీర్ప జలంబులు దేరవచ్చిన మీరు నమ్మి యున్న మీ కుమారుం డిచ్చోట నిదిగో! ఘోర బాణాహతింగూలి తపించుచున్నాఁ"డని యడలఁ దొడంగెను. ఆయార్తరవమును విని యతండు పలుకుచున్న మాటలచే, నాబాణాహతిం గూలినది నేను తలంచినట్లు గజంబుగాదనియు నతం డొక్క మునికుమారుండనియు నెఱింగిన వాఁడనై అత్యంతమై భయంబును, వ్యసనంబు నామనంబును గలంపగా "అయ్యయ్యో! గొప్ప యపరాధముఁ గావించి నాఁడనే! మహాపాతకము నొడి గట్టుకొంటిని, ఈ దోషమింక నెటుల తీఱును? శీఘ్రముగా నతని యొద్దకరిగి విచారించుట కైనను, నావలననైన యుపచారంబు నొనరించుట కైనను నీవు డంధకారముచే దారి సయితము తెలియు నట్లుండ లేదు. ఎవ్విధంబున నవ్విప్రస్తుతుం డున్నచోటు నెఱింగి పోవుదును? హరిహరీ ఇంక నిపుడేమి చేయుదు"నని పగచుచుండగా నంతలో చంద్రోదయం బైనంతున చీకటి తొలంగి వెన్నెల కాంతులు వెల్లివిరిసెను. అంతట నేను తడవుఁజేయక బిరబిర యా నదిదాఁటి యావలి తీరమున కరిగి యచట విరిసిన జడల తోడను, అతిశయించిన బాణఘాతముచే గలిగిన బాధచే నలసటనొంది

దైన్యముతోఁగూడిన మోముతోడను, మేనంతయు నేలఁ బొరలుటచే ధూలి యంటియుండగా కుండ నేలఁబడవైచి దానిపై నొరిగి శరఘాతమున గాఱుచున్న నెత్తురుచే భూమి దడియగా మహాదుఃఖాక్రాంతుఁడై పొరలుచున్న యామునినందనునింగాంచి గుండెలు తల్లడిల్లగా చేరఁబోయి నాచేగల ధనుర్బాణములు క్రింద బడవైచి త్వరితముగా నీరుదెచ్చి మోముఁగడిగి తుడిచితి. శోషిల్లియున్నయతఁ డపుడు మెల్లగా కన్నుల విచ్చి నావంక కనుఁగొనెను. నాలో నపుడధికమైన భయము గలిగి, "మహాత్మా! నేనే యీ బాణమును ప్రయోగించిన వాఁడను. కాని యిది యెఱిఁగి బుద్ధిపూర్వకముగా చేసిన యపరాధము కాదు.

దైవకృతమున నిటుల తటస్థించినది. మృగ సంహారార్థమై నేనీ ప్రాంతమున వేచియుండగా నీవు ఘటంబున జలంబులు ముంచుశబ్దమును విని యంధకారంబువలన మనుజుఁడగుట నెఱుంగలేక మత్తగజంబు నీరు గ్రోలుచున్నదనెడి తలంపున జేసినాఁడను అటువంటి ఘోరపాతకమును జెందించుటకే విధి యివ్విధంబున బ్రేరేపించెను. ఇంక నేమి వగచినను నేమి ప్రయోజనము గలదు? గొప్పనేరముఁ జేసినాఁడ"నని వగచుచుండ నతండు నన్నుఁ జూచి "ఓయీరాజా! అడవులలో వాసముఁజేయుచు, నెట్టి యపరాధంబునుం జేసి యెఱుంగనివాఁడనగు నన్ను సుంతయైనను యోజింపక పడగూల్చినాఁడవు. ఈ విషయం బెటులను డిను, ఏకపుత్రుండనైన నా మరణంబులు విని నన్నే యాధారముగా నమ్మియున్న నా తలిదండ్రు లతివృద్ధులును, నంధులునునైన వార లిరువురుం దటాలున ప్రాణంబులు దొఱంగుదురు. ఇటులచేయుటచే నీకు మూఁడుపాతకములు సంభవించినవి. దీనిచే నిదియే నీవు సంపాదించిన లాభము. నీ మృగయా వినోదమునకు గలిగినది యిది యేఫలము. అయినను నెఱుగకచే సితినని నీతప్పుజెప్పి పశ్చాత్తాపంబుఁ జెందుచున్నాఁడవు. దైవసంకల్పమిటులనుండి జరుగవలసినట్లు జరిగినది. నిన్ను నిందించుట కర్జంబుగాదు తెలియక చేసిన తప్పుగాన యీ పాపంబు నీకు గలుగకుండును గాక" యని చెప్పి మరల నాతో "నరేంద్రా! ఈ బాణము గ్రుచ్చుకొని యుండుటచే ప్రాణంబులు పోవకున్నవి. బాధ యధికమైయున్నది. కావున దీనిని తీసివేయుము. మఱియు నీకొక హితంబుఁ జెప్పెదను వినుము. నా తల్లిదండ్రులు కన్నులు గానరాని ముదుసళులు వారు దప్పికొని నేను నీరుగొని వచ్చెదనని కాచియుందురు. కాన నీవీ ఘటంబుతో సలిలం

బులు గొనిపోయి వారికొసఁగి దాహమును దీర్చి మదీయ మృతినెఱిఁగింపుము. ఇచ్చటనుండి పోయినతోడనే యీ వృత్తాంతమును వారితోఁడ చెప్పితివేని దాహముచే తపించుచున్న యీ పుణ్యాత్ములు కడుపురగులు కొని దుఃఖాక్రాంతులై యీ కోపముతో నిన్ను దిట్టరేని నీవును నీవంశంబును నీరగుట నిశ్చయము. కాఁబట్టి తొలుత వారి దాహముఁ దీర్చి శాంతి నొందఁజేసి యటుమీఁదట నా వర్తమానముఁ జెప్పి తెలియక చేసిన యపరాధమనియు క్షమింపుఁడనియుం బ్రార్థింపుము. దైవసంకల్ప ప్రకారము జరిగినదానికైన యింక వగచి ప్రయోజనములే"దనిపలికెను. అంతట శోకమును భీతియు నతిశయింపగా నతని యాజ్ఞప్రకారము మేననాటియున్న యంబకముఁ బెఱుకుటయు నతండు ప్రాణములు విడిచె.

అంతట దుఃఖింపుచు నే నచటయుండిన కుండతో నీళ్ళునుగొని' మునికొడుకు చెప్పిన గురుతుప్రకారముగా తను కుమారుని రాకకై గాచియున్న వృద్ధుల నతని తల్లిదండ్రులఁజూచి, దృష్టిలేనివారును, దప్పిచే తాపమొందుచున్నవారును నైన పక్షములు విఱిగి పడియున్న పక్షులుం బోలె గనుపట్టుచుండెడి యామునిదంపతులఁ జేర నరిగితి. నా నడక చప్పుడువిని తమ కుమారుఁడే వచ్చెనని తలంచి యందు వృద్ధముని "కుమారా! సమీపముననేగదా? నదియున్నది యచట కరిగి జలంబులు దెచ్చుట కింత తడవైనదా? ఏల నీవాలస్యముఁ జేసినాఁడవు. అయ్యో! యరణ్యమునకుఁబోయి యొంటరివాఁడ నీయర్ధరాత్రికాలమున నివ్విధమున మసల దగునా? నేనును నీతల్లియు నీవు తడయుటకు కారణ మెఱుఁగక, ఎటులబోయినాఁడవో యేమోయని మిక్కిలి దిగులొంది కుందుచుంటిమి సుమీ! దేవుఁడు సుఖముగా నిన్ను మాయొద్దకు చేర్చెను. ఇప్పటికి మాకు ధైర్యమును సంతోషమును గలిగినది'' యని పలికిన మారు పలుకుటకు నోరురాక నేను తత్తరించుచు మాటాడక నిలచితి. అపుడా తపోధనుఁడు నేను తమ పుత్రుఁడనేయనెడితలంపున "తనయా! పలుకకుండెద వేల? నేను నీకు మంచిబుద్ధి మాటలు చెప్పినాఁడను గాని నీపై నలుక చేతగాదు. దీనికినీవు మనంబున గోపమొందినాఁడవా? వల దుగాని నాలుకవఱటుకొనిపోయి పలుకలేకయున్న మీతల్లి శీఘ్రముగా దొలుత గ్రుక్కెడునీళ్ళు పోయు'' మనెనో వారికి తను తనయునిపైఁ గల యనురాగ విశేషము నెఱింగినవాఁడనై తద్వృత్తాంతము నెఱింగించుటకు పూర్వము ఋషిపుత్రుండు కఱపిన చందమున జలములు దాగ

నిచ్చి, మహా ప్రయాసతో మనము నొక్కింత ధైర్యమును పాదుకొ లిపి యతిశయించిన దుఃఖముతో, భయముచే మైచెదరగా "ఓ పుణ్యా త్ములారా! నేను మీతనయుండనుగాను. మహాపాపకర్ముండను. అయో ధ్యను పాలించు దశరథుండనెడి పేరుగలవాండను లోకమున నే క్రూరుం డును, పాతకుండును జేయుటకు సాహసింపజాలని ఘోరకృత్యమున నొన రించి తగుమనని ధైర్యముతో మీయొద్దకు మదీయకృత దుష్కృత్య మును దెలుపుటకై వచ్చినాండ. పలుకుటకు నోరాడకున్నది

ఏమనగా, నేటిరాత్రి నేను నది చెంత డాగియుండి యేటిలో నీటి కై వచ్చి త్రాగుచుండు మృగములను నీరుగ్రోలు చప్పుడునుబట్టి శరప్ర యోగముం గావించి చంపుచుంటిని. ఆసమయమున మీ కుమారుండు జలములకై యరుదెంచెను దట్టమైన చీకటియై యుండుటచే యతని రాకను నేనెఱుంగజాలనైతి. అప్పుణ్యాధనుండు ఘటమును నదీ జలము లలో ముంచుటయు తద్గుభగుభ ధ్వానమును విని కుంజరము నీరుగ్రోలు చున్న వని భావించి వింట బాణము సంధించి యేసినాండను హరిహరీ! ఇంక నేనేమని పలుకుదును? ఆ శరము దాకుటయు మీ కుమారుండు నేలంగూలి ప్రాణములు విడిచె" నని చెప్పితి. నానోట క్రూరమైన యీ మాట వెడలగానే "హా! కుమారా! హా! ప్రియనందనా" యని యడలి యావృద్ధు లిరువురునుం బ్రాణములు లేని బొంమలవలె మూర్ఛిల్లి నేల వ్రాలిరి. అంతట భయశోక విహ్వలాత్ముండనై యుపచరించి మహాప్ర యాసతో యెట్టకేలకు నేను తేర్చుటయు వారలు తెలివొంది, మొనలేని దుఃఖమున వారు కడు దీనములైన తమ ముఖములను నావంకకుం ద్రిప్పి తలలెత్తి నోళ్లు తెఱచుచు, బెదవులు దడుపుచు డగ్గుత్తికలు పెట్టుచు, నెలుంగులు రాల్పడగా నన్నుగూర్చి "ఓ యయ్యా! ఇంతటి ఘోరకృ త్యము నెవ్వరైనం జేయుదురా? మా కుమారుం డేయపరాధ మొన ర్చెను. సకలధర్మముల నెఱింగిన రాజవై యుండియు తపసులమై యడవుల లోనుండి కాలము గడపెడి వారమగు మాబోంట్ల నిట్లు వెతల పాలొన రించుట యుక్తమగునా? అయ్యో! మేము చీకులము అంధులము. ఆ ధారమని నమ్మి పట్టియున్న మా చేతికఱ్ఱను పడంగొట్టితివాండవు, న్యాయ మా? ఇంక మేమెచటికి బోవుదుము? మాకు దిక్కెయ్యది? నీకు పుణ్యా ముగలుంగ నాశీర్వదించెదముగాని మాయందు కనికరించి యేబాణముచే మా పుత్రునిం గూల వేసినాండవో దానివలననే మమ్మును వధించి మా

దుఃఖమును జల్లార్పుము. నీ బాణాహతింగూలిన మా ముద్దుపట్టి ప్రాణములు విడుచునపుడు తల్లిదండ్రులమైన మమ్ముం దలంచి యేమిచెప్పెనో, ఎటుల నడలెనో యతని మాటలం జెప్పుము. మాతృ పితృభక్తిగలవాఁడును, నిత్య ధర్మాచార నిష్టాపరుండును, సకల సద్గుణ గణగరిష్టుండును తపశ్శీలుండును, పుణ్యాప్రియుండును పరమ శాంతుండునునైన యమ్మహాభాగున కిటువంటిగతి సంభవించెనుగదా! ఇటువంటి చావు జచ్చుట కా పరమయోగ్యుం డర్హుండగునా? అతని కీ ఘోర మరణమేల గలిగెను? ఇంక మేము దీనికై యేమని దుఃఖింపుదుము? ఆహా! దైవ మీ తీరున సంకల్పించెగదా! ఎప్పటికైనను లోకమున జనించినవాఁడు చావవలసియే యుండును.

చచ్చినవానికై వగచియుం బ్రయోజనములేదు కాని, అయిన? ఆ చావునకు మఱియొకచోప్పు గలుగకూడదా? కటా! యతి తుండైన వానికి ఘోరసాయక ఘాతచే చావవలసినట్లు లిఖించిన విధి చెయిదిని గురించి మేము దుఃఖింపవలసి యున్నది. ఇది యన్యాయము గాదా?" యని చెప్పుచు పనవిపనవి యతని గుణములు వర్ణింపుచు శోకించుచుండి, వారిలో మృతకుమారుని తండ్రి నన్ను నుద్దేశించి "ఓయి దశరథుఁడా! నానప్రస్థులం జంపినచో దేవేంద్రు నంతటివాడైనను తక్షణమే నాశంబగును, ఇంక నీవంటి రాజగువాఁ డెంతటివాఁడు? ఒక లెక్కయగునా? నీ వెంతటివాడవై యున్నను నీవు చేసిన కార్యమునకు ఫలముగా నీశిరము వేయిప్రక్కలై యుండునుగాని తప్పినది ఏలననఁగా నీవు తెలియక ఈ మహాపరాధముం జేసినట్లు పలుకుచున్నావు. దీనికై విచార భయము లతిశయింపగా పశ్చాత్తాపముఁజెంది క్షమింపఁవేడుచున్నాఁడవు కావున యీదుష్కృత్యముచే గలిగెడి ఫలము నీకుఁ గలుగదయ్యె. ఇంక నీతోడ నేమిజెప్పియుం బ్రయోజనములేదు. సర్వమును భగవత్సంకల్ప ప్రకారము జరుగుచుండును. కాని, ఓయి దశరథుఁడా! మాకొక యుపకార మొనరించి పొమ్ము. ఏమనగా, నీ యంబకముచే మా పుత్రుం డెచ్చట నేలఁ గూలియున్నాఁడో యచ్చోటికి త్వరితముగా నంధులమైన మమ్ము దోడ్కొని చని విడువుము. ఇదియ మేము కోరునది" యని పలికిరి. ఆ మునిదంపతు లిట్లు వేడుకొనుటయు, వారి దుఃఖముఁజూచి మిక్కిలి పరితాపమునుబొంది వారి నిరువురం దోడుకొని మునికుమారుని మృత కళేబరము నొద్దకుఁబోయి విడిచి, "పుణ్యాత్మ

లారా! మృతుండైన మీకుమారుండు వీఁడే, మీ ముందట భూమిపైఁ బడియున్నాఁడు చూడుం"డని చెప్పితి. అంతట వారు చేతులతో తడవి కొడుకు తనువుం గనుంగొని మీఁదఁబడి మూర్ఛిల్లి కొంతవడికి తెలివి నొంది విలపింపఁ దొడంగిరి అపుడా మృతుని తల్లి యుల్లంబెఁజియఁగా "హా! యజ్ఞదత్తా! ప్రియనందనా!" యని యెలుంగెత్తి పేర్కొని యేడ్చుచు నిట్లనియె.

"నాయనా! అయ్యో! ఇదియేమి? ఎన్నిమారులు దగ్గఱఁజేరి పిలుచుచుండినను బలుకవైతివి. మాకు ప్రాణము నీవకదా! తనయా! అంధులమైన ముదుసళ్ళను మమ్ము దిక్కులేనివారింజేసి శరీరము విడిచినాఁడవే? ఇట్టి స్థితియందున్న నీ తనువుం జూచినంతట తొలఁగిపోవక నా మేనజీవము లింకను నిలిచియున్నవి. ఇది యాశ్చర్యముకాదా? హా! మా ముద్దుపట్టి కన్నులులేని మా కాధారమవై యుండిన వానిని నిన్నీ రాజు నిష్కారణముగా జంపనేమిటికి? నీ వతనికేఁ జేసిన యపకారమెయ్యది? దైవమునకు మే మింతమాత్ర మాధారముఁ గలిగియుండుట సయితము సమ్మతము గాకుండెను. కాబోలు తండ్రీ! నీ సద్గుణములును, వినయ వివేకములును, సదాచార సంపదయును, మాయందుగల భక్తి శ్రద్ధలును, మేమెట్లు మఱచి యుండఁగలము? ఇంకపై మాగతి యెట్లు కావలయును? బాలకా! నీమేన బాణమునాటిన దెచ్చోట" యని పలుకుచు, కుమారుని శరీరముఁ దడవి రక్తము గాఱుచున్న బాణక్షతము నామె యెఱింగి "అయ్యయో! హరిహరీ! ఇంతటి గాయముఁదగిలిన నీవెటుల జీవింతువు? నా ప్రాణము లింక నిలువవు. చచ్చితి చచ్చితి" నని మరల మూర్ఛిల్లి యొఱిగి కొంత తడవు చేష్టలు దక్కిపడియుండి విధివశమునఁ దెలివినొంది యేడ్చుచుండె.

తత్సమయమున యా తపోధనుండును కొడుకు గుణములం జేర్కొని వర్ణించుచు మహత్తర శోకసాగర మగ్నుండై పలవించి పలవించి యక్కుమారు నుద్దేశించి "తనయా! నీవు పుణ్యశీలుండవగుటఁ జేసి, వేదవేదాంగ పారగులు, నశ్వమేధాది సమస్తాధ్వర కర్తలును, నానా ధర్మ కర్మ నిరతులు నైన యుత్తములకే లోకము గలుగునో యట్టి యుత్తమోత్తమ లోకము నీకుఁ గలుగునుగాక" యని పలికి విధి విహితాగ్ని సంస్కార తిలోదక దానము నొనరించుటయు, నయ్యజ్ఞదత్తుం డొక దివ్య విమానరూఢుండై యంబరమున దివ్యదేహప్రభ

ఋతిశయింపగాఁ బొలిచి తలిదండ్రులఁ బేర్కొని యుచ్చైస్స్వనమున "ఓ తల్లిదండ్రులారా! మీకు పరిచర్యఁ జేయుటంజేసి నాకు బుణ్యలోకము గలిగె. మీరింక నన్నుఁ దలంచి వగలఁ బొగలవలదు. కానుండునది యవశ్యంబగునుగాని కాక మానదు. ఎటుల జరుగవలసి యుండెనో యటుల జరిగినది. ఇది భగవత్సంకల్పముగాని యొకండు గాదు. ఈ రాజు వలన దోషములేదు. మీ రీతనిఁ గరుణింపుఁ"డని చెప్పి దివమునకుం బోయెను.

అంతట నమ్మునీశ్వరుండు నదియున్న దిక్కు మొగంబై నన్ను నుద్దేశించి "ఓయినృపాలా! మా దేహమున నింక బ్రాణములు నిలువవు మా పుత్రుండు పోయినమార్గమునం బోయెదము. మాకి తటి పుత్రశోకముఁ దెచ్చి పెట్టినాఁడవు కావున నీవును పుత్రవియోగముచే దుఃఖితుఁడవై మృతినొందఁ గలవాఁడ" వని శాపంబొసంగి పత్నీ సమేతుండై ప్రాణములువిడిచె. నేనాతపస్సులకు సంస్కారముఁగావించి చింతాక్రాంతుడనై యయోధ్య కేతెంచితి. ఓ కౌసల్యా! తత్ఫలం బిపుడా సన్నంబైనది. ఇంక నేను జీవించుట దుర్లభము. ఎట్లంటివేని యంత్యకాల లక్షణములు పొడముచున్నవి. నేత్రదృష్టి సన్నగిల్లి చీకటులు గ్రమ్ముచున్నవి. యితరులు పలుకుమాటలు వినవచ్చుటలేదు. గుండెల దరుచున్నవి. దేహము విశదమగుచున్నది. కంఠస్వరము హీనమగుచున్నది. అప్పటప్పటికి జ్ఞానము లయమగుచున్నది. ప్రాణములు తిరుగుడు వడుచున్నవి. కావున మేను నిలువదనుట సత్యము. శ్రీరామచంద్రుని లీలాదరహాస వికాస శ్రీకర ముఖారవిందమును జూచుటకు ప్రాప్తము గలుగదయ్యెగదా! ఏమి చేయఁగలను"? అని పలికి రఘుకులేశ్వరుం దలంచి యిట్లని దుఃఖింపఁ దొడంగెను

—(*) దశరథుఁడు పరలోక గతుండగుట. (*)—

"హా! కులవర్ధనా! హా! కరుణాకరా! హా! ధర్మవిలోల! హా! శ్రీకరా! విజయలక్ష్మీకరా! హా! రామా రామా!" యని పేర్కొని యతిశయించిన వ్యాకులముచే వాపోయి తుదకు ప్రాణములువిడిచె. అతని మరణము నెఱుంగఁజాలక కౌసల్యాదేవి నిదురించుచున్నవాఁడని యెంచి పలుకరింపకను కను మొగిచియుండె అంత ప్రభాతంబగుటయు వందిమాగధులును దాసదాసీ జనములును పాడుకపద్ధతినివచ్చి స్తోత్రపాఠములు గావించి సందడింపఁ దొడంగిరి. మంగళ తూర్యరవము లొసంగెను.

అప్పటికిని దశరథుండు మేల్కొనకుండుటయు నర్హాకాంత లంతఃపురమున కరుదెంచి యా మహీపాలుం డున్నతీరు నుపలక్షించి భయాశ్చర్యములు గలవారై డాయంజని యంటిచూచి యూర్పులరసి గతప్రాణుండగుట నిశ్చయించి మహాదుఃఖముతో మొగము లడచుకొనుచు రోదనముం జేయుటయు దిగులొంది కౌసల్యా సుమిత్రలు నిద్రదేఱి పతియున్న చందముగాంచి "హా! రాజకుంజరా! హా నాథా!" యని యార్తనాదము మిన్నుముట్ట నాక్రందనం బొనరింపం దొడంగిరి. అది యెఱింగి వ్యసనాక్రాంతయై కైకయు నచ్చోటికి కరుదెంచుటయు కౌసల్యాదుల య్యంతిం గాంచి శోకం బతిశయింపగా నామెమీదంబడి "ఓ కైకా! నీ కోరిక సఫలంబయ్యె. శ్రీరామచంద్రు నడవులకు జనిచితివి. మగనిజంపితివి. ఇంక నీ కెదురులేదు. కోరినట్లు సమస్త భోగములు ననుభవింపుచు సంతోషమున నుండు"మని బలుకుచుండ, యామె వారి పలుకులకు మాఱాడ వెఱచి తలవాంచి పతిపయింబడి విలపించుచుండె నాసమయమున కౌసల్య నిజవల్లభు నుద్దేశించి ఓ క్షితీతలేశ్వరా! మహా! సుకృతవంతుండవైన నీ కిటువంటి మరణము గలిగెనుగదా! ఆహా? దైవసంకల్పమున కేమనవచ్చును? నా ముద్దుపట్టియైన శ్రీరామచంద్రుని బాసి దుఃఖ సముద్రంబున మునింగియున్న నేను, భవత్సేవసేయుచునైన కొంత యూఱటం జెందవచ్చును గదా యని తలంచితి. అదియును వ్యర్థమయ్యెను. నేనేమి చేయుదును? అయ్యో! నేనెంతటి పాపాత్మురాలనో గాని నీ పుత్రశోకంబు నెఱుంగంజాలక కపట దుఃఖమును నాముందు కనబఱచుచున్నవాఁడవని తూలనాడితి రవికులశశాంకుండైన రామభద్రు నెడబాసిన దుఃఖము చాలక నిన్ను నయితము కోలుపడితిని వనమున కరిగిన రామచంద్రుండు పితృవాక్య పరిపాలనముం జేసినవాఁడనెడి కీర్తి నార్జించెను. నీవన్ననో, భార్యకు చెప్పిన పలుకులు దప్పక వరంబు నొసంగి యనిన మాట రక్షించుకొనిన సత్యసంధుండవనెడి కీర్తినొందినాఁడవు. ఇపుడు నేను జెందిన ఫలమెయ్యది? వివేకహీననై యనుచిత వాక్యంబులు పలికిన నీ మనంబును నొప్పించుటచే పొడమిన పాపము నొడిగట్టుకొనవలసిన దానినైతి, ఇంక మాకు గతియెయ్యది?" బహుప్రకారంబుల శోకించుచుండ సుమిత్రాదులు నేడ్చుచుండిరి. అంతట నవ్వార్తనువిని వసిష్ఠ వామదేవ ప్రభృతులైన పురోహితులును, సుమంత్రాది మంత్రులును, తక్కంగల గొప్పవారలును వేగిరపాటు గదుర,

జనుదెంచి చూచి యా నృపాలుని మరణంబునకు మిక్కిలి దుఃఖించిరి. పిమ్మట గురుశ్రేష్ఠుండైన వసిష్ఠుండు కాలోచిత క్రియావిధానంబుఁ జింతించి, యంతఃపురకాంతల నుపచార వాక్యంబులచే నూరార్చి దశరథుని దేహంబు చెడకుండునట్లు తైలపక్వంబు గావించి వస్త్రాభరణంబు లలంకరించి సింహాసనంబుపైఁ గూర్చుండఁబెట్టించి జయంత ప్రభృతులైన మంత్రులంబిలిచి, ఈ మహారాజున కగ్ని సంస్కారాది క్రియలు చేయుటకుగా గిరివ్రజ పురంబునకుఁ బోయియున్న భరతునిఁ దోడ్కొని శీఘ్రముగా రండు తగిన సన్నాహంబుతో త్వరిత గమనంబున నరుగుఁ” డని నియమించెను. వారును నమ్మహాత్ముని యానతిం బ్రయాణంబై చనుచుండ వారింజూచి “భరతున కచ్చోట పితృ మరణవార్తఁ జెప్పవల” దని దిట్టము గావించెను.

అయోధ్యా పురంబువిడిచి మంత్రులు బహువేగముగా ప్రయాణముఁగావించి యేడవనాఁడు కేకయ రాజపురంబుఁజేరిరి. అంతకుమున్న సముద్రము ఇంకిపోయినట్లును, చంద్రబింబము భూమిపైఁ బడినట్లును కలగని యది దుస్స్వప్నంబుగా భావించి యేమి యడరుపుట్టునో యానెడి చింతగలవాఁడై భరతుండు తన స్వప్న వృత్తాంతము నచ్చోట మిత్రులతో చెప్పుచుండెను

—(*) భరతశత్రుఘ్ను లయోధ్యాపురంబునకు వచ్చుట. (*)—

ఆ సమయముననే యయోధ్యనుండి పోయిన మంత్రు లతనియొద్దకరిగి నమస్కరించి తము తెచ్చిన యుపాయనంబులు సమర్పించి “స్వామీ కులగురుండైన వసిష్ఠ మహర్షి మిక్కిలి ముక్కఅయైన పని గలుగుటచే మిమ్ముఁదోడ్కొని రమ్మని పుత్తెంచి వచ్చినారము. క్షణమైనం దడవుఁజేయక ప్రయాణంబై యయోధ్యకు రావలసిన”దని విన్నవించిరి. కారణంబు దెలుపక వారటుల బలుకుటచే భరతుండు కళవళమును బొంది యప్పుడ కేకయాధీశ్వరునియొద్ద కరిగి వృత్తాంతంబుఁజెప్పి యనుజ్ఞఁగైకొని వీడ్కొని శత్రుఘ్ను ద్వితీయుండై రథంబెక్కి కదలి యేడవనాఁడయోధ్యా నగరంబునుజేరి తల్లియున్న యంతఃపురంబుఁ జొచ్చి వచ్చుచున్న, తన కుమారుని రాక నెఱింగి, కైక మిక్కిలి యబ్బున నెదురుగా చనుదెంచి పుత్రు నాలింగనంబుఁ గావించెను.

భరతుండు తల్లికి నమస్కరించి కేక యావనీపతి పుత్తెంచిన యస్త్ర రత్నాభరణాదు లామె కర్పించి యచ్చటివారి సేమము నెఱింగించి యామెనుగని "జననీ! ఈనగరంబు పూర్వమువలెగాక కళాహీనమై వీథులు పాడుపడినట్లు చూపట్టుచున్నవి. నగరులు శూన్యమందిరముల చందముగా తోఁచెడిని సంతోష నిదానంబులుగాని వినోదంబులుగాని గానరాకున్నవి. నామనంబున కేదియు విపరీతముగా దోఁచుచున్నది హృదయంబు కలంగుచున్నది. ఇట్లుండుట కేమి కారణము? సర్వవిధంబుల నందఱును క్షేమముగా యున్నారుగదా! విపర్యాసము లెవ్వియుం గలుగవుగదా! ఈప్రకార మలంకార రహితమై యుండుటేలనో త్వరితముగాఁజెప్పి నాకలంత నివారింపు" మని యడిగెను.

కుమారుం డివ్విధముగా నడుగుటయు, కైక యతనిఁగాంచి "పుత్రకా! ఇచ్చోట నొక విశేషము జరిగినది. ఏమనగా, మీతండ్రి రామచంద్రునకు పట్టంబుఁగట్టఁ బ్రయత్నించెను అది నేనెఱింగి, తత్పూర్వము మీజనకుఁడు నాకొసంగునటుల వాగ్దానముఁ జేసియుండిన రెండు వరములునుగోరి, ఒకటి రామునికిఁ జేయనెంచిన పట్టాభిషేకంబుఁ నీకుఁ జేయుటకును, రెండవది రాముఁడు పదునాలుగేండ్లు వనవాసము జేయుటకును, నడిగి కైకొంటిని. సంతోషముతో నాతలంపు నెఱింగి తండ్రివాక్యములు సత్యము జేయుటకై రామచంద్రుండు సీతాలక్ష్మణ సహితుఁడై యరణ్యంబున కేగెను. అతఁ డరిగిన పిమ్మట పుత్రవియోగ దుఃఖమున సహింపనోఁపక నీజనకుండు మృతినొందెను. తనయా! నీక్షేమార్థముగా పాటుపడి నేను నిష్ఠురముల పాలై యెట్లో కార్యంబు సాధించినాను. ఇక నీ కెవ్వరును నడ్డుపడువారు లేరు సంతోషముతో పట్టాభిషిక్తుండవై రాజ్యభోగంబుల ననుభవింపుము. ఇచ్చటఁగల విశేష మిదియ" యని తా నొనర్చిన మహాత్కార్యంబును నెఱింగించెను.

రెండవ ప్రకరణము ముగిసెను.



# శ్రీ రామ వన వాస ము

## వచనకావ్యము.

### మూడవ ప్రకరణము.



భరతశత్రుఘ్నులు రామచంద్రుండు వనంబున కరుగుట వినిదుఃఖించుట. —

తల్లియైన కేకయాత్మజ యిట్టుల బలుకగానే, రామచంద్రునియం దత్యంతమైన భక్తియుం బ్రియంబునుం గలిగియుండెడివాఁడైన భరతుం నకుఁ గలిగిన వ్యసనం బి తయని చెప్పశక్యముగాదు. అమ్మహాభాగుఁ డామాటలువిని తటాలున "హా! రాఘవేశ్వరా! సుగుణ రత్నాకరా!" యని పేర్కొని పలుకుచు మూర్ఛాక్రాంతుడై యొరిగెను. శత్రుఘ్నుం డును తన యన్నవలెనే యయ్యెను. అయ్యో! పాపము కైక చిత్తం బి పుడు కలఁతనొందె, తానొనరించిన కార్యమునకు సంతోషించి తన కుమారుండు మెచ్చుగలండని యామె తలంచియుండెను. కాని యిపుడ ట్టులగాక విరోధముగా నేర్పడినది. రామచంద్రుం డరణ్యమునకుఁ బో వుటను వినినంతట సంతోషించుటకు మారుగా, భరతుండు దుఃఖాక్రాం తుఁడై మూర్ఛిల్లుటం జూడగా కైకకుభయముగలిగెను. ధర్మశీలుండగు భరతుం డవ్విధంబున మూర్ఛనొంది కొంతఁవడికిఁదెలిసి, యత్యుగ్రముఁ గలవాఁడై కన్నులు నిప్పులు రాలుచుండగా కడునుగ్రముగా తల్లివంకఁ జూచి "ఓ పాపాత్మురాలా! పరమ పుణ్యలక్షణ పూర్ణుండును, సమస్త కల్యాణ గుణగణ శోభితుండును, నిష్కళంక మానసుండును ధర్మస్వరూ పుఁడునునైన రఘుకులనాయకుని నరణ్యమునకుఁ బొమ్మనుటకు నీనాలుక యెట్లాడినది? నిరుపమాన సుకుమార సుందర శరీరుండును సకలజన వం ద్యుఁడునై నిశ్చింత నెల్లభోగములు ననుభవించు చుండఁదగిన యాపురు షోత్తముఁ డడవులలో భార్యయు ననుజుండునుదవవెంట దిరుగగా కష్ట ము లొందుచుండుట కర్హుండగునని నీబుద్ధికిఁ దోచెనా? ఆహా! నీవివేకం బునుగూర్చి యేమనఁదగును? మహాపరాధం బొనరించిన క్రూరమతివి గదా? అయ్యో! ఓ ఘోరరాక్షసీ! ఎంతపనిఁ జేసితివి? హరిహరీ! ఇటు

వంటి యకృత్యము మఱియొకటికలదా? మాయన్నయైన రామచంద్రుండు భార్యతోడను, తమ్మునితోడనుం గూడి జటా వల్కములు ధరించి. యడవులలో మునులంజేరి యిడుములు గుడుచుచుండగా, నే నిచ్చోట రాజ్యభారము వహించి సంతోషముతో భోగము లనుభవించుటకుసమ్మతింపుదునని తలంచితివా? నీ కెటుల తోచినది? ఈ దుర్బుద్ధి యెట్లు కలిగినది? ఇటువంటి ఘోరకృత్యముఁ జేయుటకు నీవుగాక మఱియెవ్వరైన తెగింపుదురా? పాపచిత్తవైన నీగర్భంబునఁ బుట్టినందుచే యాపాపము నన్నునుం బొందినది. ఇట్లు నీవు చేసినంతట శ్రీరామచంద్రుని ముఖంబును నేనెట్లు చూడఁగలను? ఆ రాజశేఖరుండు నన్నుఁ గని యేమని తలంచును? నేను రామభక్తుండ నగుట నెఱింగియుండియు నిట్టి యక్రమకృత్యముఁ జేయఁజెల్లునా! ఓ కైకా! అకటా! భవత్కృత్యమువలన రాఘవేశ్వరుని మనంబెంత నొచ్చినదోకదా దీనికి సుమిత్రా నందనుండు నాపై నెంత కోపమును జెందునో, తెలిసినది కాదు. నీ నిమిత్తమున నిన్నివిధముల చేటులు పుట్టినవి. నీవు కేకయ రాజునకు కూతురవై యెటుల జన్మించితివో గాని యాలోచింపగా, యతనికిఁ బుట్టఁదగిన దానవుకావు. నిజముగా కేకయరాజ బీజముననే జన్మించి యుండినచో నీ కిటువంటి క్రూరగుణము గలుగఁబోదు. భవత్స్వభావము జూడగా రాక్షసులకు బుట్టవలసిన దానవని చెప్పదగును యేలనో మనుష్యరూపమునఁ బుట్టితివి. నీయందు దైత్యగుణములు గలవు. లేదేని యంతటి యకార్యముం జేయఁ దలంపుఁగొన నొల్లవు నీవలననే మాతండ్రి మరణమునకు కాల మేర్పడినది. పాపజాతివియు, పతి హంత్రివియునగు నీతోడ మాటలాడ కూడ''దని పలుకుచుండ, శత్రుఘ్నుండును దెలివి నొంది కైక చేసిన దోషమున కాగ్రహము నొందియుండెను.

ఆసమయమున నిన్ని యుపద్రవములు గలుగుటకును నిమిత్తమైన దుష్టురాలు మంథరవాకిటనుండి భరతుని ప్రసంగమును వినుచుండెను. దాని దుర్మంత్రమువలన సర్వ కష్టములును తటస్థించుట నెఱింగియున్న యచ్చోటపరిచారకాజను లామాయలాడి యపుడు పొంచుండి వినుచుండుటంగాంచి దానికిఁ దగిన దండనఁ జేయింపఁ దలంచి శత్రుఘ్నునియొద్ద కరిగి జరిగిన విషయంబంతయుం జెప్పి "స్వామీ! ఇదిగో పరమదుష్టశీల ఈ మంథర మూలముననే యిన్ని చెడుగులును సంభవించినవి: ఇదియే యింతటికిని కారణమైనది. తా నొనరించిన కపటతంత్రము ఫలించు

నీకు సంతసించి ఇపుడు జరుగుచున్న ప్రసంగమును వినుచు, యెటుల జరుగునో చూడవలయుననెడి యుద్దేశముతో వాకిట నిలిచియున్న" దని వక్కాణించిరి.

ఆ మాటలు విని శత్రుఘ్నుండు దానిం జూచి యత్యంత రోషావిష్టుండై పండ్లు పటపటంగొఱుకుచు తటాలున లేచి యక్కురాత్ము రాలిని పడఁ దన్ని కడ కాళ్ళుగట్టి గిరగిరఁ ద్రిప్పి నేలమోది చంపి, ఇనుమడించిన కోపముతో కాలాగ్ని రుద్రాకారుండై వరనుండి ఖడ్గంబు దూసిపట్టుకొని జళిపించి "యటు తొలంగుడు, పాపచిత్తయైన యీకైక శిరము ద్రుంచెద"నని వచ్చుచున్న యామె భయమునొంది గడగడ వడంకుచుండ పరిచారికలు దిగులొంది పఱచి కౌసల్యాదేవి మఱుఁగుజొచ్చిరి.

అపుడు భరతుఁడు తమ్ముని యుగ్రమునుజూచి, "శత్రుఘ్నా! తమ్ముఁడా! వేగిరపడకు శాంతింపుము. మన మీపాపజాతిం జంపినయెడల మాతృహంతకుల మని యెంచి రఘువీరేశ్వరుఁడు మనమొగములు సూడనొల్లఁడు. దీనవల్లనెడి దేమిగలదు? ఈ కైక తానొనరించిన పాపమున తానే పోవునుగాక" యని వారించి యనుజ సహితుండై కౌసల్యాదేవి పాదములపైఁ బడిమ్రొక్కి మించిన దుఃఖమున రోదనముఁ గావించెను.

—(*) కౌసల్య భరతునితో నిష్ఠురముగాఁ బలుకుట. (*)—

"భరతా! కైకజా! నీతల్లి పతినివేధించి నీకు పట్టంబుఁ గట్టుటకును రామచంద్రుని నరణ్యమునకు బంపుటకును వరము వేడి తన పట్టిన పట్టువీడక కార్యమును సాధించెను. రాముఁ డడవుల కరుగుటయు తద్వియోగమున దుఃఖితాత్ముడై మహీనాథుండు ప్రాణములువిడిచె. ఇంక నీవు నిర్భయముగా నెమ్మదిని రాజ్యాభిషిక్తుండవై భోగము లనుభవింపుము. నీక్షేమమునకై నీతల్లి పాటుపడి కృతార్థురాలగుటం దలంచి యామెను సంతుష్టిని గలిగింపు" మనిపలికెను.

నిరపరాధుడైన భరతుండు కర్ణకఠోరములుగా కౌసల్యాదేవి పలికిన యా పలుకులువిని మహా దుఃఖమునుఁ జెంది కన్నుల శోకబాష్పములు తొఱఁగుచుండగా దీనవదనుండై "జననీ! ఈ విషయమున నాయందు లేశమైనం దప్పులుగలుగదు. ఇందొక్కటియును నే నెఱింగియున్నవాఁడను కాను. మా యన్నయైన రఘుకులనాథుని పితృసమునిగా భావించి యతని నెంతయు భక్తితో సేవించువాఁడను. నేనా మహాత్ము

నకు ద్రోహమును కలలో సయితమెంచువాఁడనుగాను. మదీయ చిత్తవృత్తి యీ రామచంద్రుం డెఱుంగును. నేను కైక చేసిన దుష్కార్యములకు సంతృప్తిఁ బొందినట్లును, రాజ్యాభిషిక్తుండనై పుడమినేలఁదలఁచితిననియు నెంచి నీవిట్టుల బలికెదవని నే నెఱుంగుదును. సందర్భమును బట్టి యిట్టుల తోఁచినను, నాకీ విషయమున నెట్టి సంబంధమునులేదు, ఈ జరిగినవానిలో నేవిషయంబైనను నే నెఱింగి యుండుదునేని, లోకస్తుతుఁడైన రామచంద్రునకపకారము నెంచియుంటినేని, యమ్మహాత్మునరణ్యమునకు బనిచి రాజ్యపాలనముఁ జేయుట కానఁజేసి యుండినవాఁడనేని వినుము. లోకమున, బ్రాహ్మణునిఁ జంపినవాఁడును, గురుపత్నింగవసినవాఁడును, సురాపానం బొనరించినవాఁడును, బంగారు దొంగిలినవాఁడును, యుద్ధమున శత్రువులకు వెన్నిచ్చి యోడి పరుగెత్తినవాఁడును, నెట్టి దుర్గతికిఁ బోవుదురో, యీ పాపఫలము ననుభవింపగలవాఁడును, సూర్యచంద్రగ్రహ తారకములును భూమ్యాకాశములును సాక్షిగా నాయందు తప్పులు గలుగదు, తల్లీ! నాయందు కృపాదృష్టులఁ బరగఁజేయుము నీ పాదములాన నేనేమియు నెఱుంగ" నని గద్గద స్వనముగఁ బలుకుచున్న యవసరమున "ఓయమ్మా, కౌసల్యా! ఇతనియందఱరాధములేదు. నిష్కల్మచిత్తుండు, రామభక్తుడైన యీ భరతుని వాక్యములు సత్యము"లని యాకాశవాణి పలికినమాటలు వినవచ్చెను. అంతట కౌసల్యా సుమిత్రలక్కుమారునియందు తమకు బొడమియున్న దురభిప్రాయము విడిచి పుత్రవాత్సల్యంబున కౌఁగలిఁచి రోదనము గావింపఁ దొడఁగిరి. అపు డంతఃపురమున సంకులాక్రందన ధ్వను లతిశయించుటయు, వసిష్ఠుం డరుదెంచి శాంతవచనముల నూరార్చి దుఃఖము నివారించి దశరథుని దేహమునొద్దకుఁ దోడ్కొనిపోయెను.

భరతశత్రుఘ్నులు తండ్రి కళేబరముం గాంచి శోకాతిరేకమున మూర్ఛిల్లి భూమిపై నొరగికొంతవడికి తెలివినొందిరంత భరతుఁడు మెలుం గెత్తి "ఓ తండ్రీ! దశరథేశ్వరా! పుణ్యావర్తనా! రాజకుల శిఖామణీ! భవన్నందనులమైన మే మరుదెంచి వేచుచుండ కన్నులువిచ్చి మావంక చూడవేల? మన్నింపవేల? కేకయీవనీనాథుఁడు నీకై పుత్తెంచినబహుమతులివె యున్నవి వీని నంగీకరింపుము నాతోడ సంభాషింపుము కైక కడుపునఁ బుట్టినవాఁడగుటచే భాషింప నర్హుండనుగానని యెంచినాఁడవా? ఇదే కన్నులువిచ్చి దుఃఖముచే నేలఁబడి పొరలుచు, శోకించుచుం

డైడి శత్రుఘ్నునిం జూడుము. ధూళి ధూసరితాంగుఁడై న యతని నాలింగన మొనరించి యాదరించి వ్యసనము నివారింపుము. మేము రామునకు ద్రోహముఁ జేసిన పాపాత్ములము గాము అనాదరణీయుల మగుట కేమికారణము?" అని పలుకుచు పనవిపనవి హాహాకారము లెసంగ రోదనముఁ గావింపఁ దొడంగెను.

వసిష్ఠుం డపు డతనికి తగిన భంగిని బోధించి శోకము నివారించి, "భరతా! నీవు బుద్ధిమంతుఁడవై యుండియు, పామరుని చందమున వ్యసనమునొందుట పాడిగాదు. శాస్త్ర క్రమమున నీవింక తండ్రి కగ్ని సంస్కారాది క్రియలు గావించుటఁ గడంగు" మని చెప్పెను భరతుం డమ్మహాత్ముని యాజ్ఞానుసారముగా జరిగించువాఁడై సకల రాజులను రప్పించి వసిష్ఠుఁ బురస్కరించుకొని దశరథుని కళేబరము నలంకరించి సువర్ణ విమానమునఁ బెట్టుకొనిపోయి కౌసల్యాదులు వెంట వచ్చుచుండగా ప్రేతభూమిం జేరి చితిపైనిడి విధిక్రమంబున నగ్నిసంస్కారమును గావించి వేదోక్తమార్గమున తిలోదక దానముఁ జేసి మందిరమున కరుదెంచి జరుగవలసిన కృత్యములు నిర్వర్తించి వసిష్ఠాదుల యాశీర్వాదంబులు పొంది కృతకృత్యుం డయ్యె అంతట వసిష్ఠుండు సకల రాజన్య మంత్రి పురోహిత పౌరజన సమక్షమున భరతునిఁ జూచి "లక్ష్మణాగ్రజా! రాజ్యము రాజకమైయున్నది. కావున నీవింక పట్టాభిషిక్తుండవై ప్రజాపాలనముఁ జేయుట కర్తవ్యము, సందేహింపక రాజ్య పట్టంబు గట్టుకొను" మని పలుకుటయు, యా మాటలు శూలప్రాయములై తోఁచుటయు, మనంబోర్వక మునివరునిగాంచి స్వామీ! సామాన్యులు పలికెడి చందమున మా కులధర్మము నెఱింగియు నెఱుంగనట్లు పలుకుచున్నాడవు. ఇటువంటి పలుకులు మీబోంట్లు పలుకవచ్చునా? నేనీమాటలు వినజాల అటువంటి కోరిక నా మనమునఁ గలదని మీరు తలపకుఁడు. కైకకు కొడుకనై పుట్టుట తప్ప నాయందు మఱే యేతప్పును లేదు. కలదేని వచింపుఁడు. మహాత్మా! జగదేక పుణ్యమూర్తియైన యా రామచంద్రుండు దక్క రాజ్యాధిపత్యమునకు మఱియొకఁ డర్హుండగునె? నేను ప్రయాణంబై చని వెదకి కనుఁగొని పావన గుణాభిరాముఁడైన రాఘవేశ్వరుని ప్రార్థించి తోడ్తెచ్చి సింహాసనాసీనుం జేసి యభిషిక్తునిఁ గావించెదను. నా ప్రార్థన నంగీకరించి రఘూత్తముఁడు రాఁడయ్యెనేని, నేనును మా యన్నవలె తపోవేషముఁదాల్చి యన్న పాదపద్మములు సేవించుచు వ

నమున నే యుండెద. సత్యమైన నా నిశ్చయం బిదియ" యని దృఢమ్ముగాఁ బలికెను.

భరతుని నిష్కళంక భావము నెఱింగి యతని ధర్మయుక్తములైన మాటలువిని సభాసదులు శిరఃకంపంబొనరించి రామచంద్రుని యందతనికిఁ గల భక్తిగౌరవముల నెంతయుం గొనియాడుచుండిరి. అంతట

—(*) భరతుండు రాముని దోడ్కొని వచ్చుటకై పోవచ్చుట. (*)—

కైకేయీ నందనుండు నిజ ప్రమాణ వృత్తాంతమును చాటించి సన్నాహంబుఁ జేయించి ముగ్గురు తల్లులును, రాజులును, మంత్రులును, పురోహితులును, వసిష్ఠ మునీంద్రుడును, తమ్ముఁడైన శత్రుఘ్నుఁడును వెంట వచ్చుచుండగా సైన్యయుతుండై ప్రయాణంబై పురమువిడిచి చని గంగాతీరముఁజేరి యచ్చోట విడసెను. సేనలతో భరతుండువచ్చి యట విడిసియున్న వృత్తాంతమును గుహుఁడు చారులవలన నెఱింగివచ్చి కనుంగొని మహాదాగ్రహమునుజెంది తనలో "ఔరా! ఎంతటి యక్రమము? ఎంతటి క్రూరచిత్తుం డనవలయును? ఈదుష్టుండు తన తల్లి చేసిన యకృత్యము నెరవేరుటయు రాజ్యము లభించుటతో తృప్తినొందక మత్సరము వహించి, రాజపరమేశ్వరుండైన రామచంద్రుని హింసించుటకై యమ్మహాత్ముం డరణ్యముల నుండుటకు సయితము సహింపక సైన్యముతో యతనిమీఁదికెత్తి వచ్చుచున్నాఁడు. ఇటువంటి పాపశీలుండు గలఁడా? కానిమ్ము నేనితని గర్వమడఁచి మరలించి రామచంద్రునకు గలుగఁబోయెడి సంకటమును నివారించెదఁగాక" యని నిశ్చయించి భరతుని సైన్యమును గంగానదిని దాటింప వలదనియు నోడలనుగట్టి యుంచుఁడనియు నోడ నడపువారలకు కట్టుబెట్టముఁ జేసి తన బలముల నాయత్తముం గావించుకొని కదలి మహాగ్రహ చిత్తుండై భరతునియొద్ద కరిగి యతనితోఁ నిట్లనియె.

కైకేయీ నందనా! ఇటువంటి దుష్కార్యమునకుఁ గడంగుట నీకు తగునా? అయ్యో! పాపము! నీతల్లి చేసిన ద్రోహమునకు గుఱియై తండ్రి పలుకులు సత్యముఁ జేయఁదలంచి తమ్ముఁడును భార్యయుంగూడిరా సకల భోగములును విడనాడి మునివేషములు ధరించి యరణ్యవాసముఁ జేయువాఁడై పోయిన ధర్మవర్తనుండగు రాఘవేశ్వరు నంతటనైన విడువనొల్లక యతనిఁబట్టి వధింపఁనెంచి సైన్యయుతుండవై పోవుచున్నాఁడవు.

న్యాయమని నీబుద్ధికిఁ దోఁచెనా? ఈరాజకులమహాళి నీకు గావించిన యపకృతియేది? నిష్కారణముగా నతనియం దింత మాత్సరము వహించుట యాశ్చర్యముగా గనుపట్టుచున్నది. ఏమి చేయఁదలంచితివి? ఆక్రూరాత్మురాలైన కైక గర్భమునఁ బుట్టినవాఁడవుగాన, తద్గుణములు నీకునుం గలిగియేయుండును. తప్పిపోవునా? ఎంతటిగొప్పసైన్యముతో నుండినను రామభక్తుండునైన నేనిచటనుండి యొక యడుగైనను దాఁటి పోవిడువనని యెఱింగికొనుము. ఈ గుహుం డంతటి దుర్బలుండుగాఁడు సుమా! మదీయ ఘోర నారాచ పరంపరలచే నీసేనల నురుమాడి నెత్తురు వెల్లువలు పాఱునటుల గావింపక విడువను. ఇటనుండి నీవేలు దాఁటిపోవఁ దలంచినచో జయించియుద్ధమున నన్నువధియించి కానిపోఁజాలవు. అటుల చేయఁగలిగినచో కావించి చనుము. సాధ్యముకాదని తోఁచిన దురుద్దేశమును మాని యయోధ్యకు మరలిపొమ్మని రోష తామ్రాక్షుండై కడు నుగ్రుండై పలికెను

గుహుఁడు చెప్పిన మాటలు విని భరతుం డలుకమాని సస్మితాస్యుఁడై "కిరాతవల్లభా! నేను కైక సుతుఁడనైనను, ద్రోహబుద్ధిఁగలవాఁడనుగాను. రామున కెప్పుడును నెట్టి కీడును దలంచి యెఱుంగను. నేనమ్మహాత్ముని గురు సదృశునిగా నెంచి సేవించువాఁడను ఇపుడు నేనరుగుట రామచంద్రున కపకృతిఁ జేయుటగాదు. వెదకి కనుఁగొని ప్రార్థించి తోడ్కొనివచ్చి పట్టాభిషిక్తునిం జేయుటకై నిశ్చయించి పోవుచున్నాను. ఇది సత్యము నాయందు నీకు గలిగిన దురభిప్రాయము వీడి త్వరితముగా సైన్యమును దాఁటింపు"మని చెప్పిన గుహుండు సంతోషచిత్తుండై "దశరథకుమారా! నీతలంపు నెఱుంగలేక నాలోన నన్యథా భావించినాఁడను. నాయపరాధము క్షమింపు"మని ప్రార్థించి శ్రీరామచంద్రుండు విడిసి యుండినచోటును అతండు శయనించిన గారచెట్టు మూలప్రదేశమును పర్ణశయ్యయు, జడలు ధరించిన చోటునుజూపి చెప్పుటయు భరతుండా ప్రదేశముగాంచి పట్టరాని దుఃఖముఁ జెంది విలపించుచు, అప్పుడు శత్రుఘ్న సహితుండై యచ్చోట తానును జటావల్కములుదాల్చి గుహునిసహాయమున గంగానది నుత్తరించి యాకిరాతపతిచేఁ ద్రోవ చూపించుకొని యతని వీడ్కొని యటనుండి కదలి భరద్వాజాశ్రమమునకుంజని యమ్మునీంద్రుని సందర్శించి నమస్కరించుటయు, తపోధనుండు భరతునిఁజూచి కోపముఁగదిరి.

—(*) భరద్వాజుండు భరతునిపై కోపమొందుట. (*)—

"ఓయి కైకజా! రాజ్యమును నీకొసంగి మునివేషము దాల్చి కారడవులలో పత్నీయనుజ సహితుండై వసించు రామచంద్రుని యెడ మత్సరించి యా పుణ్యభావునకు కీడుఁజేయువాఁడవై సేనాసహితముగా బోవుచున్నాఁవు. ఆహా! నీదుశ్శీలమున కేమనవచ్చును? కైకకు సుతుఁడవుగదా? నీవు లోకనిందకు వెఱఁగు నొందుదువా? ఆ దురాత్మురాలి గుణములేకాదా నీకు పట్టుపడినవి అయిన? నీకాసుగుణాభరణుఁడు లోబడునట్టి వాఁడగునా? నీకతండు భయముఁజెంది శరణాగతుఁడగునా? అంతటి యల్పుఁడా? రాఘవేశ్వరుఁడు, వేడగా ఇటువంటి ద్రోహమునకుఁ గడంగిన నీవు మఱి యే కార్యము నైనను చేయ సంశయించు వాఁడవు కావు. ఇట్టి యక్రియ కృత్యమునకుఁ గడంగిన నీవు తత్ఫలము ననుభవింపక పోవుదువా?" యని కన్ను లెఱ్ఱజేసి యుగ్రుండై పలికెను.

మునీంద్రుని కోప లక్షణములు గాంచి ఉక్కిలి భయముఁ జెంది భరతుండా తాపసోత్తముని పాదములకు పునః ప్రణామం బొనరించి "మహాత్మా! కోపము నుపసంహరింపుము. నేనిపుడు రామచంద్రునకు కీడుఁ జేయ నెంచి ద్రోహబుద్ధి గలవాఁడనై పోవుచున్నాఁడనని తలంపకుఁడు. మనోవాక్కాయ కర్మములయందు కౌసల్యానందనుని దైవముఁగను, తండ్రిగను, భావించుచుండుదునుగాని కలనైనను నాలో ద్రోహ చింత గలుగదు. మీ పాదమూన ఇది సత్యము. రవికులచంద్రుని ప్రార్థించి తోడ్కొనివచ్చి పట్టాభిషిక్తునిఁజేసి యా రాజశేఖరుని సేవించుచుండఁ దలంచియే నేను పోవుచున్నాను. మీరు వేఱువిధముగాఁ దలంపక కృపా దృష్టులంగాంచి మార్గంబెఱింగింపుఁ"డని వినమ్రుండై వేడెను.

భరద్వాజ మునిశేఖరుం డవ్విధమునఁ జెప్పిన భరతుని వాక్యములు వినినంతట కోపమువీడి సంతోషచిత్తుండై యతనిని నాఁటిరాత్రి తన యాశ్రమమున నిలువఁజేసి యతనికి నతని సైన్యమునకును విందుఁ గావించి సంతుష్టి నొందించెను. ఆరేయి మునివరుని యాతిథ్యముచే భరత శత్రుఘ్నులు సంతుష్టులై కాలముగడపి, ప్రభాత సమయమున మేల్కొని నిత్య కృత్యములు నిర్వర్తించి ప్రయాణంబై తపోధనుని యనుజ్ఞ గైకొని యతం డెఱింగించిన దారింబట్టి చిత్రకూటాచలమునకుఁ బోయెను. సేనాసమేతుండై భరతుండు వచ్చుచుండగా, నట చిత్రకూ

టమున, లక్ష్మణుండు వెంటరాఁగా, రాఘవేశ్వరుండు సీతాసహితముగా విహరించుచుండి, తత్సేనా కలకలమును విని, భీతిల్లి పలుగెలంకులకుం బాఱుచున్న మృగపక్షి సముదయములం గని యటు దిక్కు మొగంబై దట్టముగా ధూళి రేగి యాకాశము నావరించుచుండుట కచ్చెరువొంది తమ్మునితోఁ దమ్ముఁడా. లక్ష్మణా! ఇటుచూడుము. ఏలనోగాని పెంధూళి యెగయుచున్నది మృగములు కలంతనొంది యార్తధ్వనులు సేయుచు పరువిడుచున్నవి. కారణం బెద్దియో తెలియకున్నది కనుఁగొను"మని చెప్పిన సౌమిత్రి వడివడిగా నొక పొడవైన మ్రాని కొట్టకొన నెక్కి నలుగడలం బరికించి యుత్తరపు దిశనుండి వచ్చుచున్న చతురంగ బలములతోడి మహాసైన్యముఁ గాంచి బాగుగా తత్ప్రకారము విమర్శించి, తమవంశజులకు చిహ్నములైన ధ్వజ పతాకములు మెఱయుచుండుటం గని "ఓహోహో! భరతుండు పగఁబూని మముఁబట్టుకొని వధించుటకై యివ్విధమున దళములతోఁ గూడి వచ్చుచున్నాఁడని తనలోఁ దలంచి మహాకోపముతో చెట్టుపై నుండి దిగ్గున క్రిందఁ దూకి యన్నయొద్ద కరుదెంచి "రఘుకులేశ్వరా! సేనాసమేతుండై పాపబుద్ధియగు భరతుఁడు మనపై వచ్చుచున్నాఁడు. మన మరణ్యముల నుండుటకు సయిత మతఁడు సమ్మతింప కున్నటుల తోఁచుచున్నది. తడవుఁ జేయక నీవు కవచముధరించి బాణాసన సన్నద్ధుండవు గమ్ము. కాదేని జనకనందనం దోడ్కొనికొండ గుహాలోని కరిగియుండుము. ఓ యన్నా నీ శాంతగుణమువలననే యిన్ని విధముల నిక్కట్టులు పుట్టుట తటస్థించెను ఇంక నేను శాంతచిత్తుఁడనై యుండఁజాల. నేనీ క్షణంబ మదీయ ప్రతాపం బేర్పడగా నెదిరించి యతని ప్రాణంబులం గొనియెదగాక" యని మహోగ్రుండై పలికెను.

భరతుండు వచ్చుట తెలిసినంతట రామచంద్రుండు సుమిత్రాసుతుని కతనిపైఁ గలిగిన యాగ్రహమునుజూచి యదల్చి "లక్ష్మణా! ఇది వివేకి లక్షణమని తలంచితివా? నా తమ్ముఁడవై యుండియు, నింత యజ్ఞానపు మాటలు పలుకుటయు, నీచోక్తులు బలుకుటయు నుచితములగునా? భరతుం డెట్టివాఁడని తలంచితివి మహాగుణవంతుఁడు న్యాయశీలుఁడు. నీకంటె నెక్కుడుగా నాయందు భక్తియుం బ్రియమునుం గలవాఁడు. అటువంటి పరమ యోగ్యునిం గూర్చి దురభిప్రాయముతో నీవిటుల బలుకరాదు. అతని చిత్తవృత్తి నీ వెఱుంగవు. మరల నయోధ్యకుఁ దోడ్కొనిపోవుటకే యాయుత్తమవర్తనుం డరుదెంచుచున్నాఁడు

గాని మఱియొక విధముగాదు. వేగిరపాటు వీడి శాంతచిత్తుండవై యుండు" మనినపుడు నమ్మాటలకు భీతిల్లి సుమిత్రాపుత్రుండు లజ్జావనత వదనుండై మాటాడక యిన్నకుండెను.

—(*) భరతుండు చిత్రకూటంబున నుండు రాముని యొద్దకు బోవుట. (*)—

అంతఁ గొంతవడి కాప్రదేశమును సమీపించి సేనలనెడ గలుగ నిలిపి, భరతుండు శత్రుఘ్నునితోఁగూడి పాదచారియైవచ్చుచు యెదుట రాఘవేశ్వరుండు నివసించు పర్ణశాలనుజూచి యధికమైన దుఃఖముచే మనం బెరియుచు డ తమ్మునితో "అనుజా! శత్రుఘ్నా! విధి చెయిధమున కేమనవచ్చును? రమణీయ రత్న సౌధములలో నివసింప వలసినవాఁడును రమ్య వస్త్రభూషణాంగ రాగాలంకృతుండై యొప్పుచుండ వలసినవాఁడును. సకల జనులచేతను సేవింపఁబడుచు నిరంతర భోగంబు లనుభవింప వలసినవాఁడును, నైన రాజన్య శిఖామణి రాఘవేశ్వరుండు పర్ణశాల యందు జేరి దర్భశయ్యపై శయనించుచు, జటా వల్కలములుదాల్చి యడవి మృగములతోఁగూడి మునివృత్తిఁ గైకొనియున్నాఁడు. అయ్యో! పరమ సుకుమారమూర్తి కెంతటి దురవస్థ వచ్చినది? క్రూర మానసయైన కైక కడుపునఁబుట్టిన కారణముచే పుణ్య స్వరూపుఁడైన రవికుల నాయకుఁ డిటుల కష్టములు పొందుచుండగా చూడవలసినవాఁడ నైతిని ఈ నా హృదయవేదన యెటుల తొలఁగునో తెలిసినది కా"దని పలుకుచు దీనవదనంబుతో పర్ణశాలఁ జేరవచ్చి యట రామచంద్రుంగాంచి యనుజ సమేతుండై పాదపద్మంబులపై సాగిలంబడి దండప్రణామంబులు గావించెను.

రాఘవుండు మిక్కిలి ప్రీతితో భరత శత్రుఘ్నుల గ్రుచ్చి యెత్తి యాలింగనంబుఁ గావించుటయుం బదంబడి సీతాలక్ష్మణుల కుచితభంగిఁ బ్రణమిల్లి యంత దర్భాసనములపై నాసీనులై యుండ రామచంద్రుండు తమ్ములనుజూచి "తండ్రి క్షేమముగా యున్నాఁడా?" యని యడిగెను అపుడు భరతుండు దుఃఖముతో డగ్గుత్తిక యడగగా "దేవా! మీరు పురంబువిడిచి వచ్చిన యేడవనాఁడు భవద్వియోగ దుఃఖముచే మన జనకుండు లోకాంతరంబు నొందె"నని పలికి కన్నుల నీరురాల్చెను, శూల ప్రాయంబులైన యా పలుకులు సెవులఁ జొరగానే రాఘవేశ్వరుండు శోకాతిరేకంబున మూర్ఛా పరవశుండయ్యె సీతాలక్ష్మణులు మృతినొందిన

హారిచందంబునఁ బడియుండిరి. కొంతవడికి కౌసల్యానందనుండు తెలివి వొంది తండ్రిందలంచి వాపోవుచుండ భరతుం డమ్మాహనవ కులశేఖరునిఁ గని, "సర్వేశ్వరా! ప్రాకృతుని చందమున శోకించుట నీవంటి పరమవివేకపూర్ణునకుఁ దగునా? శాంతినొందుము. కడచినదానికై వగచుట ప్రయోజనము లేదనుట నీ వెఱుఁగని విషయము కాదు. దుఃఖించిన కలుగు ఫలమెయ్యది? శోకంబుమాని శాస్త్ర ధర్మానుసారముగా పితృ ఋణమును దీర్పు" మని బోధించుటయు తెలిసి యది యట్ల కాక యని సీతాలక్ష్మణ సహితుండై పోయి మందాకిని జలంబులందు స్నానం బాచరించి తిలోదకంబు లొసంగి విధి విహిత కృత్యంబులు నడిపి, రేగుబండ్లతో కలిపిన యింగుదీయ వపిణ్యాకంబులు పిండంబులుపెట్టి కృతకృత్యుండై పర్ణశాల కేతెంచి తమ్ములం బట్టుకొని రోదనంబుఁ జేయుచుండుటయు, చిత్రకూట వాసులైన మును లరుదెంచి వృత్తాంతంబు నెఱింగి యుచితవాక్యంబుల నూరడించి దుఃఖంబు నివారించిరి. అంతట వసిష్ఠుండు కౌసల్యాదులం దోడ్కొనివచ్చుటయు రఘుకులేశ్వరుండు సతీసమేతుండై ముగ్గురు తల్లులకును మ్రొక్కి వారితోడ గూడి ఘోరమున రోదనంబుఁ జేయఁదొడంగెను. ఆయార్త ధ్వనివిని యచ్చోటి మునులు భయంబు నొందిరి. ఆ పర్వతమున విహరించు దేవతలు సయితము చింతాక్రాంతులైరి. ఆ దేవకాంత లధిక వ్యసనంబుచేఁ బొగలుచున్న జగదీశ నందనంజూచి సకరణముబుగా "ఆహా! ధర్మ నిరతుండైన జనకమహారాజునకు నందనయు, జగద్విఖ్యాతుండైన దశరథావనిపతి కోడలును, పరమ సద్గుణాభి రాముఁడైన రామచంద్రుని దేవియునగు సీతాదేవి యీ రీతిగా కానన వాసముఁజేయుచు నానా కష్టములు ననుభవించుటకుఁ బాలైనదిగదా! దైవగతి కసాధ్య మెయ్యదిగలదు?" అని పలుకుచు, కైకను వీక్షించి "ఇదె, పాపజాతియైన క్రూరాత్మురాలు. ఈ దుశ్శీల మూలముననే వీరికిన్ని పాటులు తటస్థించిన" వని పలుకుచుండిరి. వసిష్ఠుండు శాంతవచనంబుల నూరార్చి కొంతవడికి శాంతినొందఁ జేయుటయు, నచ్చటి మునులు మొదలగువారును, తమ్ములునుం బరివేష్టించి యాసీనులైయుండ రాఘవేశ్వరుండు కొలువుండగా సభామధ్యంబునఁ గూర్చుండియున్న యన్న నవలోకించి, భరతుం డెంతయు వినయ విధేయత లెసంగ నందఱును వినఁగా యిట్లనియె.

"మహాత్మా! రాఘవేశ్వరా! కోసలదేశంబున నరాజకత వలన గలిగెడి యుపద్రవము కలుగకుండునట్లు చేయదలంపుము దేవా! స్త్రీ సర్వజ్ఞుండవయ్యు వివేకహీనురాలును పాపవర్తనయునైన కైక చెప్పినం మాత్రమున వేగిరపడి నీవు సతీ సోదర సహితుండవై యరణ్యమునక రాఁజల్లునా? కటా! యోజింపవలదా? నీవు పాలింపవలసిన రాజ్యము కర్తృ లేవఁడుకలఁడని యెంచి విడిచి వచ్చినాఁడవు? ఎవనికి సాధ్యమ గును? నమ్మును రాజ్యమునువిడిచి వచ్చుటకు నీకు ధర్మమగునా? ఇటుల తెంపుచేయుట పాడిగాదు. నావిన్నపము నాలించి యయోధ్యకు విచ్చేసి ప్రజాపాలన భారంబును వహింపుము. నీవు పాలింపఁదగిన రాజ్యమును పాలించుటకు నావంటి యల్పునకు శక్యముగాదు. ఆ భారమును నేన మోపఁజాల. ఆ మహాకార్యమును నీవలనఁగాక యన్యులకు నిర్వహింప సాధ్యమా? రమ్ము రాజ్యముఁ జేకొని మమ్ముఁ బాలింపుము. నామనవి నంగీకరించక యయోధ్యకు వచ్చుటకు నిరాకరించెదవేని, ఇంక నేనును నచటికిఁ బోయెడు వాఁడనుగాను. ఇది నానిశ్చయము. ఇచటనే ప్రాయో పవిష్టుండనై మిమ్ముంబోలె యుండెదను" అని పలికి దర్భాస్తరణ శయ నుండయ్యెను. అపుడు రామచంద్రుం డతనియెత్తి కౌఁగలించి "భరతా ఇదియేమి? నీవు బుద్ధిమంతుఁడవై యుండియు మన కులాచార ధర్మ ములను దలంపక యిటుల బలుకుట వింతగా తోఁచుచున్నది. దశరథా వనీశ్వరునకు నా యట్టి కొడుకు గలిగియుండి తండ్రిమాట సత్యముఁజేయ వలదా? చెప్పుము? పితృవాక్య పరిపాలనముఁ జేయవలసినది కుమారు నకు ధర్మంబను విషయము నీవెఱుంగనిది కాదు. మనము న్యాయదూ రులమై ప్రవర్తించితిమేని లోకులు మనలఁగూర్చి యెటుల బలుకుదురో ఆలోచింపుము. బాగుగా యోజించియే నేను వచ్చినాఁడను గాని తొం దరపడి యడవికి రాలేదు సుమీ! ఇపుడు చెడిన దేమి గలదు? నావ్రతం బు సమాప్తముకాఁగానే యయోధ్యకువచ్చెద. మూర్ఖపు పట్టును విడు వుము. నేనును రానైతినని నెడి చింతను మనంబున నుంచవల"దని చెప్పిన, యచ్చట దేవతాముని గణమును రావణ వధంబును గోరుచుండిన వారగుటచే రామచంద్రుని పలుకులు తమకు సంతసము గలిగించుటయు, నాగతా నాగత వృత్తాంతము లెఱిఁగినవారలై కౌసల్యాతనయుండు చెప్పినమాట లెఱతయు సమంజసములై యున్నవని పలికిరి. భరతుం

యేమియుం బలుకఁజాలక చింతాక్రాంతుఁడై మొగమువాంచి నేలఁజూచు చుండ యతనితీరు నెఱింగి వసిష్ఠుండు రామచంద్రునిఁగాంచి యిట్లనియె.

—(*) భరతుండు రామపాదుకలం గొనుట. (*)—

"రాఘవేశ్వరా! ఈ భరతుఁడు నీకు ప్రియభక్తుఁడు. సదా నిన్ను సేవింప దలంచుచుండువాఁడు. ఇతని చిత్తవృత్తి నీ వెఱుంగనిది కాదు నీవన్ననో భక్తవత్సలుండవు. కావున భవదాగమనముఁగోరి యింత దూరము నిన్నుఁదోడ్కొని పోవుటకై వచ్చి నీవు రాననుటచే దుఃఖాక్రాంతుఁడై యయోధ్య కరుగుట కిచ్చలేకయున్న యీ సుశీలునకు నీవు ధరించు పాదుకలనైన నొసంగుము వాని నితఁడు సేవించుచు నీవు మరల యయోధ్యకు వచ్చునంతవరకును కాలము గడపుచుండ గలం"డని చెప్పెను. గురుం డటుల బలుకుటయు సమ్మతించి రామచంద్రుండు తన పాదుకలను భరతున కొసంగి యతనిజూచి తమ్ముఁడా! నీవు కోరినట్లు వచ్చుటకు నేను సమ్మతింప నైతినని వగవకుము. వ్రతమునుదీర్చి మన తండ్రివాక్యమును సత్యముగాచించి యయోధ్యకువచ్చెద. ఊఱటనొంది శాంతచిత్తుండవై యుండుము పొమ్ము. బుద్ధిమంతుఁడవుగాన నీకు విశేషించి చెప్పవలసినది లేద'ని పలుకుటయు చేయునది లేక భరతుండు మఱి యేమైనం బలికినచో యన్న మనము నొచ్చునని భయము గలిగినవాఁడై తదాజ్ఞానువర్తనము శ్రేయంబని యెంచి శత్రుఘ్న సహితముగా రఘూద్వహునకు ప్రదక్షిణ నమస్కారము లొనరించి యనుజ్ఞఁగైకొనియున్న పాదుకలను తలపైఁబెట్టుకొని వెడలి శత్రుంజయంబనెడి యేనుంగుపై నవ్వావలనునిచి తానును శత్రుఘ్నుండును వానికిరుగెలంకులనుండి ఛత్రచామర హస్తులై సేవి పుచు, సకల సైన్య పరివార సమేతముగా చిత్రకూటమునువిడిచి చనిచని భరద్వాజాశ్రమము జేరి యమ్మునీంద్రునకు జరిగిన వృత్తాంతమునుచెప్పి నమస్కరించుటయు నతఁడు సంతోషించి యాశీర్వదించి వీడ్కొలిపెను. అటనుండి కదలి గంగానది యొడ్డుంజేరెను.

గుహుండు భరతునిరాక నెఱింగి సపరివారుండై వచ్చి మొ్క్కిన యతనితోడ తానుచనుటయు రామచంద్రుం డాజ్ఞాపించిన విధమునుం దెలియ బలికి యతని సహాయముచే యాతరంగిణిదాఁటి యయోధ్యా

రాక్షసు లెక్కుడుగా గలరు. వారెపుడును నలుగడం దిరుగుచు, మునుల గష్టములపాలు చేయుచుందురు. ఈ మునీశ్వరులా క్రూర రాక్షస బాధలం దప్పించుకొనుటకై యుపాయమును విచారించుచున్నారు, ఓయి రామా! రావణుని తమ్ముఁడు ఖరుఁడనెడి వాఁడొకడున్నాడు. వాఁడు కడుబలవంతుఁడు పరాక్రమమున నద్వితీయుఁడు మాయావి, దుశ్శీలుండు బహుళ రాక్షస బలములతోడ నహోరాత్రంబు జనస్థానంబను ప్రదేశమున వసించుచుండు వాని యాజ్ఞావర్తులై దుష్టరాక్షసులు సదా మునుల బాధింపుచు, సత్క్రియావిధులు జరుగనీయకనే భంగముల విఘ్నములా పాదిల్లఁజేయుచు, హోమాగ్నుల జల్లార్చుచు స్రుక్స్రువాదులం బాఱవైచుచు, ఘోరరూపములుసూపి వెఱపించుచు ప్రాణుల హింసింపుచు, హవిర్భాగముల శోణితంబు గలుపుచు, మఱియుం దోఁచిన చందమున నేగుచుందురు ఇది కారణముగా నివ్వోటును విడిచి యొండెడ కరుగుటకై వీరిపుడు నాతోడ నాలోచించుచున్నారు. ఇదియ మేము సంభాషించుకొనిన విషయము. ఓ రామా! ఇచ్చోటికి కొంతదూరమున నొక పురాతనంబైన తపోవనముగలదు: అది కందమూల ఫల సమిత్కుసుమ సమృద్ధంబై నివసించుట కెంతయుం దగియుండును. మేమచ్చోటికిఁ బోవుటకు నిశ్చయించితిమి. ఇది దుష్టరాక్షస సంచార యుక్తంబగుటచే భార్యతోడను తమ్మునితోడనుం గూడి నీవిం దొంటరిగా వసించుట మంచిదికాదు. నామాటవిని నీవును మేమరిగెడిచోటునకు మా వెంటరమ్ము" అని పలికెను. మునుల భీతినెఱింగి రాఘవేశ్వరుండు ధైర్యమునుబూన్చి వారినిపోనీక నిలువరింప వలయునని ప్రయత్నించినను, వారు రాముని మాటలు వినక తగు సమాధానముఁజెప్పి యతనిఁ నోడఁబఱచి యచ్చోటునుండి వెడలిపోయిరి. అంతట రామచంద్రుడును నచట నివసించుట కిష్టములేనివాఁడై తనలో "మునివరులందరును నీ వనమునువీడి దవ్వు దవ్వులంబోయిరి. వేడుకగా మరగి తిరుగుచున్న జింకపిల్లలు మొదలైనవియుం గనుపట్టుటలేదు. భరతుండు వచ్చి తండ్రి లోకాంతర గతుఁడగుట చెప్పినదిమొదలు నా చిత్తంబ పరిమిత వ్యాకులాయత్తంబై కళవళించుచున్నది. ఇట్లు కలతనొందిన నేను మాటలాడుటకు సయిత మెవ్వరును లేక యుండఁగా యీ శూన్య వనంబులలో నుండుట సమ్మతముగా నుండకున్నది సీతా లక్ష్మణులకును నాకు వలెనే యిచ్చోటనుండుట యిష్టము లేనట్లున్నది భరతుఁడు సైన్య

ముతో వచ్చినపు డేనుంగులు గుఱ్ఱములు వేసిన లద్దిచేతను, తొక్కుడు చెత్త కుప్పలచేతను నిది యసహ్యమైన స్థలముగా నేర్పడినది.

—(*) రామచంద్రుం డత్రిమహాముని యాశ్రమంబునకుం జేరుట. (*)—

ఇపుడు నేనును నిచ్చోటువిడిచి మఱి యెటుకైనం బోవుటయ కర్తవ్యముగాఁ దోఁచుచున్నది'' యని విచారించి చిత్రకూట శైలమును విడిచి సీతాలక్ష్మణ సహితుండై యత్రి మహాముని యాశ్రమంబున కరిగి యమ్మునీశ్వరునకు నమస్కరించెను. తపోధనుండు రామచంద్రుని వృత్తాంతంబుం దెలిసికొని యతనికి నానావిధంబుల నుపచారము లొనరించి యాతిథ్యంబొసంగి మిక్కిలి యాదరించి, రఘుకుల శేఖరునింగాంచి "ఓయిరామా! అందె; వృద్ధురాలైన మదీయపత్ని యనసూయ యున్నది. భవదీయ సతియగు జనకనందనను యాపుణ్యవర్తన నారాధింపఁ బనుపుము. అనసూయ యసామాన్య మహిమాన్విత సుమీ! అనసూయం బనెడి వ్రతంబు నాచరించుటచే యదియ నామధేయంబుగా నేర్పడినది. మఱియు నీ సాధ్వి యొనర్చిన యద్భుత కార్యము లనంతములు. అవి త్రిజగత్ప్రసిద్ధములై యుండును. ఇటువంటి యుత్తమరాలిని సేవించి యాశీర్వాదమునొందుట భూపుత్రికెంతయు నావశ్యకమైయుండు"నని చెప్పెను. రాఘవుండు ముని మాటలు విని జానకీదేవిని చూచి "సీతా! వింటివిగదా మునీంద్రుని మాటలు, మహాత్మురాలైన యనసూయాదేవిని సేవించి యామె కరుణవడయు"మని చెప్పెను. సీతాదేవి యధికసంతోషమును భక్తియు నతిశయింపఁగా యామెయొద్ద కరిగి నమస్కరించి, "అమ్మా! నేను జనకరాజ నందన"నని పలికి తన వృత్తాంతంబు సర్వమునుం దెలిపి "తల్లీ! నీకు క్షేమంబకదా''! యని యడిగిన యామె సంతసంబున సీతతో "జనక రాజపుత్రీ మాకు కుశలంబకాని నీతండ్రి మొదలగు వారలకును మామవంక వారలకును క్షేమంబేగదా! నీవు పరమ పతివ్రతా శిరోరత్నంబవు. సూర్యుని ఛాయయుంబోలె పతినిఁవీడక యనుసరించి వర్తించుచుందువు. నీయట్టి యుత్తమాంగన లోకమున మఱియొకర్తు కలుగదు. ఏకాంత నిజనాథుఁడే దైవంబని యెంచి సదా పతిని సేవించుచునతనితో డిదియ లోకంబని దృఢ నిశ్చయముగలదై సత్కార్యము లొనరించుచుండునో యట్టి పావనాత్మిక యిరువంశములుం బునితముచేసి యుత్తమగతిం బడయును.

—(*) అనసూయ సీతకు పతివ్రతల ధర్మంబుచెప్పుట. (*)—

అమ్మా! నీకు తత్ప్రకారము సెప్పెదను వినుము. పతివ్రతయైన యువతి తన వల్లభుండు తనయందు ప్రీతిగలవాఁడై యున్నను, కాకపోయినను, సతనియందు దృఢభక్తి కలిగి యనుకూలవతియై యుండవలయును, చెడు నడవడి కలవాఁడైయున్నను, నిర్ధనుండై యున్నను, సతనియందు దోషమును గణనఁ జేయకూడదు. బంధుండును, గతియు, దైవమును నతఁడేయని భావింపవలయును. ఏకాంతలు ప్రపంచమున తమ పతులకు వ్యతిరేకముగా ప్రవర్తించుచు, వారిదోషములం దలంచి రోతఁజెంది యప్రియ మానసలై యుండుదురో యట్టువంటి యువిదలు శాశ్వతముగా నధోగతిని బొంది నరకబాధల ననుభవింపు చుందురు. అమ్మా! మానవతులు నీవలె పతినే నమ్మి కొలుచును యిహాపరముల యందు సమస్త సౌఖ్యములు ననుభవింపుదురు, సుమీ!'' యని పలుకుటయు సీత యామెకుమ్రొక్కి "జననీ! మాతల్లి వలన మున్ను పతివ్రతా ధర్మములు వినియుంటి పదంపడి మాయత్త కౌసల్యాదేవియుం దద్విధుల నెఱింగించె. ఇపుడు నీవునుం జెప్పితివి. ఇట్టి పద్ధతులను వీడక వరదైవముగా భావించి కలలోనైనను నేమరక యుత్తమ గుణాకరుండైన రాఘవేశ్వరుని సేవించుచుండుదును తదన్యం బెద్దియు నా మనంబున కింపుగా''దని పలుకుటయు. యామె సుగుణ సంపద కనసూయ మిక్కిలి సంతుష్టినొంది "అరుంధతి సావిత్రి రోహిణీ ప్రభృతులైన పుణ్యాంగనలు తమ పాతివ్రత్య మహిమచేతనే జగత్ప్రసిద్ధినొంది సకలజన మాననీయలైరి. నీవును వారితోడ సరిచేయఁదగిన దానవేయని తలంచుచున్నాను సాధ్వీ! నీ ప్రవర్తనమునకు నేను మిక్కిలి సంతోషమును జెందితి. నీకెయ్యది ప్రియంబగునో యావరము నొసంగెద నడుగు''మని యెను. అంతట సీత మహాభక్తితో లేచి హస్తములు ముకుళించి నిలిచి యుండగా అనసూయ యిట్లనియె.

"ఓతన్వీ! ఇదిగో! యొక కుంకుమము నిచ్చెదఁ గొనుము. ఇది ధరించినచో సకలకల్మషములుం దొలంగిపోవు''నని చెప్పి వెలలేనిసొమ్ములును వస్త్రములును పావనంబైన యా కుంకుమమును మహాప్రీతితో జనకనందన కొసంగెను. వాని నామెకైకొనినంతట కూర్చుండ నియోగించి "కోమలీ! రాజశేఖరుండైన రామచంద్రుండు నిన్ను పెండ్లాడిన వృత్తాంతమును చూచాయగా వినియున్నాను గాని వివరముగా నెఱుం

గను, తద్వృత్తాంతమంతయుం జెప్పవలసినదిగా కోరుచున్నా"నని యడుగుటయు సీత సంతసించి రామచంద్రుండు విశ్వామిత్రునివెంట మిథిలానగరమునకు వచ్చి తన తండ్రి మెచ్చుటుల హరుని విల్లును విఱుచుట యాదిగా సకల వృత్తాంతములును దెలియపలికెను. సీత చెప్పినదంతయును విని సంతోషించి "అమ్మా! నీవు మిక్కిలి పుణ్యవతివి నీకును నీ పతికిని సకల శుభములును గలుగునుగాక సూర్యాస్తమాన సమయం బగుచున్నది. నే నొసంగిన కుంకుమమును ధరించి నీవింక నీపతియొద్ద కరుగు"మని యానతిచ్చుటయు జానకి యామెను నమస్కరించి కుంకుమము ధరించి దానివలన నవశోభ యొసంగగా రామచంద్రునియొద్దకు వచ్చి యనసూయదేవి యొద్ద జరిగిన వృత్తాంతంబంతయుం జెప్పుటయు రామభద్రుండు సతోషచిత్తుండయ్యె. నాఁటిరేయి వారచ్చోట గడపి సూర్యోదయంబగుటయు నృపశిఖామణి ప్రయాణంబై యత్రిమహర్షి చరణములకు మ్రొక్కి యనుజ్ఞ వేఁడుటయు తపోధనుఁడు రామచంద్రుని దీవించి "హే రామా! ఈవనమున దుష్టరాక్షసులు విశేషముగా సంచరించుచుందురు. కావున జాగరూకుండవై చనవలయును. ఇచ్చటి మునులు ఫల కుసుమములకై పోయెడి మార్గమున నీయడవిదాఁటి యన్యవనమునకుఁ బొమ్ము జాగ్రతసుమీ!" యని యానతిచ్చి యనిపెను.

—(*) రామచంద్రుండు దండకారణ్యము ప్రవేశించుట. (*)—

రఘుకుల నాయకుండు పూర్వోక్త ప్రకారమున నత్రిముని యాశ్రమము విడిచి సీతాలక్ష్మణ సహితుండై యచ్చటచ్చటం గల విశేషములను సీతకుంజూపి చెప్పుచు చనిచని ముందట సిద్ధులు మునీంద్రులును వసించు తపోవనములు, నిర్మలాంబు పూరితములైన పెక్కు తటాకములు గలిగినదియు, దట్టముగా వృక్షలతా గుల్మములు గలిగినదియు పుష్పఫలములు సమృద్ధముగా గలిగియుండునదియునైన దండకారణ్యముంగాంచి యందు ప్రవేశించెను. అచ్చోట వసించు మానులు వారి రాక నెఱింగి చనుదెంచి తమకు నమస్కరించిన రాఘవేశ్వరు నాశీర్వదించి "మీర లీదిన మిచ్చోట నిలిచి మావలన నాతిథ్యము గైకొనవలసిన"దని బహువిధములఁ బ్రార్థించిరి. వారి వేడికోలు నంగీకరించి రఘువల్లభుండు వారివెంట జనుటయు మునీశ్వరులు మహా సంతోషముతో యతిథి సత్కారములం బరితృప్తులంజేసి రామచంద్రునింగాంచి మిక్కిలి వినయముతో నిట్లనిరి.

దశరథనందనా! ప్రజలకు రాజుగా నుండువాఁడు పూజనీయుండును మాన్యుఁడును, శిక్షించువాఁడును, గురుండును, శరణ్యుండును, శాసించువాఁడును, ధర్మవేత్తయునగునని శాస్త్రజ్ఞులు పలుకుదురు. రాజు దేవేంద్రునియందు నాలవభాగము మహిమను పొంది భూపతియై ప్రజాపాలనం బొనరించును తన్మూలమున సకల భోగములు ననుభవించును. నృపతి తన పురమున నుండినను లేక యరణ్యమున నుండినను నొక్కటియే! ఎచటనుండినను నతని యధికారము తన యేలుబడికి లోఁబడిన ప్రజలపైఁ జెల్లుచుండనుగాని లోటుగలుగదు. తన రాజ్యమందలి జనులను రక్షించుటకును శిక్షించుటకు, రాజునకు సర్వాధికారములును గలిగియుండును కావున, నీవిపు డయోధ్యయందు లేక యుండినను నీయధికారమున కేకొఱంతయును లేదు. మే మందరము నీ పాలనకు లోఁబడి యుండువారము. మమ్ము గృపాదృష్టులంగని సంరక్షించు భారము నీపై నుండుట నిశ్చయము. మాకు కష్టములు గలుగకుండులాగునఁ జేసి పాలింపు" మని యభినందించి పలుకుటయు, వారి నాదరించి రాఘవేశ్వరుం డా రాత్రి యచట నిలిచి మఱునాఁడు వారివలన మార్గమును దెలిసికొని ప్రయాణంబై బహుతర మృగపక్షి సంకులంబై దుర్గమంబుగా నుండు మహా దరణ్యముఁ జొచ్చిపోవుచు, నటనటం గల మునుల యాశ్రమములుగాంచి యచ్చోటికిపోయి, మ్రొక్కి వారిచే యతిథి సత్కారములు బొంది, యందందు నొక్కొక్క రాత్రి నిలిచి కడపుచు, చనుచుండి యిసుకచల్లిన రాలని మఱియు దట్టమును భయంకరమునైన యడవిం జొచ్చి మార్గము నరసికొని సీతయు లక్ష్మణుండు దన యడుగుల నాశ్రయించి వచ్చుచుండగా నరుగుచుండెను.

నిర్భయుండై రాఘవుం డివ్విధమునఁ బోవుచున్న సమయమున రణ్య మధ్యమం దొకచోట ముందట పర్వతమువంటి గొప్ప దేహమును

—(*) శ్రీరాముఁడు విరాధుని జంపుట. (*)—

భయంకరములైన గొప్పకన్నులను, నిడుదలైన కోఱపండ్లును, విశాలమైన నోరును గలవాఁడును, శూలాయుధము చేతబట్టుకొని యున్నవాఁడును, నగు విరాధుండనెడి ఘోరరాక్షసుం డొకం డెదురై వచ్చుటంగాంచెను. సీతా రామ లక్ష్మణులంజూచి యా నిశాటుండు కఠోర కంఠస్వరముతో గర్జించెను.

ఆ రాక్షసుండు తత్పూర్వము తాను చంపిన మృగములను గుదులుగట్టి తన శూలాయుధమునకుఁ దగిలించి భుజముపైఁ బెట్టుకొని, ఇరువంకల దవుడలనుండి వెలికి దోచు కోఱలు మెరయుచుండగా, నుగ్రదృష్టులు గలిగి గుండ్రముగానుండు ప్రచండ సూర్యబింబ సదృశములైన కన్నులను గిరగిరం ద్రిప్పుచు, గర్వాతిరేకమున కహకహార్భటులొనరించుచు, బిరబిర డాయంజనుదెంచి తటాలున జానకిదేవినిఁ బట్టుకొని వేగిరపాటుతో పద ఘట్టనముల భూమి యదురుచుండగా రామచంద్రుని ముందువచ్చి బిగ్గఱగా నార్చి మహా క్రోధ తామ్రాక్షుండై యదలించి భయంకరముగా నిట్లనియె.

"ఓరీ! మనుజాధమా! మీ రెవ్వరు? అస్త్ర శస్త్రములు దాల్చియున్న మిమ్ముఁజూచి నేను భయమొందెడి వాఁడను కాను. నాపేరును మీరు వినినదిలేదు కాఁబోలు. ఇపుడు తెలిసికొనుఁడు. నేను విరాధుండనువాఁడను. నన్ను మార్కొనఁ గలవాఁడు లోకమున నొక్కండును లేఁడు నిరంకుశముగా నేనీ యరణ్యమున సంచరింపుచు, నేను సంతతము నిచ్చోటి మునుల హింసించి భుజించి సంతుష్టి నొందుచుండువాఁడను, మీరును మునులవలె గనుపట్టుచున్నారు. ఈక్షణంబ మిమ్ముఁ జంపి మీ నెత్తురు గ్రోలెదను విడువను. మీ చందము చూచిన నిజమైన మునులని తోఁచకున్నది మీకీ స్త్రీరత్నం బేమిటికి? కానిండు నాచేత చిక్కినపిమ్మట తప్పించుకొనుటకు మీకు సాధ్యముగాదు. ఇక మీ చావు నిశ్చయం"బని పలికి మఱియుం గర్జించెను.

ఆ దుష్ట రాక్షసునిచే పట్టువడి గడగడ వడంకుచు భయాకుల మానసయై వాపోవుచున్న జనకనందనను గనుఁగొని వాని యార్భాటంబునకు కలంగి రామచంద్రుండు దీనాననుండై సుమిత్రా నందనునిఁజూచి "తమ్ముఁడా దుష్కాలముగదా యిది; చూడుము! ఆహా! శత్రుభయంకరంబైన బాణమును, విల్లును నా హస్తమునఁ గలిగి, నామేనఁ బ్రాణము లుండగానే నాకన్నులయెదుటనే జనకరాజ నందన కిటువంటి దుర్దశసంఘటిల్లెగదా! అయ్యో! పరమసాధ్వియు, సుగుణ రాశియు, పుణ్యశీలయు, ధర్మాత్ముఁడైన జనకరాజునకు పుత్రియు, జగత్ప్రసిద్ధుఁడైన దశరథా వనీశ్వరుని కోడలునునైన సీత కిటువంటి కష్టము వాటిల్ల వలసినదేనా? కటకటా! దనుజునిచేఁ బట్టువడి, యబలయుం గోమలియునైన జానకి యెటుల భయభ్రాంతయై దుఃఖించుచున్నదో గంటివా? నేనీకాంత

శోకమును జూచుచుండఁజాలను. ఇంతకంటె మించిన వ్యాకులమేది యన్యాయ మన్యాయము. ఇపుడే నేను ప్రాణములు విడిచెద. రాజ్య త్యాగము, తండ్రిచచ్చుట, బంధువియోగము, దుష్టాసుర వాసంబై యరణ్య ప్రవేశము, నొక్కట కూడి యలంచినది చాలక దైవము వైదే హిని సయిత నెడబాయునట్లు చేసెను. ఈ మహాదుఃఖమును నే నెట్లు భరింపఁగలను? ఛీ! ఈజన్మమేమిటికి?" యనిపలికి కన్నులనీరుగాఱ వ చుచున్న యన్న వాక్యములు విని సౌమిత్రి మహా క్రోధారుణిత లోచ నుండై, వేఁడి నిట్టూర్పు లడరగా నుగ్రరూపముఁదాల్చి "అన్నా! ఏల శోకించెదవు" నాత్రాణం గనుము. ఇప్పుడనే నీ దుష్టాసురునిం ద్రుం చెద. ఆ నాఁడు భరతునిపై నామనంబునఁ బొడమిన కోపము నీవడఁ చుటంజేసి నాలోనఁ గుములుచున్నది. ఆయాగ్రహఫలము నిపుడీ క్రూరుం డనుభవించునుగాక. నిరుపమాన శరలాఘవ పరాక్రమ శోభి తుఁడవైన నీకీ యత్యంత తాల్పుడైన రాక్షసుం డెంతటివాఁడని యెంచి వీనిఁగని సామాన్యుఁడైన మనుజుని చందంబున వగచెదవు? నా పరా క్రమంబుఁ జూడు'మని పలికి వింట శరంబు సంధించి యత్యుగ్రముగాఁ బ్రయోగించిన యాభయంకరాశుగం బాక్షణంబ సప్త సాయకములై తటాలున వాని పక్షముదూఱి గుండెలు జీల్చుకొనుచు వీఁపున వెడలెను.

అంతట విరాధుం డమితాగ్రహము నొంది భయంకరముగా నార్చుచు, కన్నులఁ బెనుమంట లెగయుచుండగా పండ్లుకటకటం గీటుచు తనచేఁగలయుగ్రశూలమును గిరగిరఁ ద్రిప్పి "ఓరీ నీప్రాణము లిఁకదీయక విడువనని విసరివైచెను ఆ శూలాయుధం బతికరయమున సౌమిత్రి కభిముఖముగా వచ్చుటంగాంచి రాఘవేశ్వరుండు త్వరితముగా వింట బాణమును సంధించి యాశూలమును మూఁడు తునకలగునట్లు ఖండించె. అంతమానక, కఠోరంబైన మఱియొకసాయకమును వానిపక్షము నాటు నటుల నడరించెను. అందువలన విరాధుఁడు మిక్కిలి నొచ్చి నోరుఁ దెఱచి యార్చుచు పై కేతెంచుటయు రఘువీరుండు నిజ భుజాబలం బేర్ప డ దివ్యాస్త్రము లైదు వెడియు వాని యురము వగులవేసెను. ఆశ రములవలన జలించియు జంకక విరాధుం డుద్ధతుండై చంకఁబెట్టుకొని యున్న వైదేహిని భూమి పైడించి యార్భటింపుచు దీర్ఘములును బలీ యములునగు బాహువులంజూచి రాజనందనులఁబొదివిపట్టుట కడరుటయు రామలక్ష్మణులు తప్పించుకొనుటకు వలనుగాక వలలోఁ దగుల్కొనిన సిం

హాముల క్రియ వాని బాహువుల నడుమ జిక్కువడి నిలిచిరి. అపుడా దుష్టుండు గర్జిల్లుచు యిరుచంకలనిరువురను నిరికికొని పోవఁదొడంగెను. రామచంద్రుం డేమిచేయుటకుం దోఁచక తనలో "కానిమ్ము వీఁడు మమ్మెచోటికిఁ గొనిపోవునో యది తెలియును గాక" యని తలంచి మిన్నకుండుటయు, దైత్యుచేఁ జిక్కి కొని పోబడుచున్న రామ లక్ష్మణులం గాంచి సీత యత్యంత శోకముఁ జెంది మూర్ఛిల్లి నేలవ్రాలెను. ఆమె దుస్థితిం జూచినంతట రఘునాయకుండు మహా కోపమునుజెంది మిక్కిలి వాడిమిగల ఖడ్గమున వానిఁభుజము దెగవేయుటయు రెండవ బాహువును సౌమిత్రి ఖండించె. అంత వాఁడు తద్బాధకోర్వజాలక మహోన్నతంబైన సాలవృక్షము కరణి నేలఁగూలెను. కూలియుచు వాఁడు భయంకరముగా నఱచుచు నట వృక్ష మృగ సముదయములు చదియ బొరలి పొరలి వచ్చుచున్న ఖడ్గ ప్రహారముల దశరథాత్మజులు వానిని ఖండించి యింక వీఁడు పొలియుఁగాక యని విడుచుటయు, ప్రాణావసాన సమయమున విరాధుండు రఘునందనుఁగాంచి "వీరాగ్రేసరులారా! మీరలెవ్వరు? ఎచ్చటికేగెదరు? ఈ యరణ్యమున కేలవచ్చితిరి?" యని ప్రశ్నించెను. రామచంద్రుండు కనికరించి తమ వృత్తాంతము సర్వమును జెప్పి "ఓయీ! నీవెవ్వండవు? భవచ్చరిత్రంబుం జెప్పుమని యడిగినవాఁ డిట్లనియె.

—(*) విరాధుండు తన వృత్తాంతమును రామునితో చెప్పుట. (*)—

"దశరథనందనా! నేను కుబేరుని సేవించుచుండిన వాఁడను. గంధర్వుఁడను, తుంబురుండనెడి పేరుగలవాఁడను, రంభయం దత్యంతమైన యనురాగముఁ గలవాఁడనై యాలతాంగిఁగూడి క్రీడించుచు తనుఁ గొలుచుట మఱచుటయు ధనదుం డలిగి శపించెను తత్కారణమున నిట్టి ఘోరాకృతినిఁ గలవాఁడనైతిని నేను ప్రార్థింపఁగా కరుణించి "ఎవని శరాహతిచేత నీవు నేలఁగూలుదువో, యానాఁడు శాపంబు దీఱు"నని యక్షేశుండ నుగ్రహించెను. అట్టిసమయం బిపుడు సిద్ధించె. నీవలన నా శాపము తొలంగినది. ఇంక నేను నా తొంటి గంధర్వత్వమును పొందెదను. రాఘవా! ఇచ్చోటి కర్ధ యోజనము దూరములో శరభంగుడను మహాముని యాశ్రమము గలదు. ఆ మహాత్ముఁ డచట తపో విభూతిఁగలవాఁడు. అతఁడు మిమ్ము సర్వవిధముల నాదరించును. అచ్చోట మీకు సకల సౌఖ్యములు నొనఁగూడఁగలవు. కావున యచ్చో

టికరుగుట క్షేమకరము. మీరు ప్రయాణంబగుటకు పూర్వము నాకొక యుపకృతిఁ గావించి పోవలయునని కోరుచున్నాను. ఏమనఁగా, నాదేహ మొకచోట భద్రముగా పూడ్చి మీ రరుగవలయును. అటుల చేసితిరేని నాకు గంధర్వత్వము సిద్ధించును. కరుణించి యటుల గావింపుఁ” డని చెప్పి ప్రాణంబులు విడిచెను.

అంతట కరుణామయుండైన రామచంద్రుండు విరాధుని చరిత్రంబు విని యాశ్చర్యంబుఁ జెంది వాని దేహమును బూడ్చుటకు లక్ష్మణుని నియోగించిన లోతైన పల్లమునుద్రవ్వి యందా కళేబరమును బడవైచి తోడేళ్ళు, జంబుకంబులు మొదలగు జంతువులు పెకలించుటకు సాధ్యము గాకుండులాగున రామానుజుండు దిట్టముగాఁ బూడ్చి యన్నయొద్ద కరుదెంచె. పిమ్మట వార లిరువురును సీతయొద్ద కరుదెంచి మూర్ఛిల్లి యున్న యామెనుతేర్చి మైనంత రామభద్రుండు “అనుజా! ఈ యరణ్యమున దుష్ట రాక్షస సంచార యుక్తంబై యుండునదిగా కనుపట్టుచున్నది. మన మీ వనంబుననుండుట క్షేమముకాదు కాఁబట్టి తుంబురుండు చెప్పిన యా శరభంగముని యాశ్రమంబునకుఁబోయి నేఁ డచట గడపి పిదప కర్తవ్యమునుగూర్చి యోజింతముగాక” యని పలికి జనకపుత్రిని సంతోషమును బొందించి కదలి యమ్మహాముని చంద్రునిం జూచు కోరిక యతిశయింపగా చని తదాశ్రమంబుఁ జేరి యచట, రంభాద్యప్సరలు వింజామరలు వీచుచుండగా నాహ్లాద మొందుచుండువాఁడును వేయి తెల్లని గుఱ్ఱములుగట్టిన రథమునెక్కి యిరువదియైదు వత్సరముల ప్రాయ మొప్పు దేవతలు కొలుచుచుండ, ధవళాతపత్ర చామరము లుల్లసిల్లగా వేయిగన్నులు మెఱయ శరభంగుని స్వర్గమునకుఁ దోడ్కొని

—(*) రామలక్ష్మణులు శరభంగాశ్రమంబున కరుగుట. (*)—

పోవుటకై దేవేంద్రుం డచ్చోటికి వచ్చియుం రామచంద్రుని యాగమనంబును నెన్నికయు నెఱింగిన యమ్మునియింద్రునివెంట నరుగుట కొల్లక నిలిచియుండగా, యట్టి మహాత్ముని గానిపోవక రామచంద్రుండు సమీపించుటయు, నింద్రుండు తన లోకంబున కరిగె.

రామలక్ష్మణులు శరభంగ మహామునికిం బ్రణమిల్లుటయు తపోధనుండు సంతసంబున వారి కతిథి సత్కారంబులు గావించి సుఖాసీనులం జేసి “రామచంద్రా! సురేశ్వరుండు నన్ను పరమ తపోలబ్ధంబైన యుత్తమ లోకంబునకుఁ దోడ్కొని పోవుటకై వచ్చిన నేను భవ దాగమనా

తెఱింగి యాతిథ్యం బొసంగి నిన్ను సత్కరించు కోరికచే నరుగక నిలిచితి నఖిల లోకపూజ్యుండవైన నిన్ను పూజించుటకంటె కర్తవ్యం బెయ్యదిగలదు? రఘుకులవల్లభా! నీవేది కోరినను మదీయ తపోమహిమచేఁ గల్పించి నీకు సమర్పించెద. వాంఛితంబుఁ దెలుపు"మని కడుప్రియంబు గదురఁబలికెను. రామచంద్రుం డామాటలకలరి మునిశేఖరా! మీదయ మాయందు గలుగుటయె చాలును. దానికంటె మించిన దేమిగలదు? ఎపుడు మాయందు దయ మీకు గలిగెనో సకల శుభములును మాకు గలిగినట్లే యగును. ఏదియుం గొఱతయుండదు మహాత్మా! ఈ యరణ్యమున మేము నివసించుట కర్హమైన స్థలమెయ్యదియో యెఱింగించినయెడల మేమచ్చోట నిలిచి యటనుండు మునుల సేవించుచుండెదము అనువైన చోటుం జెప్పుఁ"డని యడిగిన ముని యిట్లనియె.

"ఈయరణ్యంబున మహాత్ముండు సుతీక్ష్ణుండను మునియున్నవాఁడు. మీ రతనియొద్ద కరిగితిరేని మీకు తగిన నివాసస్థలం బతండు చెప్పును. ఇదిగో! ఈ సమీపముననుండెడి నదినిదాఁటి కొంతదూరము పోయినయెడల మీకతని యాశ్రమము గోచరించును అటకుజనుం''డని పలికి వీడ్కొలిపి శరభంగుఁ డగ్ని ముఖంబున నింద్ర సదనమునఁ కరిగె, రఘువరుండు మునివరుండు చెప్పినచొప్పున వాహినినిదాఁటి, నానావిధ పుష్ప సౌరభంబులతో కూడినదియు, సమస్త మధుర ఫల భరితానోకహా యుక్తమును మనోజ్ఞమునునై విరాజిల్లుచున్న యత్తపోవనముఁ బొడగని దరియంబోవుటయు, రామచంద్రుని రాక నెఱింగి యచ్చోట నివసించు తపస్వులు పరమ హర్షముజెంది యెదురుగా సనుదెంచి సీతాలక్ష్మణ సహితుండై తమకు మ్రొక్కిన కౌసల్యానందనుని దీవించి కొనియాడి "ఓ రఘుకులేశ్వరా! ఈ యరణ్యమున క్రూరులైన రాక్షసులు లెపుడును మమ్ము నానావిధముల బాధించుచుండగా యుపేక్షించి యుండుట నీకు ధర్మమగునా? మమ్ము సంరక్షింపవలదా? అయ్యో! వారివలన మేము పడుచున్న కష్టములు లెక్కించుటకు శక్యముగాదు. దీనులమైన మాయడరుఁ దీర్పు"మని వినయముతో ప్రార్థింప వారి దైన్యమునుచూచి చెప్పిన మాటలు విని శ్రీరామచంద్రుండా సాధుజనులకుఁ గలుగుచున్న కష్టములదలంచి మిక్కిలి దుఃఖించి వారినిఁజూచి "మునీంద్రులారా! చింతింపక యూఱడిల్లి యుండుఁడు దైత్యు లెచటనుండురో యా ప్రదేశముల కరిగి వారిని పీచమడంచి మీ బాధలుదీర్చి సంతో

చిత్తులం గావించెద. పరమ పుణ్యులరైన మీకు మేలుచేయుటకంటె మించిన యావశ్యకంబైన కార్యము నాకు మఱియొకటి గలుగ"దని పలికిన రామచంద్రుని మాటల కమ్మునులు సమ్మదమునొంది ధైర్యమును జెంది రప్పుడు భూపుత్రి వారి ప్రసంగము ముగిసిన పిమ్మట పతిని సమీపించి రహస్య భాషణముల విషయమున నిట్లనియె.

"ప్రాణేశ్వరా! నీవీ మునుల కొనరించిన వాగ్దానమువలన నా మనమున భయము గదురుచున్నది. అకారణముగా దుష్ట రాక్షసులతోడ వైరముం గడంగుట యుక్తమగునా? విరోధమువలన నెట్టివారికిని దుఃఖము సంభవించును. వలవని వైరమును దెచ్చుకొని పోరుటవలన లాభము కాదుకదా! అదియునుగాక హింసాకృత్యము ధర్మ విరుద్ధమగుట నెఱింగియు దానికి బూన నేమిటికిని? ఏమిన్యాయము? హింసవలన పాపము సిద్ధించునని పెద్దలు పలుకుదురు. దీనికి దృష్టాంతముగా నేను

—(*) సీతా రాక్షస వైరంబువలదని రామునితో చెప్పుట. (*)—

వినియున్న యితిహాసం బొండుగలదు. దాని నాకర్ణింపుము. మున్నొక మునివరుండు ఘోరతపముఁ గావించుచుండగాఁ దేవేంద్రుఁడు విఘ్నముఁ జేయఁదలంచి రాజా కృతిందాల్చి యమ్మునీంద్రునియొద్ద కరుదెంచి "స్వామీ! యొక కార్యార్థమై నేనొకచోటికరిగివచ్చెద. అంతవరకును ఇదె; యీ నాఖండమును మీ యొద్దనుండనిండు మరలివచ్చి గైకొనెద" నని ప్రార్థించి యావాలును తాపసోత్తమునిచే నొసంగెను. పరోపకార చింతగల యమ్ముని యొల్ల ననఁజాలక పట్టణముం గైకొనుటయు కపట ధరావరుం డచ్చోటువిడిచి చనియె. అతఁడు పోయినంతట మునివరుం డూరకుండఁజాలక యాకత్తివాడిమి నరయుటకై తీఁగెలును, చెట్లరెమ్మలునుం ద్రెంచుట కారంభించెను. క్రమమున నట్లే చేయుచుండ నతని కాదుర్వ్యసన మధికమైన నానాఁటికి తపశ్శాంత సయితమువీడి జీవహింస కారంభించి దుర్దశను బొందెను ఇట్లని యొక వృద్ధ విప్రుండు చెప్పగా వినియున్నాను. వైరమువలన కోపమును కోపముచే హింసయు దాని కతమున దుఃఖమును సంభవించుట సిద్ధము. ఇందు నీ వెఱుంగని విషయం బొకటియునులేదు. నీవు ధర్మజ్ఞుండవు, దయాపరుండవు. ఈవనమున తపము గావించుకొనుచు కాలము గడపనెంచి వచ్చినవాఁడవు. వృథా పరులతోడ విరోధమేల? దానవులు నీ కేమి కీడు గావించిరి?

వారిజోలిఁ బోవుట యుక్తమని నాబుద్ధికిఁ దోచుచున్నది నీకు చెప్పఁగల ద్దానను గాను. అయినను తోఁచినట్లు పలికితి"ననిన రామచంద్రుం డామె చెప్పిన హితమునకును, తనయందుగల భక్తికిని, ప్రియమునకును సంత సించి యాదరమున "తన్వీ! నీవాక్యములు న్యాయములైనవియ కాని ధర్మపద్ధతిని బాగుగా నెఱింగిన దానవై యుండియు నివ్విధమున బలు కుటం దలంచిన నామనముల నాశ్చర్యము బొడమచున్నది. దుష్టులను శిక్షించుటయు శిష్టులను రక్షించుటయు రాజులకు పరమ ధర్మముగాదా! అటులనైనను ఈపరమ సాధువులైన మునులను నానా బాధలు నొందిం చుచున్న క్రూరులైన నిశాటులంగుండి నే నీ మునులను రక్షింపకుండిన యెడల నా రాజత్వ మేమిటికి? ఈ కార్యమును చేయుట ధర్మము కాదని యెవరు చెప్పఁగలరు? ఇందువలన మన కేమియుం గీడుకాని పాపముగాని పొసంగదు. దీనినిగురించి నీవు చింతింపవల"దని యొడంబడం బలికి యా ముని బృందముతోఁగూడి సుతీక్ష్ణముని పాలికరిగి మ్రొక్కిన యా తపోధ నుండు వికసిత ముఖుండై రాఘువేశ్వరుని దీవించి ప్రీతిమెయిం గౌఁగిటఁ జేర్చి యతిథి పూజల సంతుష్టిని గావించెను.

రఘువరుండు మునివలన నాదరింపఁబడి నాఁటిరాత్రి యతని తపో వనమున నుండెను. మఱునాఁడు సూర్యోదయం బైనంతట మునులంద రు రామచంద్రునియొద్ద కరుదెంచి స్తోత్రము గావించి తమతమ యాశ్ర మములలో నొక్కొక్కనాఁడు నిలువఁ బ్రార్థించి తోడ్కొని పోయిరి. వారి యిష్టానువర్తియై సతీ సోదర సహితుండై కౌసల్యా నందనుండును నట్లన గావించి వారి మనంబులు సంతుష్టి నొందించెను. కొన్నిదినము లీప్రకారముగా ముని జనాశ్రమంబులనుండి వారిని సేవించుచు, పెక్కం డ్రు దుర్మార్గులైన రాక్షసుల వధించి తపస్సులకు సంతోషముఁ గలిగించు చుండెను.

—(*) మండకర్ణిక మహాముని చరిత్రము. (*)—

రామచంద్రుం డిట్లుఱంగున మునులంగూడి సంచరించుచుండి యొకచోట యా కాననమున నొకనాఁ డొక యోజనము వెడల్పును పొడవును గలిగిన కొలంకునుగాంచి చేరువకేగి, యందుండి మనోజ్ఞమం జుల సింజితములును వీణావేణు నిస్వనములును వినవచ్చుచుండుటయు

విస్మితుండై తత్ప్రభావము నెఱుంగంజాలక యటకు చేరువంగలుగు ధర్మ
భృత్యుండను ముని యాశ్రమమున కరిగి యా మహాత్మునకు నమస్క
రించి యతనివలన సత్కృతుండై "మునీంద్రా! ఈ వనమున వచ్చునప్పు
డొక యద్భుతము గంటిని. సమీప స్థలంబైన యావిశాల జలాశయము
నుండి తూర్య గీత నిస్వనములు వినంబడుచుండ వింటిని. అందు మను
ష్యులెవ్వరును గానంబడరైరి. అటుల మంజుల స్వనము లందుండి వినవ
చ్చుచుండుట కేమికారణము? ఏదియో గొప్ప విశేషము కలిగియుండ
వలయునని తోచుచున్నది కరుణించి యావృత్తాంతమును నెఱింగింపుం''
డని ప్రార్థించెను ధర్మభృత్యుండు రామునింజూచి. "దశరథరాజనందనా!
అందెల్లపుడును నటువంటి ధ్వనులు వినవచ్చుచుండును సుమా! అది
యాశ్చర్యకరమును విశేషమునైన విషయమే! దానిం జెప్పెదను వినుము.
మాండకర్ణియను మునీశ్వర శేఖరుండు తన తపో మహిమచే జలాంత
ర్భాగ్యమున దివ్య భవనమును గల్పించి యందు సదా వినోదమున
నచ్చరలంగూడి క్రీడావిహారములును సలుపుచుండు. ఆ కాంతామణుల
కంఠనాదములును, గీతములును వారివలన ప్రయోగింపంబడు వాద్యరవ
ములును నెల్లపుడును మనోహర భంగి వినవచ్చుచుండును. అమ్మునీం
ద్రున కటువంటిప్రభావ మెటుల గలిగినదియు నెఱింగించెద నాకర్ణింపు"
మని యిట్లని చెప్పందొడంగె.

"ఓ రాఘవా! ఇట్లగుటకుం గారణమేమనగా, ఇమ్మునీంద్రుండు
వాయుభోజనుండును, శిలాశయుండునునై పదివేల సంవత్సరము లత్యుగ్ర
ముగా తపముం గావించె. అపు డగ్నిదేవుం డాదిగాగల దేవ ప్రము
ఖులుచూచి "ఇతడు మనలోన నెవ్వనిదైన నొకని పదవినిం గైకొనం
గలండు. ఇపుడ దీని కుపాయముం జింతించుట మే''లనియెంచి యైదుగు
రచ్చరల నతనియొద్దకుం బనిచిరి. ఆ రమణీమణులు తమ చాతుర్యము
మెంపున మునివరుని మదన తంత్ర వినోదముల కెలయించిన వారల
యాటపాటల కానందించుచు నిజ ప్రభావ నిర్మితంబైన యీ సరోవర
మున నున్నవాడు. ఈకొలనికిం బంచాప్సరసంబను పేరు పరగుచున్నది.
అవనితల వీణాగాన ధ్వనులెల్లపుడు నిటుల వినవచ్చుచుండును సుమీ!''
యని చెప్పిన రఘుకుల వల్లభుండు సంతోషించి మ్రొక్కి యత్తపోధనుని

వీడ్కొని యరిగెను. పిమ్మట సీతాలక్ష్మణ సహితుండై వనంబున నచ్చటచ్చటనుండియు మునుల యాశ్రమములకు క్రమక్రమముగాఁబోయి పదునైదు దినములు, నొకమాసము, రెండునెలలు, మూఁడుమాసములును, నాలునెలలును, నొక్కొక్కచోటనిలిచి, మహాత్ములైన తపోధనుల సేవింపుచు, వారివలన ననేకములైన పుణ్యపురుషుల చరిత్రములను వినుచు, దుష్టులగు రాక్షసులంజంపి యాసంయమిసత్తములకు భయమును నివారించుచు, నదులు కొలంకులుంగల చోటులను, కొండలయందును, బహుమృగకులసంకులంబైన యరణ్యప్రదేశములందును, విహరించుచు, సకలవిధములను మునులను తోడ్పాటుఁగావించుటకు, నటనట, పర్ణగృహముల నిర్మించి నివసించుచు, మధుర ఫలాదులందెచ్చి ఋషి కుమారులకుఁ బెట్టి తృప్తి నొందించుచు, నిట్లు వనవాసకాలమునందు పదిసంవత్సరములు గడపెను.

పిమ్మట జానకీపతి వెండియు సుతీక్ష్ణ మహాముని యాశ్రమమున కరిగి యతనిని సేవింపుచు తదాశ్రమమున నమ్మహాత్ముని యాదరణకుఁ బాత్రుఁడై కొన్ని దినములుండి, ఒకనాఁడు తపోధనునింగాంచి "మునివల్లభా! స్వామీ! పరమేష్టికి సమానుఁడును, నగదృశ మహిమాఢ్యుఁడును, లోకస్తుత పవిత్ర చరిత్రుఁడునునైన యగస్త్య మునివరుని సందర్శింపఁ గోరిక కలిగినది. ఆ పుణ్యస్వరూపుఁ డెచ్చట తపముఁ జేయుచున్నాఁడు? అతని యాశ్రమం బిచ్చోటున కెంతదూరమున నుండును? దయమీరఁ దెలియ బలుకుఁ"డని యడిగెను.

సుతీక్ష్ణుండు సంతసించి "రామచంద్రా! కల్యాణ గుణధాముఁడవైన నిన్ను మౌనిశ్రేష్ఠుండగు కుంభసంభవుని యొద్దకుఁ బనుపవలయునని నాలో తలంచుచుంటిని. అమ్మునీంద్రు నవశ్యము నీవు దర్శింపవలయుంజుమీ! నా తలంపుప్రకారముగానే నీవునుంగోరియడుగుచున్నావు. రాఘవేశ్వరా! పరమ తపః ప్రభావ శోభితుండై వినుతినొందిన యామునినిం దలంచినను, సంస్తుతించినను, చూచినను సకల పాతకములును, జంఝూనిలముచే మేఘ పుంజమునుంబోలె పటాపంచలై పోవును సముద్రజలమునంతయు నరచేతఁగొని పానముఁ జేసినవాఁడును, మిన్నుముట్టఁ బెరిగిన వింధ్య పర్వతమును కేల మట్టమగునట్లు గర్వమడంచినవాఁడును

దేవేంద్ర పదవినొంది నిరంకుశముగా మేపుమీరఁ బ్రవర్తించిన నహుషుని సర్పమగునట్లు శపించినవాఁడును, మునులను మోసగించి తినుచున్న యిల్వల వాతాపులను రాక్షసులనుమ్రింగి జీర్ణమగునట్లు చేసినవాఁడును, దక్షిణపుదిక్కున సకల దేవతలకును తానొక్కండ తులయై నిలిచినవాఁడును, నైన యా కుంభజునీ మహిమను వర్ణించుట కెవ్వనికి సాధ్యము కాదు." అని వినుతించి "రామా! ఈ యరణ్యమున క్రూరులైన రాక్షసులు సంచరించుచు సదా మమ్ము బాధించుచున్నారు. ఆ దుష్టులను సంహరించి మా కష్టములు నివారింపుము. ఇదిగో! దివ్యములైన బాణములును, విల్లును, ఖడ్గమును నొసంగుచున్నాను కైకొను" మని పలికి వానిని ప్రియంబెసంగ, నిచ్చి యగస్త్యాశ్రమమునకుఁ జను మార్గమును దెలియఁ జెప్పి వీడ్కొలిపెను.

నాల్గవ ప్రకరణము ముగిసెను.



# శ్రీ రామ వన వాస ము.

## వచనకావ్యము.

### ఐదవ ప్రకరణము.



పూర్వోక్త క్రమమున సీతాలక్ష్మణ సహితుండైన రఘుకుల శేఖరుండు సుతీక్ష్ణుండు చెప్పిన చొప్పున ప్రయాణంబై పోయి నాలుగు యోజనముల దూర మరిగినంతట ముందట నొకవనమునుంగాంచి సౌమిత్రిం జూచి "లక్ష్మణా! అదిగో! మనకెదుట గోచరించు వనమును జూచితివా? అదియ సుతీక్ష్ణ మునివరుండు చెప్పిన యగస్త్యాశ్రమము ముందున్న యతని తమ్మునియాశ్రమము దాపున కరుదెంచితిమి. మహానుభావుండైన ఘటసంభవుని తమ్ముని సందర్శించి ధన్యులమగుదుము. తపోధన శ్రేష్ఠుండైన యగస్త్యుని ప్రభావం బద్వితీయమైనది. ఇచ్చోట మున్ను జరిగిన వృత్తాంతమును విను" మని యిట్లనియె.

—(*) శ్రీరాముఁడు తమ్మునికగస్త్యుని ప్రభావంబుం దెలుపుట. (*)—

మున్ను ఇల్వలుఁడు వాతాపియనెడి పేరులు గలిగిన యన్నదమ్ము లిరువురు క్రూర నిశాటు లీవనమున సంచరింపుచు పాపబద్ధులై బ్రాహ్మణహింసఁ గావించుచు చిత్రమైన కపటతంత్ర మొనరించుచుండిరి. ఎట్లనగా, వారిలో పెద్దవాఁడైన యిల్వలుఁడు వాతాపినితనతమ్ముని మేకరూపముఁ దాల్చునట్లుచేసి, తాను బ్రాహ్మణవేషముసుధరించి, విప్రులను భోజనార్థ మామంత్రణముసేసి, కపట మేషమునుజంపి దాని మాంసమును వండించివచ్చిన మహీసురులకు వడ్డించి వారు భుజించినయినంతట భుక్తశేషమును దినుటకై పిలిచినట్లు 'వాతాపీ శీఘ్రముగా రమ్మని పిలుచును. ఇల్వలుండటుల పిలువగనే బ్రాహ్మణుల యుదరముల మాంసరూపమునఁ జొచ్చియున్న వాతాపి నిజాకృతిఁదాల్చి వారి పొట్టలుజించి వెలువడి వచ్చును. మహీదేవులు మృతులగుటయు యథేష్టముగా నన్నదమ్ము లిరువురును వారి మాంసమును భుజించి సంతుష్టి

నొందుచుండుదురు. ప్రతిదినమును నయ్యిరువురు నిట్లే చేయుచుండిరి. వారి కపటమును నెఱుంగఁజాలక విప్రులు పెక్కండ్రా దుర్మార్గుల కెరయ్యగుచుండిరి. ఈ వృత్తాంతమును మహాత్ముండైన యగస్త్యుండు విని దైత్యుల దారుణ మాయాకృత్యము నెఱింగి వారున్న యాశ్రమమున కేదియుం దెలియని వాని చందమునఁ జనుదెంచె. ఇల్వలుం డతనిం బూజించి, భోజనమునకు నిలిపి, వాతుక ప్రకారము కపటమేషమును వధించి యాఫలముఁ బెట్టెను. దానిని కుంభజుండు భుజించి హస్తపాద ప్రక్షాళనం బాచరించి వచ్చినంతట, ఇల్వలుండు తమ్ముని నెప్పటిరీతిగాఁ బిలుచుటయు మునివరుండు తమ చేతితో పొట్టఁదడవుచు, జీర్ణించిపొమ్మని పలుకుటయు, వాఁడు వెలువడి రాఁజాలక జీర్ణించె. అంతకుంభజుం డిల్వలునిఁజూచి "ఓరి దుష్టాత్మా! మీరు చేయుచున్న మాయను నే నెఱుంగుదుంజుమీ? ఏల పిలచెదవు? నీతమ్ముఁడు జీర్ణంబయ్యె. నింక వచ్చుట యెట్లు? ఈలాగున సాధుజనుల హింసించుచుండిన మీకు తగిన శిక్షఁ గావించుట యావశ్యకంబగును, నీ సోదరుండు నశించె. ఇంక నీవును నాశమగుదువుగాక" యని పలికి యత్యుగ్ర దృష్టులు వానిపైఁ బరగించిన తత్క్షణంబ యయ్యిల్వలుండు భస్మంబయ్యె. ఇటుల నయ్యిరువురు రాక్షసులను బొలియించిన ఘటోద్భవుని తమ్మునిఁ జూచుట మన కభ్యుదయ హేతువగు" నని తద్వృత్తాంతమును ప్రసంగింపుచు తదాశ్రమముఁ జొచ్చి యగస్త్యాగ్రజునిఁ గని ప్రణమిల్లిన యమ్మునీంద్రుండు బహువిధముల వారలసత్కరించె ధరాసుతా లక్ష్మణులతోడ దాశరథి నాఁటి రేయి యచ్చోట గడపి, మఱునాఁటి ప్రొద్దుపొడుపున యా తాపసోత్తముని యనుమతిఁగొనిపైనంబై కదలి యగస్త్యాశ్రమముఁగదియనే తెంచి యవ్వనమునందలి కుసుమ పరిమళ మిళితమైన వాయువులు పైనోలయుచుండగా నానందముఁజెంది లక్ష్మణునితో "తమ్ముఁడా! కుంభసంభవుని యాశ్రమముఁ జేరితిమి. ఆహా! ఎంత రమణీయముగాఁ గనుపట్టుచున్నదో గనుము. ఇచ్చోట జాతి వైరములేక సకల జంతువులును గలిసి మెలంగుచుండుట యత్యద్భుతము. ఈ వనమునుండి తపమాచరించుచు మనుజులు, యక్షగంధర్వసిద్ధ విద్యాధర గరుడన్నాగ ప్రముఖ దేవ శరీరధారులై విమానములపై స్వర్గమునకుఁ బోవుచుండుదురు. ఇమ్మునిశేఖరునిఁ గొలుచుటకొరకై సంతతమును దేవగణము లరుదెంచుచుండుదురు. ఇట్టి విశేషము లన్నియు నసామాన్యమైన యగస్త్యుని

ప్రభావముచే గలిగి, యాదృచ్ఛికంబై గనుపట్టుచుండును. ఇమ్మునీంద్రుని సామర్థ్యముం జెప్పెదను వినుము. వింధ్యపర్వతము మేరువుతో పగబూని సూర్యమండలము పొడవునఁ బెరిగి రవి మార్గమునకు నిరోధము గలిగించుటయు దేవతలవలన ప్రార్థితుండై యిమ్మునివరుండు లోకహితార్థముగా తాను దక్షిణ దిక్కునకు వచ్చుచు తత్పర్వతమును భూమిమట్టమునకు సరిగా గ్రుంగులాగున చరణాంగుష్ఠముచే నదిమెను. అది మొదలు వింధ్యము పెరుగ వెఱచియుండు. మన కెంతయు క్షేమకరము. వనవాస శేషమును నేచే మునివరుని సేవించుచు నిచ్చటనే యుండి కడపుటకుఁ దలంచినాఁడను. లక్ష్మణా! త్వరితముగా నీవుముందు చని మన రాకను తపోధనున కెఱిఁగింపుముపొ"మ్మని పలుకుటయు సౌమిత్రి రయమున నడిచి యాశ్రమ ద్వారమున కరిగి యటఁ దోఁచిన మునికుమారు నొక్కనిం బిలిచి తమ నామములును నాగమనమునుం జెప్పి మునికులేశ్వరున కెఱిఁగింపు మనియెను.

ఆ మునికుమారుండు త్వరితముగా చని యగ్నిహోత్ర గృహమునందు తపశ్శీలు నత్తపోధనుం గాంచి "స్వామీ! దశరథ రాజనందనుండైన రాఘవేశ్వరుఁడు భార్యయు ననుజుండును వెంటరా నరుదెంచియున్నాఁడు. ఆశ్రమద్వారమున నిలిచి తమ రాక నెఱిఁగింపుమని పంచినాఁ"డని విన్నవించెను. అగస్త్యుండు శిష్యునితో "రామచంద్రుం డచట నిలువనేల? వచ్చుట కతని కాటంకమెయ్యది. శీఘ్రముగాఁబోయి తోడ్కొని ర"మ్మని పనిచెను. ఆ శిష్యుండును బిరబిరంజని లక్ష్మణునిం దోడ్కొని రామచంద్రునిఁ జేరఁబోయి, "రఘుకులనాయకా! రమ్ము. మునివరుండు మిమ్ము శీఘ్రముగా దోడ్కొని రమ్మని చెప్పినాఁ" డని పలికి వారల వెంటఁబెట్టుకొని పోయెను.

రామచంద్రుం డాశ్రమముఁ బ్రవేశించి మునీంద్రునియొద్ద కరిగి యనుజ సహితుఁడై నమస్కరించెను సీతాదేవియు మ్రొక్కెను. అపుడు మునిశ్రేష్ఠుండు రామలక్ష్మణులను మహా సంతోషమున నాలింగనముఁ జేసి జనకజ నాదరించి యుచితభంగి మర్యాద లొనరించి యుపవిష్టులం జేసి కుశలంబడిగి శిష్యునిం గాంచి "ఓరీ! ఈ రామచంద్రుఁడు దేవతల కంటె నధికుండు. ఇతనిఁ బూజించుట వేల్పులఁ బూజించుటకన్న నధికమగు కార్యము. నీవు త్వరితముగా చెరువునందు మిగిలియున్న హోమ

శేషమునుదెచ్చి యీ పురుషోత్తమునకుఁ బెట్టు'' మని యాజ్ఞాపించిన వాఁడగ్లగావించె. తపస్వి రామునింగని ''దశరథనందనా! అతిథియింటికి వచ్చునపుడు శక్తివంచనలేక కలిగినవట్టుంబెట్టని పాపచిత్తుడు నరకమున తన మాంసమును తాను భుజించుచు ఘోరదుఃఖము లనుభవించునని పెద్దలు చెప్పుదురు. కావున నిన్ను సంతుష్టునిఁ జేయుట యావశ్యకము. ఈ హోమ శేషముఁ గొను''మనిచెప్పి యుక్తవిధిం బూజించి. యమోఘంబైన ఖడ్గమును, విష్ణు సంబంధమైన శరాసనమును, నక్షయ తూణయుగమును, నొసంగి పిమ్మట'' రాఘవేశ్వరా! మఱియు నీకు కావలసిన వానిని కోరుమిచ్చెద'' నని చెప్పెను.

జనకజాప్రియుండు సంతసించి ''దేవా! భవత్కృపా సమృద్ధివలన నన్నియుం గొదువలేక యుండగా కోరవలసిన దెద్దికలదు? ఏదియును లేదు. కాని మాయందు కృపాదృష్టులు నెఱయఁజేసి, మేము నివసించుటకు యుక్తమైన స్థలమును జెప్పుఁడు చాలును. నేను మీచెంతనే నివసింపఁ గోరియున్నవాఁడ'' నని వేడుటయు, కుంభజుండు సంతోషించి ''రామచంద్రా! ఇచటికి కొంతదూరమున గౌతమీతీరమున పంచ వటంబను పేరుగల వనంబొకటియున్నది. ఐదు గొప్ప మఱ్ఱిమ్రాకు లుండు చోటు గావున యావనమున కట్లు నామము కలిగెను. మీరు నివసించుట కది యెంతయుం దగినచోటు అచ్చోటికేగి యవ్వనము వసింపుఁడు పొం''డని దీవించి మార్గముఁ జెప్పి వీడ్కొలిపెను.

—(*) జటాయు దర్శనము. (*)—

అంతట రామలక్ష్మణులు సీతాసహితులై యవ్వనమువిడిచి పంచ వటమున కరుగుచుండు సమయమున నెదుట మార్గమున, పర్వతము వంటి గొప్ప శరీరమును, గండభేరుండాది పక్షులను సయితము చీల్చి కబళింపఁజాలిన ముక్కును, బాలసూర్యబింబమునుం బోలిన గుండ్రని యెఱ్ఱని కన్నులును, వజ్రాయుధమునకు తుల్యములైన గోళ్ళునుం గలిగి యత్యాశ్చర్య కరముగా గనుపట్టుచున్న పక్షి నొకదానిని చూచిరి. మిక్కిలి పెద్దదైన యాపులుగు రామచంద్రుని, తన దాపునకు వచ్చుచున్న వానిని జూచి ''ఓరఘునందనా! నేను మీతండ్రికి సముఖుఁడను అరుణ పుత్రుండ. నాపేరు జటాయువు. నామిత్రుని పుత్రులరైన మిమ్ముఁ జూచుటఁ జేసి యెంతయు సంతోషంబుఁ గలిగె" ననియెను.

ఇట్లు పలికిన యా పక్షిశ్రేష్ఠుని మాటలు విని యలరి రామలక్ష్మణులు దగ్గఱి సముచితాలాపంబుల నప్పతంగ పుంగవునిం గొనియాడిరి. జటాయువు ప్రియంబు మీఱఁగా దాశరథింజూచి "రామా! సద్గుణధామా! అరువది వేలేండ్లు నిరంకుశుండై భూమిఁ బాలించిన మీతండ్రికి నెనరలేని మిత్రుండనగుదును. అమ్మహీనాయకాగ్రణి నందనులరైన మిమ్ము తత్సమానులుగాఁ దలంపక నేను మఱవఁగలనా? ఎప్పుడుగాని, యేకార్యమును, నాకు దెలియక దశరథావనీశుండుచేసి యెఱుంగఁడు. నాతోడ నాలోచించి నా సమ్మతమును గైకొని నా యోజనప్రకారముగా నతండేమిచేసినం జేయుచుండెను. ఇపుడు మిమ్ము చూడఁగానే ప్రాణతుల్యుండైన నా సఖుని దశరథాత్మపతిని దలంపుఁ జేయు సమయము తటస్థించినది. పరమపుణ్యులైన మీ దర్శనముచే నాకతఁడు జ్ఞప్తికివచ్చుచున్నాఁడు. ఓ రామా! మీ రిటకు విచ్చేయుట మదీయ భాగ్యవిశేషమని భావించెదను. ఏమి కావలయునో యేమిచేయవలయునో తెలియఁ జెప్పుము. దుర్గమంబులైన కొండ శిఖరముల నెక్కి చూడఁగోరియున్న నిమిషమున మిమ్మందఱ గొనిపోయెద. లేక జానకీదేవికి కావలిగా యుండుటకు నిలిపి మీ రెట కేనియుం బోయినను, జాగ్రతగాఁ గాచియుండెదను, మఱి యేమిచెప్పినం జేసెదను ఆజ్ఞాపింపుము. మీకు వలయు కృత్యంబులు జేయుటకంటె మించినపని వేఱొండు లే"దని పలికెను.

కౌసల్యాసుతుండు సంతుష్టుండై యావిహంగవరునకు తనయందు గలిగియున్న భక్తికిని ప్రియంబునకును సంతోషించి, జనక సఖుండైన యా జటాయువును పూజించి తదీయ జన్మప్రకారము నెఱుంగఁదలంచి యడుగుటయు, నప్పక్షి రఘువీరునకు తన వృత్తాంతంబుఁ దలంచి యిట్లని చెప్పఁదొడంగెను.

—(*) జటాయువు తన జన్మప్రకారము రామునితో చెప్పుట. (*)—

"దశరథాత్మజా! మదీయ జన్మప్రకారము వినఁగోరి యడిగితివి గాన చెప్పెదను వినుము. సృష్ట్యాదియందు పదునెనమండుగురు ప్రజాపతు లుదయించిరి. వార లెవ్వరనగా, కర్దముఁడును, విక్రీతుఁడును, శేషుండును, సంశ్రయుండును, బహుపుత్రుండును, స్థాణుండును, మరీచియు, నత్రియు, క్రతువును, మహాబలుండును, బులస్త్యుండును, బులహుండును, ప్రచేతనుండును, దక్షుండును, నాంగిరసుఁడును, వివస్వంతుండును నరిష్టనేమియుఁ, గశ్యపుండును, ననువారలు వరుసగా జన్మించిరి. అంత

దక్షున కఱువండ్రు దుహితలు జన్మించుటయు వారిలో పదమువ్వురు కన్యలను గస్యపుఁడు పరిగ్రహించె. తక్కినవారలలో కొందఱను, ధర్ముఁడును, కొందఱను సోముఁడును నను మహాపురుషులు వరించిరి. కశ్యప పత్నులైన పదమువ్వురకును గ్రమంబుగా, నదితియు, దితియు, దనువును, గాళియు, నరిష్టయు, గషయు, సురసయు, సురభియు, వినతయుఁ, గద్రువయు, వ్యాఘ్రియు, క్రోధవశయు, దామ్రయు, నననామంబులు గలిగియుండు. వారలలోన నదితి కాదిత్యులును, రుద్రులును, దితికి దైత్యులును, దనువున కశ్వగ్రీవుండును, గాళికి నరక కాకులును, గంధర్వులు నప్సరసలును, నరిష్టకు సిద్ధులును, గషకు రక్షుండును, ననంబుత్రు లుదయించిరి. సురభికి రోహిణియు, గంధర్వియు, గ్రోధవశకు మృగమందయు, హరియు, భద్రియు, మనువును, భూతయుఁ గపియు, దంష్ట్రియు, శ్వేతయు, సురసికురనియు, వనస్పతియు, వనస్పతికి, వృక్షలతా వీరున్మాతలు మువ్వురును, తామ్రకు శ్యేనియు భాసయు, గ్రౌంచియు, ధృతరాష్ట్రియు, శుకియు ననెడి కూతులునుం బుట్టిరి. కద్రువకు నాగ సహస్రంబు లుదయించె సురసకు నేకశిరంబులగు సర్పంబులు నూఱుకలిగె వినత కరుణుండును, గరుడుండును నను విహంగప్రముఖు లుదయించిరి. అందు శ్యేనికి నరుణునకును, సంపాతియనువాఁడును, నేనును గలిగితిమి. నేనును గనిష్ఠుండ. నానామంబు జటాయువని మున్న చెప్పితి. కకుత్స్థ వంశాగ్రణీ! ఇది మదీయ జన్మప్రకార''మ్మని వివరంబుగాఁ జెప్పిన రాముండు సంతుష్టి నొంది యా పక్షిపతిని ప్రియోక్తుల సమ్మానం వెలర్పఁబొగడి వీడుకొని కదలి దట్టమైన చెట్లును లతా గుల్మాదులును గలిగి వినోదంబుగా నొప్పుచు కన్నుల పండువుఁగావించుచున్న పంచవట స్థలంబునకుం బోయెను.

ఇట్లుచేరి యట నొక రమ్యప్రదేశంబుఁ జూచి తమ్మునితో "ఓ లక్ష్మణా! ఇచ్చోట ననుకూలంబై యున్నది. కావున త్వరితంబుగా పర్ణశాల నొకదానిని నిర్మింపుము. వనవాస శేషంబు నిచ్చోటనుండి గడపుద"మని చెప్పిన సౌమిత్రియు సమ్మతించి యనువగు తరుశాఖలు ఖండించి, లతలు రజ్జువులుగాఁ బెనచి చాతుర్యం బెలర్ప రమ్యంబుగా శాల నిర్మించి, యాకులను పైకప్పు గావించి చూపిన రామభద్రుం డానందమఁజెంది తమ్మునిఁ గౌగిలించి, సీతాసహితుండై యా పర్ణశాలయందు వసించె. తత్సమీపమున తనకుగా వేఱొక్క శాలఁగట్టి యందు లక్ష్మణుండు తానుండి సదా సీతారాముల నేమఱక సేవించుచుండెను.

ప్రతిదివసంబును, సుమిత్రాసుతుండు మంచిమాంసమును, మేలైన ఫలంబులును, జనకనందన కోరిన పుష్ప లతాచయంబులునుం దెచ్చి యొసంగి యన్నకును, వదినెకును సంతోషంబు గలిగించుచుండ, తత్కాలమున రామచంద్రునకు మనంబున వనవాస క్లేశ మావంతయులేక, సీతా సహితుండై విలాసంబున కాలంబుం బుచ్చుచుండె.

ఈప్రకారము కొన్నిదినంబులు జరుగుటయు, నొక్కనాఁడు రాఘవేశ్వరుండు లక్ష్మణునిఁబిలిచి "తమ్ముఁడా! మీవదినెకు నేఁడు త్వరితంబున మంచి ఫలంబు లారగింపఁ దెచ్చియిమ్మ"ని చెప్పిన యతం డన్నకు మ్రొక్కి కదలిపోయి యటనట ఫలార్థంబు సంచరించుచుండె. అందు తత్పూర్వం బొకచోట విద్యుజ్జిహ్వుండను రాక్షసుని కొడుకు జంబుకుమారుండనువాఁ డొక వెదురుగుమి మధ్యంబునచుండి ఘోర తపంబుఁ జేయుచున్న యెఱింగి దేవేంద్రాదులు వానికి ప్రియంబుఁ జేయువారై భయంకర చంద్రహాసంబు నొకదానిని బుత్తెంచినదానిని వాఁడు గైకొననొల్లక యచ్చోటున బడవైచి యుండుటయు, సవ్వాలు లక్ష్మణుడు గాంచి కైకొని దాని వాడిమి నరయుటకై యచ్చోట లతావృక్ష సముదయంబు ద్రెంచుచుండె.

తత్సమయమున నవ్వనవాసులైన మునులు కొందఱా విధంబుఁ జూచి ప్రసన్నముఖులై సౌమిత్రియొద్దకుఁ జేరవచ్చి "ఓ యన్నా! ఫలయుతంబులును, కుసుమ భరితంబులును నైన యీ వృక్షలతాదులఁ ద్రుంచుట యుక్తంబుగాదు. వాడిఁ బరీక్షింప వలసియున్న యదిగో! ఎదుటనుండెడి వెదురు పొద నొక్కవ్రేటునఁ దెగి కూలునటుల వ్రేయుము. అందువలన దానిరీతి తెలియు"నని మునీంద్రులు సెప్పిన వల్లెయని లక్ష్మ

—(*) లక్ష్మణుండు జంబుకుమారుని జంపుట. (*)—

ణుండు తన కరంబుననుండు నూతన చంద్రహాసంబును జళిపించి, ప్రచండబాహుదండం బెత్తి యవ్వెదురు పొద నొక్కవ్రేటునం బడ నఱికిన, యా తపోధనులు మెచ్చి యలరిం గొనియాడిరి. సౌమిత్రి తాను నఱికిన వెదురుపొద నడుమనుండి తెగిపడిన రాక్షసునిం గని మునీశ్వరుండని తలంచి దిగులొంది "అకటా! పుణ్యశీలుండైన తాపసోత్తముని జంపి పాపంబుఁ గట్టుకొంటి. ఏమిచేయుదును? ఈ వృత్తాంతంబు విని యన్ననాపై నెంతకోపమును జెందునోకదా!" యని దుఃఖాక్రాంతుండై యేమియు దోఁచక ఫలంబులుకొని రఘునాయకునియొద్ద కరిగి మ్రొక్కి దీనాన

నుండై యున్న యతని తీరుంగాంచి రామచంద్రుం డాలింగనము గావించి "తమ్ముఁడా! నీవు నేఁడు ఖిన్నుడవై విన్నఁ బోయియుండుట కేమికారణము? చెప్పి నాసంశయమును నివారింపు"మని యడిగిన యతండు "జరిగిన తెఱంగు విన్నవించెను.

ఆ వృత్తాంతమును విని రామచంద్రుండు కటకటంబడి "లక్ష్మణా! అయ్యో! ఘోరపాతకంబు సిద్ధించెనే! ఇది బాయు విధంబెట్లు? ఏమిచేయుద"మని మిక్కిలి విచారమును బొందుచున్న సమయంబున వారియొద్దకు మునులు కొందఱు వచ్చి రామచంద్రుం డనుజ సహితంబుగా మ్రొక్కిన వారి నాశీర్వదించి వారిచే పూజింపఁబడి యాసీనులగుటయు, దాశరథి యమ్మహాత్ములంగాంచి "మునివరులారా! నాతమ్ముఁ డెఱుంగక ప్రమాద వశంబున నొక తపోధనుని వధించె. మీర లనుగ్రహించి తత్పాతకం బితని బొందకుండునట్లు చేసి మృత్యుండైన తపస్వి జీవించునట్లు ప్రాణంబు లొసంగుఁ"డని ప్రార్థించెను. ఆ నృపకుల శిఖామణి వచనంబులు విని యమ్మునులు మందస్మిత వదనులై రఘునందనుని కిట్లనిరి. "మహిరకుల వల్లభా! దీనికై మీరు విచారము నొందవలదు. సౌమిత్రిచే దునిసినవాఁడు తాపసేంద్రుడుగాఁడు. వాడు క్రూరుండగు రాక్షసుండు, వాని వృత్తాంతమును జెప్పెదను విను"మని యిట్లని చెప్పం దొడంగిరి.

—(*) మునులు రామునకు జంబుకుమారుని తెఱంగుఁ జెప్పుట. (*)—

"రాఘవేశ్వరా! విద్యుజ్జిహ్వుం డనువాని కుమారుండు జంబుకుమారాభిధానుండు మహాక్రూరుండు, తన తండ్రి పగఁదీర్చుటకై దేవేంద్రుని గూర్చి యఖండిత తపంబును సలుపఁదొడంగె. అత్తపంబున కింద్రుండు మెచ్చి సాంద్రద్యుతి భాసురంబగు చంద్రహాసంబును బనిచినగైనొల్లక "మదీయ తపంబున కిదియో? యొసంగుట. ఈ పట్టంబేమిటికి?" యని వాఁడు దానిని నిరాకరించె. యదిగాంచి ఈ లక్ష్మణుండు దానింగొన ఫలవృక్షంబుల దునుముచుండుటయు మేము చూచి యా రాక్షసుండున్న వెదురు గుమింజూపి వానిని చంపించువారమై యగ్గుమిం ద్రెంపుమని పురికొల్పితిమి ఇతండు మాచెప్పిన చొప్పున నటికి యా వెదురులతోడ తెగిన ముని వేషధారియైన యా దనుజునిఁగని తపసి యని యెంచి భయ దుఃఖంబు లతిశయింపగా వేగంబున నీయొద్దకువచ్చి తద్వృత్తాంతంబుం దెలియఁబలికె. ఈ మహాత్కార్యంబుఁ జేయుట వలన నితని

నికి మిక్కిలి పుణ్యంబు సంభవించె. ఆవంతయుఁ బాపంబుఁ లేదు. మీ రింక వగవకు''డని చెప్పి దుఃఖమును తొలంచి నిజాశ్రమంబుల కేగిరి.

అంతట జంబుకుమారుని తల్లియు, ఘోరరూపిణియు క్రూరచిత్త యునైన శూర్పణఖ యనునది వాడుక ప్రకారంబున బోనంబుఁగొని వైళంబ చనుదెంచి వెదురు పొదతోడ తెగిపడియున్న కొడుకుంజూచి, సువర్ణముఖియై మహా దుఃఖముతో "హా! నా ముద్దుపట్టీ హా! జంబుకుమారా! కటకటా! నిన్ను నిష్కారణంబుగా ఖండించిన దుండగుఁ డెవ్వఁడోకదా! మౌన వ్రతంబుఁబూని, తండ్రినిఁజంపిన వానిపై పగఁదీర్చుకొనుటకై దృఢనిష్ఠం దప మాచరించుచున్న నీ విటుల దెగిపడి యుండుటం జూచి నంతట నామనం బెటులనోర్చును? ఈ పుత్రశోకంబు నెటుల భరింపఁగలను? ఇటువంటి క్రూరకృత్యంబున కొడిగట్టిన దుష్టాత్ముని ప్రాణంబులను గొనినఁగాని నా హృదయాంతర తాపంబు శాంతింప"దని యేడ్చి యార్భటింపుచు మునిజను లున్నచోటి కరుదెంచి, కన్నుల నిప్పులురులగా మహా కోపదృష్టుల వారలఁగని పండ్లుగొఱుకుచు "ఓ దుష్టులారా! అక్రమంబనక నా కుమారునిఁ జంపినవాఁ డెవ్వఁడో నిజముఁ బల్కుఁడు. చెప్పకుండినచో మిమ్మందఱ నొక్కసారిగ నీ క్షణంబున వధించెద విడువ''నని బెదరించుచు సమీపించుటయు భీతినొంది మునులు గడగడ వడంకుచుండ, వారిలో నొక్కఁడు ధైర్యంబు నవలంభించి దానికిట్లనియె.

"ఓ శూర్పణఖా! మే మెవ్వరమును నీకుమారున కేకీడును జేసిన వారముగాము. మాపైఁ గనలొంద నేమిటికి? నిరపరాధులమగు మము జంపవచ్చుట న్యాయమగునా? ఎవఁడో బలాఢ్యుండును శూరుండునునైన రాజకుమారుం డొకఁ డీవనంబున కరుదెంచి సంచరించుచుండిన నీకుమారుని ఖండించి పోయెను. వారించుటకు శక్తులము గామిచే తద్వృత్తాంతమును చూచుచుండి నీతోడ బలుకఁదలంచి యుంటిమి. అతని గాని యతఁడు పోయినచోటునుగాని మేమెఱుంగము ఇంకను నన్నుమహావీరుండిందే యెటనైన నుండనోఁపు"నని చెప్పెను. అతఁ డవ్విధమున బలుకుటయు నాగ్రహావేశంబున యా శూర్పణఖ "యా రాజనందనుం డెవండో కనుఁగొని వానిని వధించెదఁగాక'' యని యెంచి గహనంబంతటం దిరిగి వెదకుట కారంభించెను.

ఈరీతిగా వెదకుచు రామచంద్రుడున్న పర్ణశాలను సమీపించి వచ్చి తత్పూర్వము లేని పర్ణశాల యచ్చోట క్రొత్తగా నిర్మింపఁబడి

యుండుట గని యాశ్చర్యమొంది చేర నరిగి యందు సీతాదేవితో సరస సల్లాపంబు లాడుచున్న రామచంద్రునిం జూచి, తామర రేకులం బోలు విశాల నేత్రములును, వెడద యురంబును, దీర్ఘములైన బాహువులును

—(*) శ్రీ రామలక్ష్మణులు కడకు శూర్పణఖ వచ్చుట. (*)—

చంద్రబింబ సదృశంబైన ముఖంబును నీలమేఘమువంటి దేహచ్ఛాయయుం, గోమలాంగకంబులునుం గలిగి, చిత్తజ సన్నిభుండై యొప్పుచున్న రాఘవేశ్వరు రూపంబునకు మెచ్చి, యెంత తడవు చూచుచున్నను తనివి గలుగకున్న, విస్మయావహచిత్తయై తనలో "మాయురే! ఇదిగదా చక్కదనము. ఇతనికి సమానుండైన పురుషుండు ముల్లోకముల వెదకినను మఱియొక్కండు గలుగడు. బాగుబాగు! చక్కగా వికసించిన తామరపూవు రేకులవలె కన్నులును, రేయింబగలును కళాహీనంబుగాక ప్రకాశించు చంద్రబింబమునకు సాటిఁజేయందగిన నెమ్మోమును, నును పారి నిగ్గారి తనరు దిక్కరుల తుండములనంటి బాహువులును, నిండ్రనీలమణుల కాంతిని ధిక్కరింపఁబోలిన తను కాంతియుం గలిగి నయనాభిరాముండై యొప్పుచున్న యీ పురుషోత్తముని సొబగు వర్ణించుట కెవరికి సాధ్యమగును?" అని పొగడి డగ్గఱి వినయంబుతో "ఓయి సుకుమార శరీరా! నీవెవ్వఁడవు? నీపేరును కులంబును వినుటకు ప్రియంబు గదిరెం గావున వచింపు"మని ప్రార్థించె. జానకీ ప్రియుండా రక్కసింజూచి తన వృత్తాంతమంతయు వివరముగాఁ జెప్పెను.

ఆ సమాచారంబును విన్నంతట యది రామునితో "రాజనందనా! నీ యుదంతంబును జెప్పినాఁడవుగదా! ఇంక మద్వృత్తాంతంబును చెప్పెదను విను"మని యా పురుషశ్రేష్ఠుని గాంచుటచేతను, మాటలాడుటచేతను, మనంబున కామం బంకురింపగా, తన గొప్పతనంబును జెప్పి యతనిలోఁగొను తలంపున నిట్లనియె.

"భుజా! బలపరాక్రమ సామర్థ్యంబులచే శత్రు భయంకరుండై ముల్లోకములును జయించి దేవతలచే వెట్టిఁగొనుచు సకల భోగములును ననుభవించు చుండువాఁడును, మహాప్రతాపవంతుఁడును, లంకాపురాధినాథుండును, నైన పంక్తివదనునకు నేను సోదరిని. నాపేరు శూర్పణఖ ఓ రామచంద్రా! స్త్రీలచిత్తములు చంచలములుగదా! ఇటవచ్చి నీసౌందర్యమును చూడగనే నామనంబున నెనలేని మోహము జనించినది. దాపనేల? కలిగిన మాటను చెప్పెదను. నీపై వలపుఁగొంటిని. కావున

మదీయ ప్రియుఁడవై నా కోరికం దీర్పుము. నన్ను గూడితివేని నీకు మిక్కిలియు మేలగును. ఈ వనంబున జనస్థానమనుచోట నా యన్న ఖరుండను వాఁడొకఁడు నివసించుచున్నాఁడు. అతఁడు మహా పరాక్రమవంతుఁడు. బహుళ సేనాసమేతుఁడు. ఆదైత్య శేఖరుండు నన్ను చేపట్టిన నిన్ను గని మఱదివని యెంచి చాల నీకు సహాయముఁ జేయును. నీవిచట నిర్భయంబుగా సంచరింపవచ్చును. నీ భార్యయైన దీనిని విడువుము. ఛీ! ఇది నీకు తగినది కాదు. కురూపియుం జెడి పయునై దీని సంబంధము వదలి యన్ని శుభలక్షణంబులం దనరిన నన్ను గూడుము. నీవంటివానికిటువంటి కొఱమాలిన దుర్లక్షణములు గలది యాలగుట కేవలము హీనతగా యున్నది. నేను దీనినిజంపి భక్షించెద. నేనన్ననో, నీ మనంబునకేరూపు ప్రియముగా నుండునో యట్టి యా కృతిఁదాల్చి నిన్నే సంతోషమొందునట్లు చేయుచుండుదును. నాతోడ మదనకేళిం గూడినప్పుడు నీకు గలిగించెడి యానందం బెట్టిదియో యెఱుఁగుదువుగాక. ఇచ్చట మన మిరువురమును సురతకేళిం దేలవలయుననినచో యేకాంతస్థల మత్యావసరముగదా! ఇపుడన్ననో, నీ తమ్ముఁడొకఁడు మనకుదాపురించియున్నాఁడు వీనిని సోదరుఁడని యెంచి కరుణఁజూపవలదు. నేను వీనిని సయితము వధించెదను. అంతట మన తొడుసు తీఱును, స్వేచ్ఛావిహారంబున కనువగును. నామాటల కడ్డుపలుకక మోహాయత్త చిత్తనై ప్రార్థించుచున్న నన్ను మన్నించి మదీయ వ్యామోహంబు నడంచి నీవును ననువమాన సుఖంబు ననుభవింపు"మని వలపుతోడి చూపులొప్పఁ బలుకుచున్న యాదురితాత్మ మాటలువిని, రఘువరుం డల్లగిలి దానితో "ఓ మగువా! నేను భార్యనుగలవాఁడను. ఇదె చూచుచున్నావుగదా! ఒకతెయుండగా వేఱొకతెం గోరుట న్యాయముగాదు. ఈ సుందరాంగిం జంపుటయు నక్రమము. మిమ్మిరువురను గూడి యుండినచో యెట్లును మీకిరువురకును మత్సరము కలుగక తప్పదు. నీవంటి మంచిదానికి సవతిపోరు గలిగించుట సమ్మతము గాకున్నది. కార్యవిధానముఁ జెప్పెదను వినుము నీవు మిక్కిలి మోహామునుగొని వచ్చినపుడు నిన్నుఁ నిరాకరింపరాదుగాన, మత్సదృశుండును, చతురుండును, యౌవన వంతుఁడును నైన నాతమ్ముఁడు భార్యలేనివాఁడై యున్నాఁడు నివతలనీయొద్దకేగికోరికఁ దీర్చుకొనుము పొ"మ్మని చెప్పెను.

రామచంద్రుం డటుల బలుకుటయు నవి పరిహాసోక్తులని యెఱుగ

లేక యాచెడిప సత్యంబయని నమ్మి బిరబిర లక్ష్మణునియొద్ద కరిగి తన యభిప్రాయంబును, రాఘవేశ్వరుండు చెప్పినమాటలుం దెలియబలికి "ఓ సుకుమార సుందరాకారా! వలచివచ్చిన యాడుదాని కోరికందీర్పక నిరాకరింపకూడదు. మిక్కుటమైన మోహాంబనెడి యురిలో దగులువడి తత్తఱించుచున్న నా పరితాపంబు దొలంగులాగున నాతోడంగూడి మదనకేళిం దేలించి యానంద మొందింపుము. క్షణము తడవోనరించినను, నేనింక నోర్వంజాల"నని బతిమాలుచున్న దాని పలుకులు విని లక్ష్మణ తలయూంచి తనదు పట్టరాని నగవును ప్రయత్నంబున నడంచుకొని "ఓ సుందరాంగీ! ఇది యెంతటి వెఱ్ఱితన మనవలయును? లోకంబునం గల పురుషులలో శ్రేష్ఠుండును, రూపమందును, జాణత్వమందును, నధికుండునునైన రామచంద్రుం డుండగా, నీ వతనివిడిచి నాయొద్ద కరుదెంచుట యొప్పునా? నే నమ్మహాత్ముని సేవకుండను, ఇటువంటినన్ను గూడినచో నీవును నతనికి దాసివై యుండవలయును గాని, ఇసుమంతయు నీకు గౌరవము కలుగబోదు. నీయంతటి యుత్తమ కాంత యగౌరవస్థితిని జెందుట యనిన నగుబాటు గదా! ఇసీ! తగిన చందముగాదు. రామునకు నీపై ననురాగము లేదని తలంచితివి గాంబోలు. అతఁడు నిన్ను నాయొద్దకు బనుచుటకు కారణము నీవు గ్రహింపఁ జాలవైతివి. నేను తెలిసికొంటిని. ఏలననగా, నిన్ను తానటు నిటుంద్రిప్పి నీ నడలును, కులుకులును, తళుకు బెళుకులునుం జూచి సంతసించుట కొఱకై యిట్లు పుత్తెంచెను. ఈ ముక్కుతీఱును, యీ కన్నులయందమును, ముఖవిలాసమును, మేనికాంతియు, లోకంబున మఱి యే యువతిగలదు? ఇటువంటి లావణ్యనిధినైన నిన్నా రామచంద్రుండు విడుచునా? నిన్ను చూచినది మొదలు నీ వలపునఁజిక్కి రామభద్రుండు తపించుచుండును సుమీ! వైళంబ నీవతనియొద్ద కరుగుము. నీవింక నాకు వదినెవైతివి, తడవుఃజేయక పోయి యా గుణ రత్నాకరుంగూడి నీకోరికం దీర్చుకొనుమ"ని నమ్మబలికెను.

లక్ష్మణుని మాటలు నిజములుగాఁదలంచి శూర్పణఖ యత్యానందమునుబొంది కులుకుచు మరలి రామచంద్రునియొద్ద కరుదెంచె. అటులవచ్చిన యావికృతాంగిం జూచి జనకరాజనందన పకపకనవ్వె. తన వంకఁజూచి యామె నగుటకు శూర్పణఖ మిక్కిలి కోపమును జెంది రామచంద్రునితో "సుందరాంగా! చూచితివా! ఈ దుస్స్వభావ యలంతి గానెంచి నన్ను చూచి నవ్వుచున్నది. అపుడే దీని సవతి మత్సరమును

జూపుట కారంభించినది. బళి! ఇటువంటిది మనకేమిటికి? దీనినిపుడే చంపి భక్షించెదను. పిమ్మట మన కేకష్టమును నుండదు. ఇరువురమును నిష్ట వినోదములం దేలుచుండ వచ్చును. నీవింక నేమియు నడ్డుమాట పలుక వలదు" దని చెప్పి, కోఱలు వ్రేలఁగ మండుచున్న కన్నులనుండి నిప్పులు రాలుచుండగా నోరుం దెఱచుకొని చూచుటకు భయంకరముగా సీతను

—(*) లక్ష్మణుండు శూర్పణఖ ముక్కు చెవులం గోయుట. (*)—

మ్రింగుటకై డాయం జనుదెంచె. దాని యుగ్రాకృతిం గని భూపుత్రి భయమున మైవడంకుచుండ పతి మఱుఁగుఁ జొచ్చిన, యొయ్యన రామచంద్రుం డొక్క చేతితో యామె రెట్టం బట్టుకొని రెండవ కరముతో యా రాక్షసిని చెంతకుం జేరనీక పట్టుకొనియె. ఆలాగు పట్టినను నిలువక యది మహా క్రోధముతో రొజుచు గ్రుడ్లు గిరగిరం ద్రిప్పుచు సీతను మ్రింగ నుంకించుచున్న, దాని దుశ్చేష్టితము నెఱింగి, రామభద్రుండు సౌమిత్రిం బిలిచి "తమ్ముడా! క్రూరులును దుర్మార్గులు నైన వారలతో పరిహాసములాడు టెంతయుం జేటును దెచ్చుననుట నిశ్చయము. చూచితివా! ఈ నేరము మనయందే యున్నది. ఎగతాళికై మనము పలికిన పలుకుల వలన నిపుడు జనక తనయకు కీడుమూడున ట్లేర్పడె. శీఘ్రముగా నిటు రమ్ము ఈ దుష్టచింతకుం దగిన ప్రాయశ్చిత్తముం జేసినంగాని యిది శాంతినొందదు. దీనినింక విరూపిం జేసి యనుపు" మని యాజ్ఞాపించెను.

సౌమిత్రి త్వరితముగా వచ్చి మిక్కిలి కోపముతో శూర్పణఖను బట్టుకొని తన చేతివాలుతో, బిరబిర దాని ముక్కును చెవులును గోసి "దురాత్మురాలా! నీ యందము ముందటికన్న నిపు డెక్కువ యైనది. ఇంక నిట నిలువక పొ"మ్మని పలుకుటయు, దుష్టచారిణియైన శూర్పణఖ యవ్విధమున భయమునొంది యరణ్యమున ప్రతిధ్వని జనించులాగున నేడ్చుచు, రొజుచు, కాలమేఘము చాడ్పున మీఁదికెగసి, రయమునఁబోయి, జనస్థానముఁ జేరి, యట పెక్కండ్రు దనుజులు గొలువఁగా నిండుకొలువున్న తన యన్నయగు ఖరాసురుని ముందట నేలపైఁబడి పొరలుచు కడు దీనముగా రోదనముఁ గావింపఁ దొడంగె అతండు చెల్లెలి తీరుంజూచి యచ్చెరువునొంది, క్రోధ తామ్రాక్షుండై "సోదరీ! ఇట్టి దుస్థితి నీకేల కలిగినది? ఇటువంటి పాటు నొనరించినవాఁ డెవ్వఁడు? నీవు నాచెల్లెలవనుట నెంచక, మదీయ ప్రతాపము నెఱుంగక, లయకాలుని కోఱలు మీటినట్లును, పురాంతకుని మూడవకన్ను నఱకాలదన్ని



శూర్పణఖ ముక్కు చెవులు గోయుట.

నట్టును, నీకిట్టి యపకృతిం గావించి మదీయంబైన యాగ్రహమున కెవ్వండు పాత్రుం డయ్యెను? ఆ దుష్టాత్ముం డెవ్వండో త్వరితముగా నెఱింగింపుము సపుత్రమిత్రముగా వాని నిప్పుడ పొరిగొని నీసూడు నివారించెద తడవుంజేయక వానిపేరుం జెప్పుము. పిమ్మట వాని దుర్గతిం జూతువుగాక” యని యడిగెను.

దుశ్శీలయైన శూర్పణఖ కన్నులనుండి జాఱుచున్న నీఱును, నాసాకర్ణములనుండి కాఱుచున్న నెత్తురును గాలువను గట్టుచుండగా నేలంబడి పొరలుటచే మేను ధూళిం బ్రుంగియుండగా, తన యన్న చెప్పినమాటలువిని రోదనము వీడి దుఃఖం బడంచుకొని కూర్చుండి, గద్గద కంఠరవముతో జరిగిన వర్తమానమును విశదీకరించి, సీతా రామ లక్ష్మణులు పంచవటమున నుండుటం జెప్పిన విని ఖరుండు మండిపడి, యంత కాకాసురులైన పదునల్వురు భయంకర రాక్షస వీరులం బిలిచి “పంచవట స్థలమున నిరువురు నరాధములు నొక్క యువతియును వచ్చి నివసించి యున్నవారంట మీరచ్చోటికరిగి నాచెల్లెలి కింతటి భంగపాటుం గావించిన యాదుష్టులను వధించి మీరీమెకు ప్రీతిం బొనరింపుండు. శీఘ్రముగా జనుం”డని యాజ్ఞాపించుటయు దానవ వీరులు పదునల్వురునుం గదలి శూర్పణఖ దారింజూపునదియై ముందు జనుచుండ, దాని పిఱుందన నడచి రామలక్ష్మణు లున్నచోటికరుదెంచిరి.

కొంతదూరమున వచ్చునపుడే రఘువల్లభుండు శూర్పణఖ వెంట వచ్చుచున్న దైత్యునింజూచి. సౌమిత్రింబిలిచి వారినతనికింజూపి లక్ష్మణా! కంటివా? మనచే పరిభవింపఁబడి యిచ్చోటనుండి పోయిన పాపాత్మురాలైన రక్కసి తన వారియొద్ద కరిగి వారిని మనపైకిం దోడ్కొని వచ్చుచున్నది సుమా! మనమింక నూరకుండ కూడదు రమ్మని విశిఖములును, చాపమునుం బుచ్చుకొని, సీత వెఱగొందునని తలంచి యాదైత్యులు పర్ణశాలయొద్దకు వచ్చుటకు మున్నుగానే కొంతదూరము వారి కెదురుగాం జని “ఓ రాక్షసులారా! మీరిచ్చోటి కేల వచ్చితిరి? మీకు ప్రాణాపేక్ష గలిగియున్నచో మరలి మీయున్నచోటునకు శీఘ్రముగా నరుగుండు. నా పలుకులు వినక యుద్ధమునకు బూనుదురేని మీ రింక బ్రతికి పోవఁజాలరు. మొదట జెప్పితిని. మీయిష్టం”బని చెప్పెను.

—(*) రాముఁడు ఖరుండు పుత్తెంచిన దైత్యుల జంపుట. (*)—

ఆ రాక్షసుండు రామచంద్రుని పలుకులను లెక్కసేయక మహోగ్రముగా నార్చి యదలించి "ఓరి నరాధమా! రామా! నీ వెంతటివాఁడవు? లోక భయంకరుండైన ఖరాసురుని పలు పోరుల జయమొందఁజేసి యతని మన్ననకు పాత్రులమై విఖ్యాతినిఁ జెందియున్న మాకు నీవు లెక్కింపఁ దగినవాఁడవా? దేవతలు సయితము మమ్ముఁజూచిన భయమొంది గడగడ వడఁకుదురు. నీ సామర్థ్యమును పరాక్రమమును నెట్టిదియో చూచెదముగాక" యని బింకపు మాటలు బలుకుచు డాయ నరుదెంచి యట్టహాసములును, పెడబొబ్బలును, నతిశయింపగా తమ చేతులఁబట్టియున్న శూలములంద్రిప్పి ప్రయోగించిరి.

ఇవ్విధమున పదునలువురును నొక్కసారి పదునాలుగు శూలములు వైచుటయు, దాశరథి పదునాలుగు కత్తివాతి యమ్ములు నిగిడించి యా శూలముల నన్నింటిని ఖండములుజేసి నేలఁబడునట్లు గావించెను. తమ యాయుధములు తునియుటయు, వార లాగ్రహమునించి, నెండియుం జండకాండములను ప్రయోగించుచున్న జూచి వానినెల్లం గనిమి యతిశయించిన కోపమున జానకీపతి యత్యుగ్రములగు పదునాల్గు బాణము లేక కాలమున యా దనుజులపైఁ బఱపిన వానిచే తూలి వార లొక్కమాఱుగా, దేవేంద్రుని వజ్రాయుధముచే ఱెక్కలు తెగి నేలఁగూలిన పర్వతముల చందమునఁబడి నోళ్ళనుండి నెత్తురుఁ గాఱుచుండగా ప్రాణములు విడచిరి.

అంతట శూర్పణఖ తన యన్నచేఁ జంపఁబడిన రాక్షసవీరులు నేల గూలుటంగాంచి భయమునొంది యార్చుచు బిగ్గఱ రోదనముఁ జేయుచు ప్రచండ వేగమునఁ బఱచిపోయి ఖరుని ముందరనిలిచి వెక్కి వెక్కి యేడ్చుచున్న చెల్లెలింగాంచి యతం డాశ్చర్యమంది "పడతీ! ఇది యేమి? మరల నిటుల నేడ్చుచు వచ్చితివేల? నీకు పరిభవము గలిగించిన వారిగర్వము నడంచుటకై మిక్కిలి బలియులం బంపినాఁడనుగదా! వారు నేను చెప్పినట్టు చేయలేదా? ఇచటనుండి పోయినంతట నచ్చోట నెట్లు జరిగినదియుం దెలియకున్నది వారలేమైరి? ఏమిచేసిరి? ఊఱట నొంది శోకము నడంచుకొని జరిగిన వర్తమానము నెఱింగింపు" మని యడిగిన యా దుష్టచిత్త యన్నంజూచి "అయ్యో! ఏమిచెప్పుదును? నీవు పనిచిన పదునలువురు శూరులను నొక్కసారిగా యా రాజన్యుఁడు వాడి

తూఁపులఁ బ్రయోగించి నిమిషకాలమున నేలఁబడఁ గూల్చెను. ఇంక నీ వెందఱను బంచినను బ్రయోజనములేదు. కార్చిచ్చుపైఁబడిన మిడుతల పగిది నమ్మనుజేంద్రుని బాణార్చులచే ద్రుగ్గుదురుగాని బ్రతుకఁజాలరు. ఓ యన్నా! అతఁ డద్వితీయ పరాక్రమవంతుఁడు. సామాన్యులతని నెదిరించుట కష్టము. త్వరితముగా నీవే కదలి చని శక్తిగలదేని యా రాజనందనులఁ బరిమార్చి, నాకు గలిగిన పరిభవ దుఃఖమును మాన్పుము. చాలవైతివేని యింక నీవీ జనస్థానమున నుండక మఱి యెటకేనియుం బొమ్ము. ఉండినందున కలిగెడి లాభమెయ్యది? అదియును గాక నేను నూతనమైన వృత్తాంతముం దెలిసికొంటిని. ఏమనగా, అయోధ్యాపతియైన దశరథుండను రాజునకు వారు నందనులఁట. రామ లక్ష్మణులనెడి యభిదానములు గలవార లిరువురును రాక్షస పదార్థముగావచ్చి యున్నారఁట. ఆ రాజపుత్రులు సామాన్యులుగారు.

నీప్రాపు తమకు గలదనెడి ధైర్యముతో దైత్య వీరులు గర్వమున బోయి మ్రగ్గిరి. నేనన్నో యిటుల నవమానితనై దుఃఖించుచున్నాను తోడఁబుట్టిన దాననైన నాయందుఁగల ప్రీతిచేతనైనను నీవు వారిని మార్కొనవలదా? ఊరక నిరుపయోగ ప్రసంగముఁ జేయుచుండిన గలిగెడి దేమియున్నది? ఇంతవరకును నీవు మహాశూరుండవని యెంచుచుంటినిగాని నీ శక్తి యత్యల్పమగుట నిపుడు తెలిసికొంటిని. కాదేని యిరువురు మనుష్యులకు వెఱచి వారిని సంహరింప లేక నీ విట్టూరకుండుదువా? దానవుల వధించుటకొఱకే వచ్చిన యారాజపుత్రులు తాము వచ్చిన పనిని చేయక మిన్నకుండుదురా? పేద మునులపై చెలరేగి వారిని నానాబాధలను బెట్టుట యొకటియకాని నీవలన మఱియెయ్యది దొక్కటియును లేదు. లోకువయని జడదారుల నలంచు నీప్రతాపము మహాశూరులైన దశరథనందనుల ముందు చెల్లునా? అది వట్టితలంపు. నీశక్తియు సాహస విక్రమములును నిపుడు స్పష్టమయ్యె. సర్వమునుం దెలిసికొంటిని. ఇంక వేయి మాటలాడినను నేమిలాభము? అయ్యో? నేనివ్విధమున దిక్కులేనిదాన నైతినిగదా నాగతియేమి కావలయును? ఇట్లు దుఃఖించి యవమానమునకు లోనై చావవలసిన దాననేగాని వేఱు మార్గము లేదయ్యె. ఏమి చేయుదును? ఆడుదానిని తోడఁబుట్టిన దానిని యీతీరున భంగపఱచిన మనుజునకు వెఱచి వానికిందగిన శిక్షఁజేయ జాలనివాఁడు లోకమున నీవుదక్క మఱి యేకాంత సహోదరుండు

మిన్నకయుండును? ఎవ్వని మనం బెరియకుండును? కటా! ఇక్కైతిగదా! ఈస్థితిలోనుండు దుఃఖాక్రాంతను నన్ను చూచుచున్న నీశౌర్యము? నీబల మెంతమాత్ర మనవలయును?" అని తోఁచిన ట్లంతయుం దనయన్నకు రోషము బుట్టునట్లు పలికి గట్టిగా రోదనముఁ జేయుచు, నేలఁబడి పొరలుచున్న, చెల్లెలింజూచి మహా కోపమునుబొంది కన్నుల నిప్పు లొలుకగా బొమలు ముడివడుచుండగా క్రోధాధిక్యమున మైజమర్పగా, పండ్లు పటపట గొఱుకుచు కాలావస రాంత కాకారుండై ఖరుండు శూర్పణఖ కిట్లనియె.

"ఏమిరా! అతివా! ఇట్లు శోకింపనేమిటికి? నీకు దిక్కులేక పోయినదా? ఎంతమాట బలికితివి? నీయన్నయైన నాముందట యీరాముఁడు నిలువఁగలఁడా? వాఁడెంతటివాఁడు. వాఁడెవ్వఁడు? ఇంద్రాది దిక్పాలకులలోనను, గరుడ గంధర్వ విద్యాధర ప్రముఖులైన వారిలోనను, నెవ్వనికి సాటియైనవాఁడని తలంచితివి? అటువంటివారలు సయితము మదీయ నామస్మరణ మాత్రమున వెఱచి పాదాక్రాంతులగుచుండుట నెఱుంగవా? చూడలేదా? ఇంక నీశోకముఁ జాలింపుము. త్వరితముగాఁబోయి యీ మనుష్యాధములం ద్రుంచి నీకు సంతోషముఁ గలిగించెదను లెమ్ము లె"మ్మని చెప్పిన యీచెడిపెరక్కసి యీ పలుకుల కలరి ఖరునితో అన్నా! త్రిజగద్విఖ్యాత పరాక్రమోపేతుఁడైన పంక్తివదనుండు భవత్సహాయముఁ గలుగుటనేగదా? సకల దేవతలను నిర్జించి దిగ్విజయముసేసి కీర్తిప్రతిష్ఠలు గడించె. తలంచిన యెడల నసాధ్యమైన కార్యము. నీ కేదియునులేదు. ఎవరు లేని కడిమి మెఱసి యొంతటి మహాత్కార్యమైనం జేయఁగలవాఁడ వనుట నే నెఱుంగనే? వైళమున యీ మనుజాధిప నందనుల గర్వమునడంచి విజయమును బొందు"మని యగ్గించి పలికెను.

అంతట ఖరుఁడు తన తమ్ముఁడును సేనాపతియునగు దూషణుండను వానిఁబిలిచి "ఇప్పుడతని, మా యా వర్తులును, కాలమేఘాకారులును, ధైర్య శౌర్య బల సాహస విక్రమములఁ బేరునొందినవారును నైన మొనగాండ్రఁ బదునాలుగువేలసంఖ్యగల రాక్షసులను సకల విధాయుధాది సాధనములతోడ సిద్ధము గావించి యొక రథమును పన్నించి నా స్వాయత్తముగాఁ గొనిర"మ్మని యాజ్ఞాపించిన, వాఁడు నిజాగ్రజుని

మాటచొప్పున సర్వ సన్నాహములును గావించి వచ్చి తద్వర్తమాన మెఱింగించె.

ఖరుం డంత సమర సన్నద్ధుండై చనుదెంచి, సువర్ణమయమును, రత్నస్థగితమును, రమణీయ పతాక శోభితమును, బహుతర నానావిధాయుధ యుక్తమునగు రథం బారోహించి, తమ్ములైన దూషణ త్రిశిరులును తమ తమ తేరులెక్కి యక్కజముగా బలములఁగూడి యత్యుత్సాహమున వెడలుటయు, మేటిరక్కసులు దనకు చుట్టును గాపుగా వచ్చుచుండ, యా సేనకు ముందు శూర్పణఖయుం బోవఁదొడఁగె.

—(*) ఖరాది రాక్షసులు రామునితో యుద్ధమునకై వచ్చుట. (*)—

ఆ సమయమున భూమి కంపించె ఖరుని బలముల కెదుట గుడ్లగూబ లరచుట కారంభించె. రక్తవర్షము గురిసె, పిడుగులు పడఁజొచ్చె చుక్కలురాలె, సూర్యునకు చుట్టును పరివేషం బేర్పడియె. పట్టపగలు నక్షత్రములు గనుపట్టఁ దొడంగె. టెక్కెముపై గద్దకూర్చుండె. ఉన్నట్లుండి ధ్వజము విఱిగికూలె. రథమునకుఁ గట్టిన గుఱ్ఱములు మ్రొగ్గె. నలుదిక్కుల నెత్తురుగావు గ్రమ్మె. ఆకాశమున చిత్రరూపములతో మేఘసముదయముతోచె. ఎదురుగాలి వీవసాగె. వఱడులు వాపోవుచుండె. చీకటులు గ్రమ్ముకొనియె. ఖరుని యెడమకన్నును నెడమభుజమును నదరఁజొచ్చె. నతని కన్నులనుండి నిష్కారణగా నీరుగాఱఁ దొడంగె. మఱియు నిట్లు మహోత్పాతములు దోఁచుచున్న చూచుచు, జడియక నవ్వుచు, వీరాగ్రేసరుండైన యతండు వానిని గణింపక రాక్షసులతో నిట్లనియె.

“దైత్యులారా! ఈ దుర్నిమిత్తము లెన్నిదోఁచిననేమి? వీనినిగని వెఱచి నేను మరలిపోవుదునా? క్రూరములైన నా బాణము లా దశరథుని కొడుకులపైఁ బ్రయోగించినపు డిటులనే చుక్కలు పడగలవు. మృత్యువునకు సయితము మచ్ఛరములు మృతిని గలుగఁజేయును. ఐరావతము నెక్కి దేవగణములతోఁగూడి యింద్రుండు వజ్రాయుధమును పూనివచ్చినను, యుద్ధమున నాచేఁ జచ్చును. ఇటువంటి ప్రతాపవంతుఁడనైన నాముందట నరు లెంతటివారు?” అని వీరాలాపములు సెలంగ ఖరుండు సమరకేళీ కుతూహలమున, శ్యేనగామియు, పృథుగ్రీవుండును,

యజ్ఞశత్రుండును విహంగముండును, దుర్జయుండును, గరవీరాక్షుండును, బరుషుండును, గాలకార్ముకుండును, మేఘమాలియు, మహామాలియుఁ సర్పాస్యుండును, రుధిరాశనుండును, ననెడి పన్నిద్దరు మేటిరక్కసులు కెలంకులను, త్రిశిరుండు ముందటను, వెనుక దూషణ పురస్సరముగా, స్థూలాక్షుండును, మహాకపాలుండును, ప్రమాధియు, ననువారును జనుదేరగా నడిచి పంచవడికి వచ్చుటయు, తత్సైన్యములను దవ్వులంగాంచి రామచంద్రుండు సౌమిత్రింబిలిచి "లక్ష్మణా! చుప్పనాతి ప్రిబల సైన్యముం దెచ్చుచున్నది. ఘోర సంగ్రామము ప్రవర్తిల్లంగలదు. జనకనందన యుద్ధమునుచూచిన వెఱగుపడును కావున నీవు సీతం దోడ్కొనిపోయి సమీప పర్వతగుహాలో యుండుము. నేను వీరిని నాశముఁ గావించెద. సంగరాపేక్షతో మఱి యేమియు నడ్డము పలుకవలదు పొ"మ్మని చెప్పిన సౌమిత్రి భూపుత్రినిఁ దోడ్కొనిపోయి పర్వత గుహలోన నామె నుండఁజేసి తాను ధనుర్ధరుండై రక్షించుచుండె.

ఐదవ ప్రకరణము ముగిసెను.



# శ్రీ రామ వన వాసము.

వచనకావ్యము.

ఆఱవ ప్రకరణము.



ఖరాసురుండు ప్రబల సైన్య సహితుండై యివ్విధమున వచ్చుటయు రాఘవేశ్వరుండు ధనుర్బాణములు ధరించి మార్కొని రాక్షస దళముపై నడరి కొండలంబోలు గజ సమూహములను, మేఘ పటలి

—(*) శ్రీరాముండు రాక్షస సైన్యంబుల నుఱుమాడుట. (*)—

వంటి తేరులను, సముద్ర తరంగముల కెనయైన తురంగములను, మదించిన దంతావళముల వంటి వీరభటులనుం పిలిచి చెండాడుటయు దైత్యులు వివిధాస్త్రములును కుంత, తోమర, ప్రాస, ఖడ్గాది సాధనములునుం బ్రయోగించుచుండ వానినెల్లం దుత్తునియలు గావించి, మఱువులుసించియు, మర్మములూడ్చియు, శిరములు ద్రుంచియు నంగములు ఖండించియు, బడల పడంజేయుచున్న దాశరథి ముందు నిలువంజాలక రాక్షసులు చెదరి నలువంకలకుం బోవుచుండ, తద్విధముంజూచి ఖరుండు ముందువచ్చి రఘునాయకు నెదిరించి పోరం దొడంగె.

అప్పుడు రామచంద్రుండు విజృంభించి నిజ ప్రతాపం బేర్పడ ప్రచండ మార్తాండుని కైవడి వెలుంగుచు, రయము మెఱయ, మేటి రక్కసుల నుక్కడంగించి, పోతరమున నెదిరించిన, త్రిశిరుజంపి, దూషణుని రూపడంచి ససైన్యముగా ఖరుని సంహరించి, వృత్రాసురుని వధించిన పురందరుని చందమున జయమునొందుచున్న తేజరిల్లు దేవ ముని గణములు దుష్టాత్ముండైన ఖరుండును వాని యనుచరులు మడియుట కెంతయుం బ్రమోదమునుజెంది రఘునాయకునిం బొగడి యాశీర్వదించిరి. పిమ్మట సీతాలక్ష్మణులు నతనిం జేరవచ్చిన వారలతోడ గూడి పర్ణశాల కరుదెంచి యిష్ట వినోదములనుండె.

కౌసల్యా నందనునిచే పూర్వోక్త ప్రకారమున రాక్షసబలములు మడియుటయు, హతశేషులు దిక్కఱి నలుదిక్కులకుం బాఱిపోవుటయు,

నందు చావక తప్పించుకొనిన యకంపనుం డనువాఁడు భయాకులమ్మానసుండై శీఘ్ర గమనముల లంకాపురమునకుఁ బోయి దశాననుని

—(*) అకంపనుండు రావణునకు ఖరాదుల వృత్తాంతంబుఁ జెప్పుట. (*)—

జూచి మ్రొక్కి యిట్లనియె. "లంకేశ్వరా! దశరథుండను వానికొడుకులు రామలక్ష్మణు లనువారు తండ్రి పంపున నయోధ్యనుండి వచ్చి దండకాటవిఁ జొచ్చి పంచవటమున పర్ణశాల గట్టుకొని వసించుచు, శూర్పణఖను ముక్కు సెవులుంగోసి, సకల సైన్య యుతముగా ఖరదూషణ త్రిశిరుల సంహరించిరి. మునులకు ప్రియం బొనరించువారై రాక్షస సంహారమునకుం గడంగి యెదురులేని కడిమిమెఱసి వర్తించుచున్నారు. వారిలో పెద్దవాఁడైన రాముఁడనువాఁడు నిరుపమాన పరాక్రమవంతుఁడు, బహుశాస్త్రవేది, యతని నెదిరించుటకు పురహరాదులకైనను శక్యముగాదు అనిన నది యతిశయోక్తి కానేరదు. నిరుపమాన శౌర్య సంపన్నులైన మన ఖరదూషణ త్రిశిరులను, పదునాలుగువేల రాక్షస వీరభటులను, రథ గజ తురంగములతోడ నతం డొక్కండె రూపు మాయించె. నీ వారిం జంపి యపకృతిఁ గావించిన యా రామునిపై పగదీర్చుకొనఁ దలంతువేని యతని నెదిరించి యుద్ధముఁజేసి జయించుట కష్టముగాని యొక యుపాయమునఁ బొలియింపవచ్చును. ఎట్లనగా, రాముని వెంట వచ్చి యున్న యతనిభార్య మిక్కిలి చక్కనిది. ఆ సుందరాంగి నెట్లైనను మోసపుచ్చి నీవు హరించినయెడల, భార్యను గోలుపోయిన దుఃఖమున రాముఁడు పొలియఁగలండు. అతని తమ్ముఁడునుం దన యన్నవలె తానునుం జచ్చును. ఇదియ తగిన యుపాయము. ఇటులచేసి నీ యనుజుల జంపిన విరోధమును వారియాత్మలకు శాంతిగలుగఁదీర్పు "మని చెప్పెను

ఖరాదుల మరణ వృత్తాంతమును విని రావణుండు దుఃఖించి రామునిపై మహాగ్రహమును బొంది "బళీ! ఆరాముఁ డంతటివాఁడు? మదీయ పరాక్రమ సామర్థ్యముల నెఱుంగఁడు గాఁబోలు. మంచిది వానికి దగిన ప్రాయశ్చిత్తముఁ జేసినంగాని మదీయ చిత్తమునకు శాంతి గలుగదు. అకంపనా! నీవు చెప్పిన యుపాయము కడు మేలైనది. యుద్ధముఁ జేసి గానిఁ జెందుటకన్న నిది సులభమైన మార్గము. నీవు నాయందు మిక్కిలి భక్తిగల మిత్రుఁడవుగాన, ఇట్టి మంచి నెరవుఁ బలికితివి. ఇపుడ యా రాముని దేవిం దెచ్చుటకు తగిన యత్నముఁ గావించెద" నని యతని పొమ్మని తాను తన మిత్రుండును, మాయా వర్తనుండునునైన మారీ

చుని యింటికరిగి యతనిచే సత్కృతుండై, ఖరదూషణ త్రిశిరులు మడి యుటయు, తత్ప్రతి క్రియగా రాముని దేవిందే దలంచుటయుం జెప్పి తత్కార్యమునకు సహాయముగా తనవెంట రావలసినదిగా కోరెను.

ఆ వృత్తాంతమును విని మారీచుండు వెఱపునుబొంది "రావణా! నీ యత్నమును విడువుము. ఆ రాముని నే నెఱుంగుదును. అతని సామర్థ్యం బద్వితీయమైనది. ఇంద్రాది దేవతలు సయిత మతనికి సమానులుగారు. వృథాప్రయాసయేగాని నీకిటుల జేయుటవలన లాభము గలుగదు. ఖరాదుల నొక్కండ నిర్జించుటవలననే యవ్వీరుని పరాక్రమము నెఱుంగవచ్చును. కుడిచి కూర్చుండి లేని విరోధమును దెచ్చి పెట్టుకొననేమిటికి? నా మాటలు విని కోపము నుపసంహరించి స్వస్థచిత్తుండవై యుండుము. ఈపని నీకు క్షేమకరమగునది కా"దని పలుదెఱంగుల హితము సెప్పి, రామచంద్రుని దివ్యాస్త్ర పాండిత్యమును మహిమయు, ప్రతాపమును వర్ణించి, కొనియాడి శాంతచిత్తుని గావించుటయు, దశముఖుం డతని వాక్యమువలన కోపమువీడి తన యత్నముదు మాని మందిరమున కరిగి నెమ్మది నుండెను

అట్టి సమయమున మహా బలవంతులైన ఖరదూషణాదులు బలములతోడ సంగర భూమిం గూలుటంగాంచి శూర్పణఖ యత్యంత భయ విషాదముల మనము గలంప తల్లడిల్లి, చేయునదిలేక తద్వృత్తాంతమును లోక విద్రావణుండైన రావణున నెఱింగింపనెంచి మహా నాదమున రోదనముంజేయుచు పాఱతెంచి లంకాపురముసొచ్చి, మంత్రులును, రాక్షస వీరులునుం గొలువ బేశాలగమునన్న పంక్తి ముఖుని కొలువునకుంబోయి తన వికృత రూపమునుగని రాక్షసులెల్లరు నాశ్చర్యమును బొందుచుండగా నేడ్చుచు రావణునింజూచి పరుష భాషణముల నిట్లనియె.

—(*) శూర్పణఖ తన పరిభవంబును రావణునితో చెప్పుట. (*)—

"రావణా! నీవు నీ ప్రియ మంత్రులతోంగూడి యివ్విధమున సంతోషమున నుండిన యంతియ చాలును, తక్కిన నీవారెవ రెటులబోయినను విచారింపవుగదా! వారెటులబోయినను యాజోలి నీ కేమిటికి! భోగ ప్రియులు స్వజనుల కష్టసుఖములను విచారింపుదురా? అయ్యో! మాబోంట్లకు దిక్కెవ్వరున్నారు? కైలాసము నెత్తిన నీ భుజాబలము పెంపును, ముల్లోకములందునుం జెల్లుచుండు నీ యాజ్ఞయును, దిక్కు

తెల్లను గెలిచిన నీ విఖ్యాతియు, నంతటను నిండియున్న నీ పేరు ప్రతిష్టలును, వమ్మైపోవగా, నీ సోదరినైన నన్ను మనుజుఁ డొక్కఁడివ్విధమున పరిభవించి దుఃఖ మొందించినది చూచుచు, వాని నాము మడఁగింపక యూరకున్న వాఁడవు. నీ ప్రతాప మేమిచేయుటకు? నీకు చెల్లెలనని చెప్పుకొనుటయే నాకు లజ్జగాయున్నది. అకటా! ఎక్కఁడియన్న, యెక్కఁడి తోడబుట్టువు'' రెవ్వరి కెవ్వరు గలరు? ఇందుండియు నాగతి యిట్లె నడిగదా!" యని యేడ్చెను.

వికారరూపమునయున్న సోదరింగాంచి రావణుం డధికమైన కోపమును వ్యసనము జెంది "చెల్లెలా! దుఃఖము నడంచుకొనుము. ఎవఁడు నిన్ను పరిభవించి యిట్టుల జేసెనో దానిం జెప్పుము. ఆ దుర్మార్గుని గర్వమునడంచి వాని రూపు మాయఁజేసి నీకు సంతుష్టిఁ గలిగించెద'' నని యడిగెను. అపు డది యన్నతో, "లంకేశ్వరా! సదా భోగముల నలవాటుపడి తగినవారల బనిచి వేగు లరయకున్న కారణమున నిట్టి దుఃఖములెల్లఁ గలుగుచున్నవి సుమా! వినుమ"ని, రామచంద్రుఁడు సీతాలక్ష్మణ సహితుఁడై దండకారణ్యమున కరుదెంచి పంచవటియందు నివాసం బేర్పరచుకొని, మునిజనులకు ప్రియముఁ జేయువాఁడై దైత్యసంహారముఁ జేయుచుండుటయు, తా నచటకిపోయిన తన ముక్కు చెవులు గోసి విరూపిం జేయుటయు, తద్వృత్తాంతము నెఱింగి వారల సంహరించుటకు ఖరాదులుపోయి బల సహితముగా మడియుటయుం జెప్పి "రావణా! అతఁడదాననని యారాముఁడు కరుణించి నన్ను చంపక విడిచిపెట్టిన కతన బ్రతికివచ్చి వృత్తాంతమును నీకుఁ జెప్పఁగల్గితిం జుమీ! అతనిప్రతాపమును, నస్త్ర ప్రయోగ కౌశలమును నత్యధికమైనది. ఎదిరించి యుద్ధముఁ జేయుటకు సాధ్యముకాదు. ఆరాముఁ డొనరించిన యకృత్యమునకు ప్రతిక్రియఁ జేయఁ దలంతువేని యతని భార్యను త్రిలోక సుందరియైన సీతను దెచ్చి యిష్టభోగముల ననుభవింపుము. ఆ దుఃఖముచే నతండును వాని తమ్ముఁడును ప్రాణములు విడువఁగలరు నా మనసునకు సంతుష్టి గలుగుట మాత్రమేగాక, నీకును నిదియొక మేలుకార్యముగా గలదు" అని బోధించెను.

తన చెల్లెలు చెప్పిన యుపాయమునకు రావణుండు మిక్కిలి సంతోషించి మోహావశుండై యట్లే చేసెదనని శూర్పణఖకు తృప్తి గలుగంబలికి, మంత్రులతో యోజించి, విక్రమించి రామునితో పోరు సల్పు

టకంటె వంచనోపాయమున సీతం దెచ్చుటయ కార్యంబని నిశ్చయించి కొలువువిడిచి రథ మాయత్తముం జేసి తెమ్మని సూతున కాజ్ఞాపించి,

—(*) రావణుండు సీతను దెచ్చుటకై పోవుట. (*)—

వాఁడటుల గావించుటయు, సకలాయుధ భరితంబైన యాకాంచన రథం బారోహించి, ప్రచ్ఛన్న మార్గమున వెడలి వియన్మార్గమునఁ బోవుచు, సముద్ర మధ్యమునం దచ్చటచ్చటంగల యనేకద్వీపములు గనుం గొనుచు నొక్కచోట బహు విహంగకుల సంకులమును, విటప ప్రకారాంత రోదోంతరాళమును నగు నొక్క పురాణ వటోత్తమము సూతునకుం జూపి "సారథీ! తొల్లి గరుడుం డమృతమునకుం బోవుచు నీ గజ కచ్ఛపముల భక్షించుటకు శతయోజన విశాలంబైన దీని శాఖపై వ్రాలి నిడుటయు భారమున గా కొమ్మవిఱిగె. అంత నక్కొమ్మయందు తలక్రిందుగా వ్రేలుచు తపముఁ జేయుచున్న వాలఖిల్యాది మునులాక్రోశించుటయు విని తచ్ఛాఖను క్రిందఁ బడనీయక వైనతేయుండు గజకచ్ఛప సహితముగా చరణములతో దృఢముగా బట్టుకొని, జవమున తండ్రియైన కశ్యపుని పాలి కరిగి యా వృత్తాంతముఁ జెప్పిన యమ్మహాత్ముండు తచ్ఛాఖనుండి దిగునట్లు వాలఖిల్యాదులఁ బ్రార్థించిన వారట్లచేసిరి. అంత సువర్ణుండు జనకుని పనుపున యా శాఖను నిషాద మండలమున వైచి, హిమాచల తటమున గజ కచ్ఛపములం బెట్టుకొని భక్షించి చనియె. ఈ మహా వృక్షమునకు పేరు సుభద్రము" అని చెప్పుచు పోయి పోయి మారీచుని యాశ్రమము సొచ్చి రథముడిగ్గి జటావల్కల ధారియైయున్న యతని యొద్దకుఁబోయిన, మారీచుండా రాక్షసేశ్వరుని తగిన భంగి మర్యాద లొనరించి సుఖోపవిష్టునిఁజేసి "లంకేశ్వరా! ఇంతలో క్రమ్మఱ వచ్చిన కార్యమెయ్యది? ఏమి విశేషమో యెఱిగింపు" మని యడిగిన రావణుండు శూర్పణఖ చెప్పిన వృత్తాంతం బతనికి సవిస్తరంబుగా దలంచి యంతయుం జెప్పి నిజోద్దేశము నెఱింగించి "మిత్రమా! ఆ రాముఁడు నా చెల్లెలిని పరిభవించి ఖరదూషణ ప్రముఖుల నిరవశేషముగాఁ జంపి, నిఖిలలోక జయుండనైన నాకింతటి యెగ్గు గావించినాఁడు. కాఁబట్టి యా క్షత్రియాధముని భార్య నపహరించి యా దుఃఖముచే యతండు కృశించి చచ్చునట్లు చేయఁదలంచితి. దీనికి నీవుసహాయుఁడవు గావలయును. మాయా విద్యలయందు నిన్ను మించువాఁడు లోకమున నింకలేడు. నీవు కడుసమర్థుఁడవు. ఏలాగున యా రాముని

వంచించి యతనిభార్యను గొనిరాదగునో దానిని యోజించి తగినయుపాయము జింతించి మదీయ యత్నము సఫలము గావింపు''మని పలుకుటయు, మారీచుం డతని పలుకులువిని మేను వడంకగా, గుండెలు తల్లడిల్లుచుండ నాలుక తడియాఱ మైఁజెమటలూర, మించిన భయమున నోటమాట వెడలక కొంతవడి పెదవులు దడపుచు నట్టెయుండి ప్రయత్నమున తొట్రుపాటు నొక్కింత యడఁచుకొని దీనాననుండై యిట్లనియె.

—(*) మారీచుండు రావణునకు హితంబుఁ జెప్పుట. (*)—

“ఓయిరావణా! ఇంతకుమున్ను నేను చెప్పిన మాటలను మఱచి నీవు మఱల వచ్చుటఁ దలంపగా మిక్కిలి యాశ్చర్యముగా యున్నది. ఆ రాముండు సామాన్యుండని భావించి యిట్టి తలంపుఁ గొంటివని తోఁచుచున్నది. అతఁ డద్వితీయ పురుషుఁడు. అసదృశ పరాక్రమవంతుఁడు. బహు శాస్త్రవేది, యా మహాత్ముని శక్తి నేను బాగుగా యెఱింగియున్నాను. విశ్వామిత్రుఁడు యాగముఁ జేయు కాలమున నేనును సుబాహుండును విఘ్నం బొనరింపఁ బూనుటయు, నొక్కకోలన సుబాహుం దుంచి మఱియొక్క శరమున నన్ను సముద్రమధ్యమునం బడునట్లు చేసెను. ఇది యతని పిన్ననాఁటి కార్యము. ఇపుడన్నో లావును నేపునుం గలిగియున్నాఁడు. అతనిం జెనకిగాని, యేదేనియు నపకృతిం జేసికొని బ్రతికి వచ్చుట దుర్లభ కార్యము. ప్రభువులుగా యుండు వారియొద్ద దుష్టులుచేరి సమయోజితములైన మాటలుచెప్పి వారి తలంపును మార్చుచుందురు. అట్లే యెవ్వఁడో యనుకూల శత్రుండు నీకిటువంటి బుద్ధి గలుగునట్లు చేసెనని తోఁచుచున్నది. కామవశుండవై నీవును హానివృద్ధుల నెంచనైతివి. ఇది లగ్గుగాను దేవతలు వెట్టిచేయుచుండగా సకల భోగములును ననుభవించుచు, రాజ్యమును నెమ్మదిని పాలనముఁ జేయుచుండ లేక దురాలోచనఁ గావించి, రాముని సత్వము మానుష సత్వముగా నెంచి యతని దేవిం జేకొనఁ దలంచి వచ్చినాఁడవు అయ్యో! రాక్షసకుల వినాశకాలము సమీపించినది కాఁబోలు. దేవ ప్రార్థితుఁడై శ్రీమన్నారాయణుండు దశరథుని సుతుండై జనియించి, కైకేయి వరము నెపముగా రక్షోవధార్థం బరణ్యమునకు వచ్చియున్నాఁడు. ఇది నీవెఱుంగకున్నాఁడవు. లోకమంతయు గబళింపఁగల ఖరాదుల నొక్కఁడ చంపుట నెఱిఁగియు, నతనితోఁడ పగసేయ దొడరుటకంటె యవివేకముగలదా? కాలము దీఱిన రోగి కౌషధము లెవ్వియుం బ్రయో

జనముగా నట్లు నాబుద్ధి నీకు హితముగాఁ దోఁచకున్నది. ఇందువలన నీకూ మేలు గలుగనేరదు. కార్చిచ్చుపైఁ బడఁబోవు మిడుతల చందమున మన మా రాముని కెగ్గుచేయఁ బోవుటయని తలంపుము. సౌఖ్యమున నుండఁ గోరితివేని మిన్నక లంకాపురమున కరిగి యెప్పటి చందమున నెమ్మదినుండుము. దురాలోచన చేయవల"దని పలికిన దశకంఠున కతని మాటలు రుచింపక మహా గ్రహముఁజెంది యుగ్రముగా నిట్లనియె.

"ఆహా! మారీచా! హితుఁడవని సహాయము గోరివచ్చిన, నన్ను సంతసింపఁ జేయుటకు మాఱుగా నపరాధకుండైన యీ రాముని పెద్దఁ జేసి త్రిలోక భయంకరుండనగు నా మ్రోల నీలీల నిర్భయముగా బలుకక సాహసించి హితోపదేశము నొనరింపఁ దొడఁగితివి. భళీ! నిన్నే మన వచ్చును? ఖరాదులజంపి, శూర్పణఖ నవ్విధమున పరిభవించిన యీ దురాత్మునికి ప్రతిచేయక నేను దుర్బలుని చందమున నూరకుండుదునా? మారీచా! నీ హితోక్తులను నేను విననొల్లను. నా యిష్టానువర్తివై నాకు సహాయము జేసితివేని నిన్నెంతయు సన్మానముఁ గావించి మన్నించెద. అటులగాక నీతు లాడుచుంటివేని మదీయ ఖడ్గధారచే నీ ప్రాణములు గొనియెదను. ఇంతియకాని యీ రాముని భార్యం దెచ్చు తలంపు విడువఁజాల"నని తెంపున బలికిన విని మారీచుండు తనలో "ఇసీ! వీడు దురాత్ముండు. వీనికి చెడుకాలము సమీపించినది. కావున హితోక్తులు చెవుల కింపుగావు. ఇట్టివానిచేఁ జావనేమిటికి? ఆ రామునివలనఁ జచ్చిన పుణ్యలోకము గలుగు" నని యెంచి మాఱుమాటఁ బలుకక ప్రయాణం బయ్యె.

అంత వారిరువురును రామాశ్రమమునకుఁ బోవుచుండ మార్గమున రావణుండు మారీచునితో "నీవు మదీయ ప్రాణ మిత్రుండవు, పూర్వామాత్యుండవు. ఇక్కార్యము సిద్ధింపఁ జేసితివేని నీకు నారాజ్యంబున నర్ధభాగము నిచ్చెద"నని చెప్పి రాముని గికురించుటకును, సీతం దెచ్చుటకును ననేక విధములైన మాయోపాయముల నుపన్యసించుచు పెక్కు దేశములు గడచి చని దండకాటవిం జొచ్చి నానాతరు శోభితంబైన పంచవటీతీరమున రథావతరణముచేసి "మిత్రమా! ఇంక నీవు మన వచ్చిన కార్యమునుగూర్చి తగు తెఱంగున యుక్తిగావించి కార్యసిద్ధి నొందింపు"మని మారీచుని నియోగించెను.

—(*) మారీచుండు మాయాకురంగంబై రామాశ్రమంబునకుఁ వచ్చుట. (*)—

అపుడు మారీచుఁడు వైడూర్యమువంటి మోమును, తామరశే కులంబోలు చెవులను, మణిశిలాకలం బురణించు కొమ్ములును, ఇంద్రనీలముల కెనయైన గొరిజనులు, చంద్రబింబ కాంతి దనరుపొట్టయు, బంగారవు కేసరములవలె నొప్పురోమరాజియు, గలిగి చూచుటకు మిగుల వింతగానుండు మాయలేడి యాకృతిందాల్చి సీతారాములున్న పర్ణశాల ముంగజని, యట సంచరించుచుండెను. ఆ సమయమున పూవులుగోయుచు నచ్చోట దిరుగుచున్న సీతాదేవి యా మృగమునుజూచి యాశ్చర్యమునుబొంది దాని యందము నెంతయు మెచ్చి రామలక్ష్మణులం బిలిచి వారి కా మృగమును జూపుటయు కాంచి వారున్న నత్యాశ్చర్యమును బొందిరి

సౌమిత్రి దాని చందముఁ గనినంతట తనలో సంశయ మొంది "ఔరా! ఇటువంటి వింతయైన లేడి లోకమున నెందైన నుండునా? ఇది రాక్షస మాయగా నోఁపు నిజమైన లేడిగా"దనియెంచి యన్నతో "రాఘవేశ్వరా! ఇచ్చోట దైత్యులు పెక్కువిధముల మాయలు జేయుచుండుదురు, దీనిఁగనగా నిజమైన లేడియని తోఁచకున్నది. దుష్టాత్ముఁడైన రాక్షసుం డెవ్వఁడో మనల నేమరించి, చిక్కులంబెట్టుటకై యీరూపమునుదాల్చి వచ్చినట్లున్నది వేగిరపడి దీనినిఁ బట్టఁదలంపకు''మనిచెప్పెను. ఇట్లు లక్ష్మణుఁడుబలుకుచుండగా జానకీదేవి పతియొద్ద కరుదెంచి యిట్లనియె. "ప్రాణేశ్వరా! ఈమృగంబెంత సుందరముగా యున్నదో గనుము. దీనిని చూచినప్పటినుండి నా మనమున దీనిపై నధికమైన కోరిక పుట్టుచున్నది. నిన్ను నియమించగల దాననుగాకున్నను, నాకీ సారంగముపైఁ దొడరినప్రియాతిరేకముచే యడుగుచున్నాను. ఎట్లైననుదీనినిఁబట్టితెచ్చి నాకొసంగు"మని మిక్కిలి యాసక్తయై వేడుటయు, నామె యందుగల యనురాగ విశేషముచే నొల్ల ననఁజాలక రామచంద్రుం డయ్యిందువదనకు సంతోషము గలిగింపనెంచి "కాంతామణీ ఇది యెంతటిపని, యొక్కింత తడవు సైరించి యుండుము. పట్టియిచ్చెదనని దాని వంకం జన జూచుటయు, జనకనందన నాథునితో "హృదయేశ్వరా! ఈలేడిప్రాణముతో చిక్కక గ్రుంకులువెట్టి పట్టువడకున్నచో బాణాహతింగూల్చియైనం గొనిరమ్ము దానిచర్మంబైనను నందముగా నుండుటచే యుపయోగించు"నని చెప్పెను.

అయ్యవసరమున సౌమిత్రి విన్నఁబోయి తనలో "అయ్యో! ఇంతటి వెఱ్ఱితనముగలదా? ఇది యసురమాయగా నుండునని తలంపక మాయన్న కీసారంగమును బట్టుకొనుతలంపు జనించె. నామాటలులెక్క-సేయక జనకజకు ప్రియముఁ జేయువాఁడై యిక్కార్యమునకుఁ బూను చున్నాఁడని వగచి రామచంద్రుండు తలంచిన కార్యమునకు విఘ్నముగాఁ బలుకనోడి మిన్నకుండె. అపుడు రఘువరుండు తమ్ముని బిలిచి "లక్ష్మణా! మీవదినె మిక్కిలి యపేక్షతో తనకీమృగమునుబట్టి యిమ్మనుచున్నది. విల్లు నమ్ములు దెచ్చియిమ్ము. నేను మరలివచ్చువరకును భూపుత్రి నేమరక చూచుచుండు" మనిన లక్ష్మణుం డన్నతో "రామచంద్రా! ఇది రాక్షస మాయయేగాని మృగముగాదు. ఇటువంటిది భూలోకమున నుండఁబోదు. ఇంతకు పూర్వము బంగారులేడి నెచ్చటనైన నంగంటిమా? ఆఁడువారలు చపలమతులు, వారి పలుకులు విని మంచి చెడుగుల నెంచక యే కార్యమునకు బూనరాదు. ఇపు డీపనికి బోవల వ"దని పలికెను.

—(*) శ్రీరాముఁడు మాయలేఁడినిఁ బట్టబోవుట. (*)—

అని యిట్లు సౌమిత్రి చెప్పుటయు, రామమూర్తి యతనిఁజూచి "తమ్ముఁడా! భూపుత్రి యేదికోరిన నది తెచ్చి యిచ్చుచుంటిని, దాని వలన నయోధ్య లోవలెనే సంతోష చిత్తయై వర్తించుచున్నది. ఇపు డాసఁగొని యీ మృగమును దెచ్చి తన కిమ్మనిన, నిరాకరించుట యెట్లు? అది నిజముగా సారంగమే యైనచో యెట్లుఱుం బోనీయక తెచ్చి జనకజ కొసంగి సంతుష్టి నొందించెద. అటులగాక నీవుచెప్పిన చందమున రాక్షసుఁడే యీ రూపము ధరించి వచ్చి యున్నయెడల పొరిగొని మునులకు సంతోషమును గలిగించెద. ఎట్లును లాభమేయగును. నీవు జాగ్రతగా యుండు" మని చెప్పి విల్లును నమ్ములుం బుచ్చుకొని కురంగమును సమీపించి పోయిన, యది నిలువక దాఁటులువేయుచు, చిక్కినట్లుండి తప్పించుకొని పోవుచు పొదలు దూఱుచు, పిల్లుమేయుచు, కుప్పించి యెగిరి దుముకుచు, తలయెత్తి బెదరుచూపులు జూచుచు, చాలదూరం బెలయించి కొనిపోవుటయు రామచంద్రుండు దానిచేష్టల కాశ్చర్యమును బొంది యది ప్రాణముతోడఁ జిక్కదని నిశ్చయించి వధించు తలంపుల బాణములు వింట సంధించి పొంచి గుఱిచూచి ప్రయోగించెను.

—(*) శ్రీరాముఁడు మాయాకురంగమును వధించుట. (*)—

ఆవ్రేటు తగులుటయు నక్కురంగము ప్రాణము భరింపనోపక బిగ్గఱ హా! సీతా! "హా! లక్ష్మణా! యని యఱచి రాక్షసరూపమును బొంది నేలఁగూలి ప్రాణములను విడిచెను. అటులఁగూలి చచ్చిన మారీచుని ఘోరాకారమును చూచి రఘువరుండు విస్మయించి తనలో "నా తమ్ముఁడు చెప్పినది తార్కాణముగా నేర్పడినది. ఈదురాత్ముండఱచిన ధ్వనినివిని, సీతాలక్ష్మణు లెటుల భయమును బొందిరో, ఏమిగాఁ దలంచిరో తెలిసినదికాదు. మాయామృగాకృతిధరించి యీరక్కసుండింత దూరము నన్నుఁగొనివచ్చినాఁడు, ఇట్లు నేను వచ్చినంతట దైత్యులు నాతమ్ముని నెవ్విధమున మోసగించిరో, ఏమిచేసిరో" యని వగచి త్వరితగమనమున పర్ణశాలకు ప్రయాణంబై పోవఁదొడంగె.

అట పర్ణశాల యందున్న సీతాదేవి తమ్ము పేర్కొని యఱచిన యార్త నాదమును విని కలతనొందిన చిత్తముతో సౌమిత్రింబిలిచి దీనవదనయై "మరదీ! ఆయార్త ధ్వనిని వింటివిగదా! అది శ్రీరామచంద్రుని రావముగా తోఁచుచున్నది. ఒంటరియై కురంగము వెంటఁ దగిలిపోయెను. ఏమి యుపద్రవము సంఘటిల్లెనో తెలియలేదు. హాలక్ష్మణా! హా లక్ష్మణా! యను శబ్దము స్పష్టముగా వినివచ్చినది. ఇంక క్షణమైనను తడవుచేయరాదు. శీఘ్రముగాఁబోయి మీయన్నను దోడ్కొనిరమ్ము, లక్ష్మణా! నాహృదయము భయముచే తల్లడిల్లుచున్నది" యని తొందఱ పెట్టెను. ఇటుల కన్నుల నశ్రువులు గ్రమ్మఁగా దీనవాక్యమున మాటిమాటికిని వేగిరించుటయు, వివేక ధనుండైన రామానుజుండు చెదరని ధైర్యముగలవాఁడై యామెనుచూచి "తల్లీ! ఏల భయమును జెందెదవు మాయన్న కేకీడును గలుగదు. హరిహరాదులు నయిత మా మహాత్ముని నెదిరింపఁజాలరు. అతని కేభయమును గలుగునట్లు చేయువాఁడు లోకమున లేఁడు ఆ ధ్వని యెవ్వఁడో రక్కసుండొకఁ డరచుటయ కాని వేఱుకాదు. దీనికై నీవు మనమున చింతింపవలదు, ధైర్యమున నుండుము. ఇంకఁ గొంతసేపునకు రఘురామచంద్రుం డిచ్చటికి రాగలం" డనియెను.

సీత కతని మాటలచే ధైర్యము కలిగినదికాదు. ఆమె మిక్కిలి దిగులుతో "లక్ష్మణా! ఇపుడు నీవాలస్యముచేయకుము. రామచంద్రున కెద్దియో సంకటము కలిగియుండునని తోఁచుచున్నది. నాయెడమక

న్నను యెడమభుజమును నదరుచున్నవి. శీఘ్రముగాపోయి యావిషయ మెద్దియో కనుఁగొనుము. ఎంతయో కష్టము కలిగినఁగాని యారక రఘుకులుఁడటుల పిలువఁడు. నా మనమున తల్లడిల్లుచున్నది సుమా!” యనుటయు యా ధీరుండు చలింపక “అమ్మా! ఏల తొందరపడెదవు? నిప్పునకు చెదలంటని విధమున మా యన్నకే సంకటమునుం బొడఁరదు. తాలిమి వహింపుము. అమ్మహాత్ముఁడు సామాన్యుంఁడుగాఁడు. వేగిర పడి నేను నిన్ను విడిచిపోవుట న్యాయముగాదు. తాను వచ్చునంత వర కును జాగ్రతగాఁ గాచియుండ వలసినదని నన్ను నీకు గావలి యుంచి పోయెను. ఒంటరిగా నిన్ను విడిచిపోయినచో రామచంద్రుండు నాపై కినుకబొందును. ఇఁచుతడవు శాంతచిత్తవై తల్లడముడిగి యుండినచో రాఁగలఁడు. రామచంద్రుని కేదేనికీడు బొడరెనేని ముల్లోకములుం దలక్రిందులగును. సూర్యచంద్రులు గతిదప్పెదరు అట్లెప్పుడును గలు గనేరదు. ఆధ్వని రాక్షస మాయవలన గలిగినదియే కాని వేఱుకాదు. మిన్నకుండు”మని చెప్పెను.

—(*) సీత లక్ష్మణుని నిందించి పలుకుట. (*)—

సౌమిత్రి పలికిన మాటలు విని యతని స్థిరచిత్తమును గని యమిత మైన దుఃఖమును దిగులును చిత్తముఁ గలంపగా సీత కోపముఁజెంది స్త్రీస్వభావమునకు తార్కాణముగా యుక్తాయుక్తములం దలంపక గద్గద కంఠరవముతో “ఓయి లక్ష్మణా! నేను మించిన దిగులుతో గలిగి చెప్పిన, నా మాటలం ద్రోసి యరుగ నొల్లకున్నాఁడవు. శాంత వచనములు పలికి నన్ను నీవిట్లూఱడించుటకు గడంగినాఁడవు. ఇది యోగ్యలక్షణం బగునా? సవతికొడుకుల కెందైనం గరుణకలుగునా? విరోధమునే తలం తురుగాని మేలునెంచరు. సవతి పుత్రునకంటె మించిన పగవాఁడు గలు గఁడని నీతిమంతులు చెప్పుదురు. అది యిపుడు నీయందు తథ్యమైనది. కాదేని యన్నకు సంకటము గలుగు టెఱింగియు నీవంటి ధైర్యముతో నిట్లుండుదువా? దాయాదులకు మంచిబుద్ధులేల గలుగును? నేను ప్రియ ముగల తమ్ముఁడనని పలుకుచు కపట వినయములు చూపుచుండి యొకఁడు రాజ్యంబంతయును గైకొని యీరీతి నడవులలో నల్లాడునట్లు చేసెను. నీ వన్ననో నా ప్రియవల్లభునిచావును గోరుచున్నాఁడవు. ఆలో చింపగా రామచంద్రుండు మరణింపవలయు, పిమ్మట నీవు నన్ను చేపట్టవలయుననియుం దలంచియున్న రీతిగా దోఁచుచున్నది పాపా

త్మికా! అటుల నెప్పుడును జరుగదని తలంపుము. జగద్విఖ్యాతచరిత్రుం డైన నా నాథుండు పోలిసనేని యప్పుడ నేను నిలువున నీత్రైపోవుదున్నే గాని నీముఖమునైనం జూచుదానను గాను. ఇది సత్యము నీ దురవే తను వినుము'' అనియెను.

కర్ణ కఠోరములైనట్టి సీత పలుకులు విని సౌమిత్రి "హరిహరీ! శివశివా!" యని రెండుచేతులతో చెవులను మూసికొని యామె మాటలచే మిక్కిలి దుఃఖమును బొందినవాఁడై, మేను వడంకుచుండ దీనవదనంబుతో కొంచెము తడవు యోజించి, యామెను మ్రొక్కి చేతులు మోడ్చి నిలిచి "జననీ! నా చిత్తవృత్తి నెఱుంగలేక తోఁచినట్లు పలుకుచున్నావు. నీవు, పరదేవత వనియు, తల్లివనియు, గురుపత్నివనియు నీ పాదంబులు సేవించు సేవకు నిట్టివిధంబున కఠోర వాక్యంబులు బలికి నొప్పించుట న్యాయమగునా? ఇటువంటి మాట లనినంతట నేను క్షణమైన నిచట నిలువఁదగునా? ఇంక నేను పోయెదను. ఘోరరాక్షస మృగసంకులంబైన యీ యరణ్యము భయంకరమైన దగుట నీ వెఱిఁగినదానవే కదా! జాగ్రతగా యుండుము. ఇచ్చోట నీకు పంచభూతములే కాపగును. తల్లీ! నేను పోవుచున్నా"నని చెప్పి మ్రొక్కి కదలి దృష్టియందిన వరకును మాటిమాటికిఁ పర్ణశాల దిక్కునకు మరలి చూచుచు రామచంద్రుం డరిగిన మార్గంబు ననుసరించిపోయెను.

లక్ష్మణుం డరిగినంతట జనకసుత పర్ణశాలఁజొచ్చి రఘువల్లభున కెట్టి కీడునుం బొసంగకుండుటకై దేవతలను ప్రార్థించుచు, తదాగమనంబునకు నిరీక్షించుచుండెను

ఆఱవ ప్రకరణము ముగిసెను.



# శ్రీ రామ వన వాసము.

## వచనకావ్యము.

### ఏడవ ప్రకరణము.



భూపుత్రి పర్ణశాలయం దొంటరియైయున్న సమయంబున, ముఖంబున విభూతిరేఖలును, శిరమున జడముడియు, హస్తంబుల దండ కమండలువును కావివస్త్రములును, మెడయందు తులసిపూసల దండయుందనరగా, సమయము వేచియున్న దశాననుండు సన్యాసి రూపమునుదాల్చి పర్ణశాల వాకిట కరుదెంచి 'హరిహరీ' యని పలుకుచు, భిక్షార్థియై వచ్చిన వాని చందము దోఁపసిలిచి యటునిటుం దొంగితొంగి చూచి,

—(*) రావణుండు సన్యాసివేషంబున సీతకడకు వచ్చుట. (*)—

పర్ణశాల లోపలిభాగంబునఁ గూర్చుండి "అయ్యో యీకురంగం బిచ్చోటికేల వచ్చెను? వచ్చెనుబో, దానినిపట్టి యిమ్మని నేను నా నాథుని నడుగుటకు బుద్ధి బుట్టనేల? నాకు ప్రియంబు చేయువాఁడై మాఱాడక నా విభుం డేలపోయెనుఁ బోయెనుబో, త్వరితముగా మరలి రాక తడయనేమిటికి? ఆ యార్త నాదంబేల గలుగవలయును? గుణవంతుఁడైన మఱఁది నవ్విధంబున నొవ్వరాని యాపాపంబు నొడిఁగట్టుకొని యతని నేల పొమ్మని త్వరచేసితిని? అకటా! ఏమిగా నున్నదియోకదా!" యని చెక్కిట చెయిఁజేర్చి కన్నులఁ గాఱుచున్న దుఃఖ బాష్పములఁ బైఁట చెఱంగున నొత్తుకొనుచు దీనవదనయైయున్న సీత సౌందర్యముకు గనుకొని యత్యంత తాశ్చర్యంబుఁజెంది మోహాక్రాంతుఁడై పంచ శర కుసుమబాణంబులు హృదయంబు గలంప తత్తఱపుచు, ధైర్యంబు డించి యసదృశ లావణ్యాతిరేకంబున నొప్పుచున్న యామెను వర్ణించుచుండ, సీత యటుమరలి వాకిట నిలిచియున్న కపట సన్యాసినిఁగాంచి "ఎవ్వరో, పెద్ద లరుదెంచి వాకిటనిలిచి యున్నవా"రని యెంచి కండ్లు దుడుచుకొని దిగ్గనలేచి, భయభక్తి వినయంబు లెసంగ బిరబిర పూజాద్రవ్యంబులు గొనివచ్చి తృణావృత కూప సన్నిభుఁడైన యా మాయ సన్యాసి కర్ఘ్యపాద్యములు లొసంగి పూజ గావించెను

ఆకపటవ ర్తనుండైన రావణుం డెఱుఁగని వాని చందంబున యా మెనుగని "ఓ కాంతామణీ! ఎవ్వరిదానవు? పూర్వ మెచ్చటనుంటివి? ఇపు డిచ్చోట వసించుట కేమికారణము? శిరీష కుసుమ సుకుమార మైన నీ శరీరం బీవనవాస క్లేశంబుచే గందఁజేయు టేల? ఇపుడిటుల చింతాకుల మానసవై యేల కలంగి యున్నదానవు? నీవృత్తాంతంబును జెప్పు"మని యడిగెను,

ఆ మాయకాని కపట ప్రవర్తనము నెఱుంగని యా సాధ్వీమణి నిజమైన సన్యాసియే యను తలంపుతో, తన వృత్తాంతమును దెలుప నెంచి భక్తివినయంబు లొప్పగా, సర్వంబునుం దెలియబలికి "మహాత్మా! నా విభుండును మఱందియు నొక కనకమృగంబును దఱుముకొని పోయి యున్నారు. కొంచెము తడవు విశ్రమింపుఁడు. వారు రాఁగలరు. నా విభుండు మీకు సత్కారంబు గావించును యిప్పటికి వచ్చుచుండుదురు పోయి చాలసేపు కడచినది. నన్నిచ్చోట నొంటరినిగా విడిచి, యాల స్యముగా వార లెచ్చోట నుండువారు కా"రని ప్రార్థించెను

అంతట రావణుం డామెనుజూచి నిజవృత్తాంతముఁ దెలుపనెంచి యిట్లనియె.

—(*) రావణుండు సీతతో తన వృత్తాంతముఁ జెప్పుట. (*)—

వనితాశిరోమణీ! నీయొక్కయు, నీ పతియొక్కయు, తెఱంగు నెఱుఁగఁజెప్పితివి. సంతోషము గలిగినది, నీయందు గలిగిన ప్రియా ధిక్యతవలన నీకు మదీయ వృత్తాంతము నింకఁ దెలియఁబలుకఁ దలంచి నానే, నే నెవ్వండనో, నా బలంబును శక్తియు, నెట్టివియో వినుపిం చెద నాకర్ణింపుము కోమలాంగీ! నన్ను సామాన్యునిగా నెంచవలదు. సురజ్యేష్ఠుండైన బ్రహ్మకు నేను మనుమఁడను, నాతండ్రి మహానుభావుం డగు విశ్రవసుండును, బంగరముతోడను, రత్న సముదయములతోడను నిర్మింపఁబడిన చిత్ర విచిత్ర కల్పనా విశేషములతోకూడిన మహోన్నత హర్మ్య గోపుర ప్రాకారాదులుగలిగి, యమరావతిని సయితం మలంతి యనిపింపఁ జాలిన మహా దలంకార యుక్తమై యొప్పునదియు, సముద్ర మధ్యంబున విలసిల్లు చుండునదియు నగు లంకాపురంబు నా నివాసస్థా నము, నేను తత్పురాధీశ్వరుండను, త్రిలోక భయంకర ప్రతాప తేజో బల సహితుండను, నన్నుగనిన దేవేంద్ర ప్రముఖులు భయభ్రాంతులై డాగుచుండుదురు. నా పేరు రావణుండు.

ఒక్కింత నా పరితాపం బెట్టిదియైనదియు, నీకు సంతోషము గలుగుటకై జెప్పెదను వినుము. సుందరాంగీ! నేను కోపించితినేని మృత్యువునకు మృత్యువును గలిగింపుదును. అగ్నిహోత్రునకు వేడిమిఁజూపి తపింపఁజేయుదును. యమునకు యముఁడనై శాసింపుదును. సూర్యునకంటె తేజముఁగలవాఁడనై యాతని తేజంబును మాయింపుదును ఇంక కుబేరుండును, పురందరుండును, పవనుఁడు మొదలుగాఁగలవారల నెల్లరను మించి భజింపుదును. నన్ను నెదిరింపఁ జాలినవాఁడు మూఁడులోకముల లోనను నొక్కఁడైనను లేఁడు. నేను నిరంతరానంత భోగంబుల ననుభవింపుచు, ఎచ్చోటనుండినను, కోరిన సుందరాంగులందెచ్చి వారిఁగూడి భోగించుచుండువాఁడను వింటివిగదా! మదీయ గౌరవ పరాక్రమములను, ఇంతటివాఁడనైన నేనిపు డిచ్చోటి కిటుల వచ్చుటకు కారణమెయ్యది యనియెదవేమో, నీవిలాసంబును, సౌందర్యంబును, లక్షణంబులును, నతిశయములుగా విని, నీపై మోహముఁగొని మనోభవుని పూవుటమ్ములకు గురియై నలఁగి నిలువ తరముగాక నీయొద్ద కరుదెంచినాఁడ. నాయందు నీకటాక్ష దృష్టులను బర్వఁజేయుము. ఓ వనితా! యెందఱో యువతులు నాప్రియంబునకు పాత్రులైనవారు కలరు. గాని, నీ రూపలావణ్యములను వినినంతట వారిపైఁగల ప్రీతి తొలఁగింది. కావున యీ యతివల నొల్లక నీయొద్దకు వచ్చినాఁడను. నా ధైన్యమును చూడుము. భవత్సంబంధమైన మోహము నన్నీదశకుఁ దెచ్చినది. వేయిమాటలేమిటికి? కాముని బాణములకు గుఱియైన నేనింక నిన్ను గూడకుండినచో జీవింపజాలను. కరుణించి నన్నుదక్క నేలుకొనుము. ధన్యునిఁ జేయుము.

జనకపుత్రీ! డడపుఁజేయక నాతోడ నరుగుదెమ్ము, వచ్చి రమణీయోద్యాన వనాంతర నికుంజములందును, వికసిత నివారవింద కల్హార శోభిత మద మధుకర నికర ఝుంకార కలితంబులైన కొలంకులందును, అత్యంత శృంగార విలసితోత్తుంగ కృతికాచల సాను ప్రదేశములందును హంతర ప్రకాశమాన, సువర్ణమణిగణ నిర్మిత నానావిధాలంకార రాజిత హర్మ్యములయందును, విహరింపుచు, ననుఁగూడి లంకాపురంబున నకలంక భోగంబులు స్వేచ్ఛగా ననుభవింపుము. సౌఖ్యానుభవ పాత్రమైన భవచ్ఛరీరకంబి విధంబున కష్టములొంది కృశించుట కర్హమైన దగునా? అయోగ్యుఁడైన వానితోఁగూడి యీరీతి క్లేశములు నొందుచుండ నేమి

టికి? ఇంక నీవా రాముని జోలిపీడి నా వెంటరమ్ము. అన్యథామైన యాలో
చనఁ జేయకు"మని మోహోపహతచిత్తచిత్తుండై మఱియుం దన గొప్పతన
మును గూర్చియు, నైశ్వర్య భోగంబులను గూర్చియు, ప్రతాపంబును
గూర్చియు వర్ణించి, యా సాధ్వీరత్నమును లోఁగొనుటకు ప్రయత్నించి
పలికెను.

ఇవ్విధమున చెప్పిన రావణునిఁజూచి, జనకసుత కోపమును భయ
మును నతిశయించి మేనువణఁకుచుండఁగా, కలంగినచిత్తంబుతో "ఓయి
రావణా! నీ మాటలువినగా గొప్ప వంశమునఁ బుట్టినవాఁడవుగా నెఱుం
గవచ్చును. బ్రహ్మకు మనుమఁడనంటివి. దేవతా శ్రేష్ఠుండైన యట్టి
కమలసంభవుని వంశంబున జనించిన వాఁడ వయ్యుధర్మపథంబుఁ దలఁపక
పరాంగననైన నన్నుఁ గని యిటుల బలుకఁజెల్లునా? తలంపగా నీకు వివే
కము లేనట్లున్నది. రామచంద్రుని నయోగ్యుఁడనియు, నల్పుఁడనియుం
జెప్పితివి గాని యా మహాత్ముని శక్తి నించుకయైనను నీవెఱుంగవు తెలి
సియుండిన యిట్లు పలుకుదువా? రఘుకుల వర్యునకును నీకును, హస్తికిని
మశకమునకును, నెంత యంతరమో, యంతటి వ్యత్యాసము గలదని
తలంపుము రావణా ప్రచండ ప్రతాప కలితుండైన రఘువీరుని కరకా
ర్ముక నిర్ముక్త క్రూర నారాచంబులచేఁ బొలియుటకే యిట్టి బుద్ధి నీకు
గలిగినది కాఁబోలు. ఓరీ! రావణా! ఆహా! ఎంతమోసముఁజేసినాఁడవు?
నీ మాయాకృతింజూచి భ్రమసి నిజమైన సన్యాసియని తలంచి నిన్ను
పూజించితి. ఇటుల చేసినదే గొప్పనేరమైనది. నా యొనరించిన యీ
పాపకార్యంబు కతన నీవిటువంటి యనర్హ వాక్యంబులను బలుకఁదొడం
గితివి. ఇట్లాడుటఁ దలంపగా, రామచంద్రుని దారుణ కార్ముక నిర్ముక్త
క్రూరాస్త్రహతిం గూలుటకే యీ దుర్బుద్ధి నీకుఁ గలిగెనని తోఁచు
చున్నది. వివేకహీనుఁడా! రాఘవేశ్వరుని నెవనిఁగాఁదలంచితివి? బ్రహ్మ
రుద్రేంద్రాదులను నయిత మతిక్రమింపఁజాలిన తేజోబలపరాక్రమములు
గలవాఁడని యెఱుంగుము. బహుబలియుతులైన ఖరాదుల గతి యెట్లాయెన
దియు వినలేదా'' అటువంటి విక్రమాఢ్యుఁడును, లోకపూజ్యుఁడునునైన
మహామహుని సతిని నన్నీరీతిగా బలుకుటయు నీకు చెడుకాలముసమీపించు
టచే కలిగిన దుర్గుణముకాని యన్యముకాదు. ఖరముఖ్యుల రీతిగానే,
నిన్నును భస్మీకరింపఁబడుట నిశ్చయము. నిశాటాధమా! చేఁజేత విషంబుఁ
గాని క్రోలఁ దలంచుచున్నావు. ఇది నీకు మేలుకాదు. బ్రతుక దలం

చితివేని యిచ్చోటువిడిచి రాఘవేశ్వరుని కంటఁబడక శీఘ్రముగాఁబొమ్ము. ఇంక నిచ్చోట వ్రేలుచు నిలువవలదు రిత్తగా చావనేమిటికి? ప్రాణంబులు దక్కించుకొను"మని క్రోధావిష్టయై తిరస్కరించి పలికెను.

ఇటుల సీతాదేవి చెప్పుటయు దశవదనుండు సక్రోధంబుగా నవ్వుచు నామెనుచూచి "సీతా! నీపలుకులు వినఁగా నెంతయు నవ్వువచ్చుచున్నది. నే నెట్టివాఁడనని యెంచి యివ్విధమున పలికెదవో దెలియలేదు. ఆరాముఁడే గొప్పవాఁడని యెంచియుండెదవు కాఁబోలు అతఁడు నాకు మశక తుల్యుండు సుమీ! నా ప్రతాపంబు నెఱుంగవుగావున నీవీవిధముగాఁ బలికెదవు. ఆదిశేషుని కోరలనైనం బెఱికి వైచుటకును, గగనంబు నఱచేత వ్రేయుటకును, దిగ్గజంబుల దంతములు విఱచుటకును, కులపర్వతముల గోటనెగుర మీటుటకును, సముద్ర జలంబులు పుడిసిలించుటకును, లోకంబుల చేతిలోనికిఁ దెచ్చుటకునుం జాలిన యీ త్రిలోక భయంకరుండైన పంక్తిముఖుని ముందటనా? యిట్టి మాటలు పలుకుట. బళీ! ఎంతటి వెఱ్ఱిదాన వలయును? రాముఁడనియు గీముఁడనియుం జెప్పి నన్ను వెఱపింపఁ దలంచితివి కాఁబోలు. వానికా? నేను వెఱచుట. చాలుచాలు ఇఁక నీమాటలు విడువుము. దేవేంద్రముఖ్యులచే వెట్టిగొనుచుండెడి నాయెదుట నల్పుఁడైన నీ మగని యీ మానవాధముని నూరక వర్ణింపవలదు. ఆహీనపరాక్రముఁ డెంతమాత్రమని యెంచితివి? ఇట్లు నన్నుచూచి నాశక్తి యెట్టిదై యుండునో గ్రహింపు" మని చెప్పి, పదితలలును, నిరువదిచేతులును నొప్పుగా పర్వతోపమానంబైన నిజ స్వరూపమునుదాల్చి నిలిచెను. ఈప్రకారము తోఁచినవాని భయంకరాకృతింగాంచి మైథిలి మూర్ఛాక్రాంతయై ధరణిపైఁబడియెను.

—(*) రావణుండు సీతను దొంగిలించుకొని పోవుట. (*)—

అపుడు రావణుండామెను పొదివిపట్టి తన రథంబుపై నిడుకొని గగన పథంబున లంకాభిముఖుండై పోవుచున్న, కొంతతడవున కయ్యిందుముఖి తెలివినొంది, దిక్కులు గలయఁ గనుంగొని, దనుజుఁడు కొనిపోవుచుండుట నెఱింగి, భయంబును శోకంబును నతిశయింపఁగా, "ఓ ప్రాణవల్లభా! రాఘవేశ్వరా! ఇదే రాక్షసుండొకఁడు పదితలలు నిరువదిచేతులును. గలిగినవాఁడు, భయంకరాకారుండు నన్నుఁబట్టి చెఱఁగొని పోవుచున్నాఁడు. వీఁడు రావణుడఁట. ఓ రాజకులశేఖరా! త్వరితముగా వచ్చి నన్ను విడిపింపుము. తమ్ముఁడా! లక్ష్మణా! తేరువేగముగాఁబోవు

చున్నది. శీఘ్రముగా జనుదెంచి నన్ను విడిపింపుము. బుద్ధిలేనిదాననై నిను దారుణమైన మాటలాడి నొవ్వఁజేసి తత్ఫలంబు ననుభవించుటకుఁ పాలైతిని రామచంద్రా! వీఁడు నన్నెచటికి గొనిపోవునో తెలియలేను. అబలనగు నేను దిక్కులేని దాననై చిక్కువడి వాపోవుచున్నాను ఆలస్యముఁజేయుటకు సమయముగాదు. నన్ను రక్షింపుము అయ్యో! ఇది యేమిపాపము! ఆర్తనైన నన్ను రక్షించుట కెవ్వరును రారైరి. నా మొర నాలింపకున్నారు. ఓ దిక్పతులారా! మీరైన నడ్డపడి వీని గర్వము నడంపరాదా? ఇంక నేనేమి చేయుదును? ఓ యినవంశ సాగర సుధాకరా! కృపాలచంద్రా! రామచంద్రా! దురాత్ముండు నీవు లేని సమయమున వచ్చి నన్ను కొనిపోవుచున్నాఁడు. ఈ క్రూరుని భవదుగ్ర శిలీముఖంబుల ద్రుంచి, వీని బారినుండి తప్పింపుము. లక్ష్మణా! నీవు సద్గుణనిధివి, నిన్నటుల ననరాని మాట లనిన కారణమున యీపాపము నన్ను చుట్టుకొనునది, అవివేకినైన నాపలుకులను మదినుంచక, మీయన్ననుఁ దోడ్కొనివచ్చి యీ యసురుని పోతరంబు నడంపుము. ఓ దైవమా! ఇపుడు నా సంకటమును నివారించువా రెవ్వరును గానరాకున్నారు. "ఓరి దుష్టాత్మా! పుణ్యశీలుండైన రాఘవేశ్వరుని దేవినిఁ గొనిపోవుట యుక్తమా!" యని నోరెత్తి యొక్కరుం బలుకకున్నారు. మదీయ వృత్తాంతమునైనను పోయి నాపతి కెఱిగింపరాదా ఎవ్వరికిని నాపైని కనికరము గలుగదయ్యెనా? ఓ మేఘములారా! మీరైనఁ బోయి నాప్రాణవల్లభునది మదీయ దుర్గతిం జెప్పుఁడు. ఊరక చూచుచుండెద రేమి కటకటా! నేనేమి చేయుదాన"నని బహుప్రకారముల నాక్రందనముం జేయుచు, నాలుగు దిక్కులుం జూచి "ఓ పావన గోదావరీ! ఈ నిశాటుండు నన్నుఁ గొనిపోవుటను నీవైనను, రఘుకులనాథున కెఱిగింపుము, ఓ గిరిశ్రేష్ఠుఁడా! మాల్యవంతా! రాజసింహుండైన రామచంద్రున కీ వృత్తాంతమును నీవైన దెలుపుము. ఓ జనస్థాన మహీజములారా! మీరైనను మదీయ వల్లభునకుఁ దెలుపుఁడు. ఓ దండకారణ్య వాసులైన మునులారా! నా పాటును దశరథరాజ నందనాగ్రేసరునకు మీరేనియు నెఱిగింపుఁడు. ఓ సురులారా! యక్షులారా! గంధర్వులారా! సిద్ధులారా! పుణ్యాత్ముండైన రామభద్రుని దేవినైన నన్ను విడిపించి పుణ్యముఁ గట్టుకొనుం"డని పెల్లుగా నాక్రందనముఁ జేయుచుండెను.

ఆరోదన ధ్వనిని విని జటాయువనెడి పక్షిశ్రేష్ఠుండు మహాగ్రహమును జెంది "ఓ సాధ్వీమణీ వెఱవకు, నేనున్నాఁడ నిన్నుఁగొని పోవుచున్న దురాత్మునిచించి చెండాడి నిన్ను విడిపించెద"నని పలుకుచు, ఱెక్కల యురువడిచే ప్రచండమారుతము వీచుచుండ, భయంకరములైన కోపముతోఁ గూడిన యెఱ్ఱని కనులును, మృగంబులను వచ్చి భక్షించుటచే రక్తసిక్తంబులై యున్న క్రూరనఖంబులును, పర్వతోపమాకారములు, కఠోరమైన ముక్కునుం దనఱగా ఱివ్వున నెగసివచ్చి యతిత్వరితముగాఁ బోవుచున్నఁ దశవదనుని నడ్డగించెను.

—(*) జటాయువు రావణునితోఁబోరి నేలఁగూలుట. (*)—

మహా బలవంతుడగుట జటాయు విన్విధమున నడ్డపడి "ఓరి రావణా! నేనుండగా రామచంద్రుని దేవి సక్రమముఁ గొనిపోవుట నీకు సాధ్యమగునా? ఎచ్చటి కేగెదవు? బ్రతుకవలయునేని యీ పుణ్యవతిని డించి ప్రాణములు రక్షించుకొనుము. కాదేని నీమేని కండలు చించి నిన్ను యమ సదనంబున కనుపక విడువను. ఇంక నొక యడుగు దూరమైనం గదలనివ్వను. పాపాత్మకా! త్రిభువన వీరుండగు రామచంద్రుని పడతి నపహరించుట నీకు న్యాయమా! ఎటుల బ్రతుకఁగలవు? ఛీ బుద్ధిహీనుఁడా! ఆమెను విడిచిపెట్టుము. కాలకూటమును మ్రింగినవాఁడెవఁడు జీవించును? ఓరీ! ఉక్కుగుండును మ్రింగినచో యది జీర్ణమగునా! సూదిత్రేటునకు మేరుపర్వతము విఱుగునా? అటుల నా రాఘవుని దేవిని హరించినచో పరమ పతివ్రతా శిరోరత్నమైన యీమె నీకు దక్కునా? దుష్టమతీ! ఇది యేమి యుక్తకార్యమని చేయఁ దలంచినాఁడవు? ఇసీ! నాశమగుటకే యిటువంటి దుర్బుద్ధి నీకు కలిగినది కాఁబోలు. తడవుఁ జేయక జనకనందనను విడిచిపొమ్ము. నీ హితమునకై చెప్పిన నా మాటలు వినక నిరాకరించితివేని పిమ్మట నీవు చచ్చుట నిశ్చయము నిన్ను నేను విడువను"

అని పలికిన యీ మాటలకు సరకుసేయక పంక్తిముఖుండు తేరు తోలంగఁ దోలుకొని పోవుచున్న కినుకమించి జటాయువు వానిపైఁ గవిసి క్రూరములైన తన వాడిగోళ్ళతో వాని శరీరమును వ్రచ్చియు, ముక్కునం బొడిచియు ఱెక్కలతో మోదియు రక్తధారలు గారునట్లుచేసి మిక్కిలి నొప్పించుచు, రథమును గదలనివ్వకున్న దశాననుం డాగ్రహించి తీక్ష్ణములైన బాణములం బ్రయోగించి జటాయువును బహు గత్తుల

సలిపెను. ఇట్లు పక్షీంద్రుండును, దానవేంద్రుండును గొంత తడవు ఘోరముగఁ బోరుచుండ యాసమర ప్రకారముగాంచి మింట వేలుపులు జటాయువు పరాక్రమము మెచ్చి యుంతయుం గొనియాడుచుండిరి. తత్సమయమున రావణుం డాగ్రహము మించి మహోగ్రములైన శర పరంపరలను విరామము లేకుండ భంగిఁ బరగించి విహంగశ్రేష్ఠుని బడ నొవఁజేసి మఱియు నొక్క దివ్యాస్త్రమున పక్షంబులు ద్రెంచి నైరుండి నెత్తురులు ప్రసవించుచుండ కండలు వెలికురుకం గొట్టుటయుఁ జటాయువు సత్వంబుడింది ఱెక్కలుదెగి ధరణిఁగూలె. అతని తెఱంగుఁ జూచి జనకతనయ బెగ్గడిల్లి "పక్షీంద్రుఁడా! అయ్యో! నా నిమిత్తమున నిశ్శత్రవిగదా! ఇక గతి యేమియున్నది?" యని పలుకుచు శోకించుచుండ యామెంగొని దశాస్యుండు తన విజయమునకు సంతోషించి సింహనాదం బొనరించుచుం బోవ దొడంగె.

పుణ్యవతియైన సీత వాని నుద్దేశించి "ఓరి రావణా పాపాత్మా! మృత్యువుతో చెరలాట మాడినట్లు, రామచంద్రుని దేవినైన నన్నుఁ గొనిపోవుచున్నాఁడవు. ఇది నీకు శ్రేయస్కరముకాదు, నీకు చావు సిద్ధము. దుర్బుద్ధివీడి నన్ను విడిచిపొ"మ్మని చెప్పుచున్న యామె వాక్యము లాలింప కరుగుచున్న వానింజూచి భూపుత్రికిఁ దొడరిన కష్టంబును దలంచి వనదేవతలును, మునులును, తాము విడిపించుటకు శక్తి లేనివారలై మిక్కిలి దుఃఖించుచుండిరి. దిశలందగా, హా రామా! రామా! యని పలుకుచు జనకజ యాక్రందించుటం దద్వన మృగములును విని దుఃఖమును బొంది పైనరుగుచున్న రథము నీడ ననుసరించి పోవుచుండెను. అఖిల భూత చయములును నాక్రోశమును జెందెను. బ్రహ్మదేవుం డావృత్తాంతము నెఱింగి, ఇంక దశముఖునకు వినాశకాలం బరుదెంచెనని నిశ్చయించెను. ఎంతచెప్పినను, తన వాక్యములు లెక్కచేయక గొని పోవుచున్న దైత్యపతింజూచి, సీత మహాక్రోధముతో తనలో "అయ్యో! ఈ పాపవర్తనుండు నన్ను విడువక కొనిపోవుచున్నాఁడు వీనికి నాశకాలము సమీపించినది. మదీయవృత్తాంతము, రామచంద్రుండును, సౌమిత్రియు నెటుల నెఱుంగుదురు? వారికెవ్వరు జెప్పుదురు? ఏమిగానున్నదియోగదా!" యని చింతిల్లి, "ఓరి రాక్షసాధమా! మాయపన్ని, నాపతి నేమఱించి ప్రముచ్ఛదనమున నన్ను గొనిపోవుచున్నాఁడవు. ఇసీ! ఇది యేమి పౌరుషము? ఏమి గౌరవము? శౌర్యవంతుఁడవై యున్న

మత్పతి వచ్చువరకు నుండి యమ్మహాత్మునితోఁ పోరి జయించుకొని రాఁగూడదా? అధమాధముండవు గాన నీవిటుల చేసినాఁడవు. నీకు శౌర్యమెక్కడిది? సత్యమెక్కడిది? అచటనే యుండినచో యిప్పటికి రఘువీరు శరానలమున కాహుతియై పోయెడివాఁడవే పిరికి పందవుగాన నన్ను దొంగిలి తెచ్చినాఁడవు. దుర్మతీ! నీకు కాలము సమీపించినది. కావున దుర్బుద్ధి యిట్లు కలిగినది. ఖరదూషణ ప్రముఖుల పదునాలుగువేల రాక్షసుల ద్రుంచుటవలన నైనను రామచంద్రుని శక్తి నీకు గోచరింపలేదా? ఆ రాజశేఖరుని బాణాహతిం గూలునపుడుగాని యతని పరాక్రమము నీ వెఱుంగజాలవు. కపటవర్తనా! అనతికాలముననే నీవు నీరై పోఁగల''వని బహువిధముల నిందించుచుండ మారాడక యతం డామెంగొని, నదులు, వనములు, దుర్గములు పట్టణములు గడచిపోవుచున్న సమయమున, నొక్కచోట యరణ్యమధ్యమునం గల యున్నత మహీధరముపై నైదుగురు వానరులు నిలిచి చూచుచుండుటం గని సీత తటాలున తన మెడఁగల భూషణములుదీసి, పైఁట చెఱంగును జించి యందు వానిని ముడిచి తనచెంతఁ గనుచుండిన యా వానరుల ముందు పడులాగున మూఁటను పడవైచి, తన కొఱకై వెదకుచువచ్చిన రామలక్ష్మణుల కొకవేళ వారలు నిజ వృత్తాంతముం జెప్పుదురని నిశ్చయించెను. సీతచే వైవఁబడిన యామూఁట తనముందు పడుటయు, నటనుండినవారిలో సుగ్రీవుఁడనెడి కపివరుండు దానినిఁ గైకొని, దాచి యుంచు నట్లు చెప్పి తక్కిన వారిచే నొసఁగెను.

—(*) రావణుండు సీతను లంకయందుంచుట. —(*)

రావణుండు సీతతోడ సముద్రముఁగడచి లంకాపురముసొచ్చి వివశురాలై యున్న భూపుత్రినిడించి త్రిజట యనుదాని రావించి, దానితో నిట్లనియె. "ఓ త్రిజటా! మేలైన సొమ్ములును, వస్త్రములును, పుష్ప చందనాదులను, నేకోరియు నెవ్వి గోరినను యీతరుణీమణి కొసంగుండు. తెలివిలేనివార లెవ్వరునుం జేరి మాటలాడనీకుండు, ఎప్పుడుగాని మీరీ కాంతామణితో పరుషవాక్యములు పలుకవలదు, అప్రియములు చెప్పకూడదు మిక్కిలి భక్తితో సేవింపుచుండుఁడు. జాగ్రతగా రక్షింపుఁ"డని యాజ్ఞాపించిన యది యామెను దోడ్కొని యంతఃపురంబున కరిగె. అంతట దశవదనుండు యోజించి మిక్కిలి పరాక్రమవంతులైన రాక్షసుల నెనమండుగురంబిలిచి "శూరాగ్రేసరులారా! మనుష్యుఁ

వాకేఁడు జనస్థానమునకువచ్చి ఖరదూషణాది రాక్షసులంద్రుంచి యా ప్రదేశము నరాసతము గావించెను. అది యెఱింగినది మొదలు నా చిత్తము వ్యాకులపూరితమై వానిని వధించినంగాని మఱియొక తెఱంగున మది కుదురుపడదని, యుదియ చింతఁగలవాడనై యున్నాను. అసదృశ పరాక్రమ కలితులరైన మీరేగి యా నరాధముని వధించి, నాకుసంతోషమును గలుగఁజేసి మీరు జనస్థానముందే యుండుడు. జాగ్రతసుఁడీ!'' యని చెప్పినవారలు దండ ప్రణామము లాచరించి యతని వీడ్కొని దర్పము లెసంగ జనస్థానమున కరిగిరి.

అంతట రాక్షసేశ్వరుండు మహా సంతోషముతో, సీతను దలంచి మదనబాణ పీడిత మనస్కుండై యలంకరించుకొని వేగిరపాటు గదురగా మున్ను నామెను నుంచినస్థలముచేసిన రమణీయ మందిరమునకేగి, యందు పులుల గుంపుతో చుట్టఁబడిన లేడి వగిది రాక్షసస్త్రీ పరివేష్టితయై మహా దుఃఖముతో కన్నుల నీరు కాలువలుగట్ట నేడ్చుచు చెక్కిట చేయిఁజేర్చి, దీనవదనయు, నధోముఖియు, కళారహితయు నగు రాముని దలంచి పరితపించుచున్న యా లతాంగిఁజూచి, తమక మగ్గలింపగా, కూడికోరిక దీర్చుకొనెడి యుద్రేకంబుతో చేరనరిగి, పలుకరించి మోహంపు మాటల నిట్లనియె

"రమణీమణి! ఏల చింతిల్లుచున్నావు? నా దివ్య భవనములును, నాకుంగల ధన, ధాన్య రత్న, కాంచన, పనస, వస్త్ర వాహనంబులును, దాసదాసీ ప్రముఖ జనంబులును, మహోత్తరమైన మదీయ యైశ్వర్యమును, సొమ్ములును, సర్వంబునుంజూడుము. ఇచట నేదేనియుం గొఱంత యుండునేమో విమర్శింపుము. కమలలోచనా! ఈకలిమి కెల్లను నీవేయధీశ్వరివి, ఇవి యున్నియు, నీయవియ అంతమాత్రమేకాదు. ఏయే కాంతలు మదీయ ప్రియంబునకు పాత్రులై యున్నవారో, వారందఱును నీకు దాసీజనులుగా నుండగలరు. నేనును నీ దాసుఁడననియే తలంపుము. ఇందొకటియు ననత్యముకాదు. నీకు నాపై ప్రియము గలిగెనేని యంతియచాలును. వఱి యొంతటి సౌఖ్యమునుగాని నేను లక్ష్యముఁ జేయనొల్లను, నీతోడిదియు లోకము, నీవే నా ప్రాణధనము ఇందుముఖీ! మన మిరువురమును విలాసముమీరగా, ఇసుక నేలలయందును, వనాంతరములందును, పొదరిండ్లయందును, గిరిసానువులందును, గుహాలయందును, పూఁదోఁటలయందును, విహరింపుచు, రత్న సౌధములలో,

హంసతూలికలపైఁ జేరి సల్లాపము లాడుచు, కమలాకరముల జలకేళి సల్పుచు, ఇచ్ఛావినోదంబులంగూడి మదనతంత్ర కుతూహలం బతిశయింపగా జెనంగుచు నానందంబున సుఖంబులనుభవింపుదము. ఈయౌవనము స్థిరముకాదు. దీనిని వ్యర్థముగాఁ బోఁగొట్టుకొన నేమిటికి? ఇపు డనుభవింపవలసిన సౌఖ్యమును పోఁగొట్టుకొని పిమ్మట చింతించిన ఫలము గలుగునా? కాఁబట్టి నన్నుఁగూడి కామకేళీ సుఖములు లనుభవింపుము. ఇంక నీవా రామునిపైఁ దలంపుఁ బెట్టుకొనవలదు. గాలిని బట్టుకొనుటయు, నిప్పు మ్రింగుటయు, కాలాంతకుని గెలుచుటయు, నెటుల సాధ్యముగాని కార్యములో యట్లే యీ లంకాపురంబుఁ బ్రవేశించుట కెవ్వరికిని తరముగాదు, ఇంక నిచ్చోటికి రాముఁ డెట్లు రాగలఁడు? నీవు పూర్వ జన్మకృత దుష్కృతమునకు ఫలముగా నింతవరకును వనవాసముఁజేసి నానా కష్టములుం బొందితివి. ఇంక సుకృత ఫలముగా నన్నుఁగూడి యిచ్ఛాభోగంబుల ననుభవింపుము. ఇచ్చోట నీకు గావలసినవన్నియు సిద్ధముగా సమృద్ధిగా యున్నవి. భూషణాంబరాదులను వలసినట్లు గైకొని ధరించి యలంకరించుకొనుము. దేవతలుగాని, యక్షులుగాని, రాక్షసులుగాని, నను నెదురింపఁజాలరు. ఇంక రాముఁ డెంతవాఁడు మనుష్య మాత్రుఁడును, దుర్బలుఁడును, రాజ్యహీనుఁడును నగువాఁడా? లంకాపురమునకు వచ్చి నన్ను జయించి నిన్నుఁ దోడ్కొనిపోవును, వ్యర్థమైన నీ యడియాసలువీడి నాతోడఁగూడి భోగింపుము. కలికి! వేయిమాట లేమిటికిగాని, పూర్ణముగా నేను నీకువశ్యుండనైతిని. ఇదిసత్యము నీకు మ్రొక్కెద గరుణింపుము. నీ పాదములు నా తలపైఁ బెట్టి నను సమ్మతమే మోచుటకు సంసిద్ధుఁడనై యున్నాను. తడవుఁజేయక మిక్కిలి వలఁపుకొని యలయుచున్న నన్ను చేఁబట్టి నాతాపము నివారింపు"మని బతిమాలఁదొడంగె.

—(*) సీత రావణుని తిరస్కరించి పలుకుట. (*)—

ఆమె "ఓరిమదోదగ్రమానాసా! రావణా! పుణ్యాత్ముండై నదశరథ రాజన్యుని పుత్రుఁడును, ధర్మ నిరతుఁడును, నిరుపమాన శౌర్య, ధైర్య పరాక్రమ యుక్తుండును, లోక పూజ్యుండునునైన రామచంద్రుని ధర్మపత్నినగు నన్ను పతివ్రతను మోసమునఁ దెచ్చి నోటికి వచ్చినమాటలు వదరుచున్నావు. ఇది నీకు క్షేమకరము కానేరదు? నీ లంకయు, నీవును నేలఁ గలిసిపోవు కాల మాసన్నమైనది. నీవు నశింపఁగలవు. ఇంతలో

నిప్పుల త్రొక్కెదవు" పాపాత్మా! నన్నుఁ గొనివచ్చు సమయమున నాపతి యుండియున్నచో ఖరాదులం ద్రుంచిన వాడి శరముచే నీతలలు జక్కాడి యేయుండును. అపు డది తప్పినది. ఓరీ! దేవాసురులచే చావు గలుగ నట్లు వరంబుఁ గొంటినని గర్వపడుచున్నాఁడవు. అది వ్యర్థము ఎట్టి వరము లొందియున్నను నిన్ను రాఘవేశ్వరుఁడు చంపుట నిశ్చయము ఇంక నీవు బ్రతుకఁజాలవు. త్వరితముగా తమ్మునితోడఁ గూడివచ్చును, నిన్ను వధించును. సురాసురు లడ్డమైనను నీవు జీవించుటకల్ల, ఆ రామ చంద్రునిం దలగనేని నిటలాక్షుండైన నెదుర నిలువ సాధ్యముగాదు. అల్పుఁడవగు నీబలమును, శౌర్యమును నమ్మహాత్మునకు లెక్కయగునా? రాక్షసాధమా! ఛీ! నీముఖమును చూడకూడదు. నీ భయంకరా కారమునుచూచి వెఱచి మూర్ఛిల్లియున్న నన్ను స్మృతిలేనిదానింబట్టి తెచ్చి నాఁడవు. దుర్వర్తనా! మంత్రపూరితంబైన యజ్ఞవేది చండాల వాకిటి యందుండుట యెట్లో యటుల నీచుఁడవైన నీయొద్ద రథముపై నుంటిని ఇది నేను యేజన్మమునఁ జేసిన దోషమో తెలియదు. ఇటువంటిమోస కారివైన నీతోడ పెక్కుమాటలు పలుకుచుండుట సాధ్వినైన నాకర్హం బుగాదు. నాయెదుట నిలువకుము. ఇపుడే నేను ప్రాణములు విడుచుటకు నిశ్చయించినాను. హీనమతీ! నీవు చెడఁగల విఁక నావలికిఁ బొమ్మని వాని కడ్డముగా చేత నొక తృణమును బట్టుకొని మహాకోపంబును దుఃఖమును గలదియై పరుషముగా బలికిన, విని, తనకోరిక నెరవేఱునని యెంచియున్న రావణుఁడు నిరాశుఁడై యాగ్రహించి రాక్షస స్త్రీలంజూచి "ఓ దనుజాంగనలారా! మీరలీ సీతం దోడ్కొని యశోక వనమున కరిగి యుంచు బెట్టుకొని, సామ వచనములచేతను, తర్జన భర్జనోక్తులచేతను, బోధించియు, బెదరించియు, నాశలుచూపియు, మీమీ సామర్థ్యములు తేఁటపడ నన్ను వరించునట్లు చేయుఁడు దీనికై మీకు పండ్రెండునెలలు గడువు నొసంగినాఁడను. ఈ వత్సర కాలములోపల మీరు చెప్పినట్లు వినక నన్ను నిరాకరించెనేని, నిర్దయగా మీరు వధించి భాగించుకొని భక్షింపుఁడు. సంశయింప వలసిన కారణ మటు పిమ్మట మీకుఁ గలుగదు. గొనిపొం"డని యాజ్ఞాపించి యచ్చోటువిడిచి పోయెను. అంతట భయంకర రూపిణులైన నిశాట స్త్రీలు జనకనందన నశోకవనమునకుఁ గొనిపోయి, యనువైన చోటఁ జేర్చి, రావణుం డాజ్ఞ చేసిన చొప్పున బోధించుచుండిరి. సీత వారి పలుకులు చెవుల నిడి

యాదరింపక, నిద్రాహారములు లేక రామచంద్రుని మనమున ధ్యానిం
చుచు, కృశీభూతాంగియై వగచుచుండె.

—(*) రామచంద్రునియొద్దకు సౌమిత్రి వచ్చుట. (*)—

ఇక్కడి వృత్తాంత మిటులనుండగా, నచట నరణ్యమున దాశరథి మారీచుని వధించి, రాక్షసుం డొనరించిన మాయాకృత్యమున కచ్చెరువొంది జనకనందన జూచు తలంపున వచ్చుచుండ, నక్కలు మార్గమున కడ్డమై కూయదొడంగె. అది గని యటుల నమంగళకరముగా నవి యఱచుటం దలంచి తనలో "అయ్యో! అవశకునములగుచున్నవి. కారణము తెలియలేను. దురాత్ముండైన రాక్షసుండు కూలునపుడు బిగ్గఱగా పేర్కొని యఱచిన కూతను విని సీత యెంతభయముం జెందెనో, లక్ష్మణుం డేలాగు దిగులొందెనో, వారి కెట్టికీడు మూడెనో, వారి కేసంకటమును గలుగకుండవలయు"నని తలంచుచు త్వరిత గమనమున పర్ణశాలకు వచ్చుచుండెను. అపుడు మెండియు ననేకములైన దుర్నిమిత్తములు పొడకట్టుచుండుటయు సంశయాకులమానసుండై కలంగి కొంతదూరము వచ్చినంతట, మిక్కిలి ఖిన్నుండై యెదురుగా వచ్చుచున్న సౌమిత్రిం జూచెను.

ముఖమున దైన్యము తాండవింగా నరుదెంచిన తమ్మునిం గౌగలించి రామభద్రుం డతనితోఁ "తమ్ముఁడా! నేను తరుముకొని వచ్చినది మాయకాఁడైన రాక్షసుండుగాని నిజమైన మృగముకాదు. ఆమాయా కురంగము నన్ను చాలదూర మెలయించిన నలిగి దానిం గూల్చితి. అంతమాయ తొలంగి దనుజుండు ప్రాణములువిడిచె. అది చూచి నేను మరలి వచ్చుచుండగా పెక్కు దుశ్శకునములు కనుపట్టెను. నీకును సీతకు నేమి యుపద్రవము కలిగెనో యనెడి చింతతో బిరబిర వచ్చుచున్నాను. ఇంతలో నీవు యెదురైతివి. అయ్యో! ఒంటరిగా జానకిని డించి రాదగునా? ఏల వచ్చితివి? ఆ కోమలికే యాపదలు గలుగునో కదా! దిగులు బుట్టుచున్నది. లక్ష్మణా! ఏదో విపరీత మేర్పడునట్లు తోఁచుచున్నది. ఇది మూడుము నీవు భూపుత్రిని విడిచివచ్చితివి. ఇపుడు నా యెడమకన్ను యెడమభుజమును నదరుచున్నవి. హృదయమున నేమో సంకటము కలుగుచున్నది. ఇంక నెట్లు? దుష్టమృగ దుష్టరాక్షస సమృద్ధంబైన యీ యరణ్యమున నయ్యబల యేమి చేయగలదు? ఏ క్రూరజంతువైనం జంపియుండునో, లేక రాక్షసుం డెవ్వండైనం గొనిపోయి

యుండునో, యెట్లయ్యెనో, యేదియును దోఁచలేదు. భయ మంకురించు చున్నది. నేను రాజ్యమునువీడి యరణ్యములకు వచ్చుచుండగా, నన్ను విడిచి యుండలేక కష్టములను లెక్కింపక నా వెంట వచ్చినది.

—(*) లక్ష్మణుండు సీతను విడిచి వచ్చుటకు రాముఁడు చింతించుట. (*)—

అటువంటి ప్రియముగలదియగు జనకనందన కడకు గలుగుటకు నామనం బోర్వదు. తమ్ముఁడా! భూమిజ క్షేమమునుం జెప్పుము. ఆ సాధ్వికిని నాకును, నే కారణమునైనను నొక్కింత యెడబాటు గలిగె నేని ప్రాణములు పోయినట్లె తలంపుకుంజుమీ! ప్రాణతుల్యమైన సీత లేకున్ననో రాజ్యమును, భోగభాగ్యములును నా కేమి జేయుటకు చె ప్పుము? మదీయ సంతోషమున కెల్లను మైథిలియే యాధారము. అటు వంటి యాచాన కేమైన నడరు గలిగినచో నేను నిర్వహింపజాలను. నేను ఖరాదులను సంహరించి నంతట చెడిపెయైన శూర్పణఖ తనయన్న యైన దశాననునొద్ద కరిగి యేమేనియుం గుట్రచేసియే యుండునుగాని, యది యూరకుండునది కాదు. అటుల నయ్యెనేని రావణుండు దుష్టు లైన రాక్షసులను బంపక మానఁడు. వానిచేఁ బనుపఁబడి దైత్యులరు దెంచి యేమైన నుపద్రవముఁ గలిగించి యుందురేమో యనెడి సందే హము నామనమున నంకురించుచున్నది. నేను వచ్చునంతవరకును మీ వదినెను జాగరూకత గలిగి రక్షించుచుండుమని చెప్పి వచ్చితినిగదా! ఇంచుకైనను నీవు వెఱువక యీ యుగ్రాటవిలో నొంటరిగా నుండఁ జేసి యిటు రావలసిన నిమిత్తమెయ్యది? ఆలస్యముజేయక వచ్చినవిధ మెట్టిదియో వచియింపు"మని తొట్రుపాటు తోడ నడిగెను.

—(*) లక్ష్మణుం డన్నతో తన రాకకు కారణంబుఁ జెప్పుట. (*)—

ఈ ప్రకారముగా కౌసల్యా నందనుండు సీత విషయమునుదలంచి దిగులొందియుండుటయు, లక్ష్మణుం డన్ననుజూచి "రామచంద్రా! విను ము నీచేఁ గూలిన మృగాకారుండైన రాక్షసుం డవ్విధమున బిగ్గఱగా నఱచుటయు, యారావంబును విని జనకనందన బెగ్గలమంది నన్ను బిలిచి "లక్ష్మణా! రాఘవేశ్వరుం డామృగము వెన్నంటిపోయి తడవైనది ఇపు డున్ననో, హా! లక్ష్మణా! హాసీతా! యని మనల బేర్కొని పిలిచెను. ఆ నృపశేఖరున కే మేమేనియు సంకటము సంఘటిల్లియుండును. కానిచో నిట్లేలచీరును? ఇంక నీవు తడవుచేయరాదు. త్వరితముగాఁబోయి భ్రాతృ వాత్సల్య మేర్పడ నీ యన్నకు సాయముఁ జేయుము. ఆకూత వినినది

మొదలు నామనంబు తల్లడిల్లుచున్నది. రామచంద్రునిం జూచునంతవరకును, నేను ధైర్యము వహింపఁజాల, పొమ్మపొ”మ్మని త్వరపెట్టదొడంగె. ఆమె మాటలకు నేను చలింపక “అమ్మా! దేవతలకంటె నధికుఁడైన కకుత్సకులవర్యున కెట్టి యాపదయుం గలుగదు. ఆమహానుభావుఁ డేరికి నజేయుండు. అటువంటి ప్రతాపవంతుఁడు తానొకనివలన నొక యాపదఁ జెంది యత్యల్పుఁడనైన నన్ను తనకు రక్షణముగా రమ్మని పిలుచునా? ఇవి యేమిమాటలు? మూఁడు లోకములలోనను, రామచంద్రుని నెదిరింపగలవాఁడు లేఁడు. అతని కెట్టి కీడునుం గలుగదనుట నే నెఱుంగుదు నీ మనమున దీనికై దిగులుఁ జెందవలదు. ఆరావము దుష్టుఁడైన రాక్షసుం డెవనివలననో గలిగినదియ కాని రామచంద్రుండు పిలుచుటగాదు. ఇంచుకతడవు ధైర్యమును నుంటివేని మీయన్న రాఁగలం” డని చెప్పి మఱియుం బలు తెఱంగుల నామెను బోధించితి, నాపలుకులకు శాంతి నొందియుండవలసిన దానికి మాఱుగా, యామె మిక్కిలి శోకాక్రాంతయై, నేను తడయుట కోర్వక యేడ్చుచు పొమ్మని నన్ను మఱి మఱియుం ద్వరచేయ నారంభించెను. వెండియునే నామెతో “తల్లీ! ఇటుల దుఃఖించెదవేల? ఇపుడేది చెడినది? శాంతమతివై యుండుము. మా యన్న పోవునపు డచ్చోట నిన్ను జాగ్రతగా రక్షించుచుండుటకై నన్ను నియమించి చనియె. ఇట్టితఱిని యువతివైన నిన్ను ఘోరాటవిలో నొంటిగా విడిచిపోయినచో, నాపై కోపము నొందకుండునా? భీతిమాను” మని పలికిన, యామె నామీఁద నధికమైన యాగ్రహమునుఁ బూని, “ఓయి సుమిత్రానందనా! అన్న చేటు నెఱింగియు, నేను పొమ్మనినఁ బోవక దైర్యమున నున్నవాఁడవు దాయాదులకు కరుణయుండునా? అన్న లేకున్న యెడల నన్ను చేపట్టనెంచి దలంపుఁగొని యున్నవాఁడవు కాఁబోలు. నను గవయుటకు నీకు సాధ్యమగునా?” యని మఱియుం జెప్పరాని కఠోరవాక్యములు బలికెను. ఆమాటలు విన్నంతట నచ్చోట నిలుచుటకు మనంబొల్లక, దైవంబుపై భారమువైచి నిన్నుఁ గానవచ్చితి. ఇది జరిగిన వృత్తాంతం”బని విన్నవించెను.

సౌమిత్రి ఈప్రకారము చెప్పినవిని రఘుకుల వల్లభుం డతనిగాంచి “తమ్ముఁడా! నీవు గొప్ప తప్పుఁజేసినాఁడవు. నాశక్తి యెట్టిదియో బాగుగా యెఱింగియుండు వాఁడవయ్యు, స్త్రీయగుటచే యోచనాశక్తిరహితయై మీవదినె నిన్ను నిందింపగానే, దానికై కోపమొంది యొక్క తెను

డించి రావచ్చునా? సీత మాటలతోడ సంబంధము నీకేమిటికి? చెప్పుము! నా యాజ్ఞప్రకారము నీవచట నుండక వచ్చినది నేరము కాదా? ఒకవేళ యీ మాటలు వినుట నీకు కష్టముగాఁ దోచినచో యచ్చోటు విడి యంతలంతల నైన యుండి రక్షింపవలయునుగాని యిటుల రాఁదగునా? మనలనే యిట్టిమాయలు పన్ని మోసగించుచున్న రాక్షసు లింక సయ్యబలను గికురింపక పోవుదురా? ఇప్పటికి క్రూరులు భూమిజను గొని పోనకుండుదురా? అయ్యో! బలు సంకటము తటస్థించినదిసుమీ? మాయా మృగాకృతి ధరించిన యాపాపాత్ముఁడైన దనుజుండు ప్రాణము విడుచునపుడు సయితము తన దుర్గుణము వీడక యటుల మిమ్ము పేర్కొని యఱచిచచ్చెను. ఆహా! వాని చాతుర్యము నేమని చెప్పవచ్చును? అటుల కూతపెట్టి యెన్నికష్టములు గలుగజేసెనో చూచితివా! ఇంక క్షణమైనను దడయరాదు. శీఘ్రముగాఁబోయి జానకిని శుభస్థితనుఁడు దానిగాఁ గన్నులఁ జూచినఁగాని మానసము నిలువదు ర"మ్మని పలుకుచు, మిక్కిలి విచారముతో కదలిపోవుచుండ దుర్నిమిత్తము లనేకములు దోఁచుచుండుటయుఁ గాంచి తమ్ముఁడా! ఈ దుశ్శకునములు చూడగా, నాలోన సందేహమును, భయమునుం గలుగుచున్నది. ఏలాగు కీడు మూడునో, తెలియకున్నది" యని యతి రయముతో జనస్థానమున కేగి పర్ణశాలం జొచ్చిచూచెను.

—(*) రాముఁడు పర్ణశాలయందు సీతం గానక పలవించుట. (*)—

సీతాదేవి లేమిచే, యా పత్రకుటీరము కళాహీనమై, చంద్రుఁడు లేని రాత్రివలెను, శారిక లేని పంజరమువలెను, కమలములు లేని కొలంకు వలెను, దీపము లేని మందిరమువలెను, పూఁదీవియలు లేని వనమువలెను ముక్కు లేని మొకమువలెను. కోకిలము లేని మావివలెను, సూర్యుఁడు లేని పగలువలెను, పాడువాఱి యుండెను. అట్టి యాపర్ణశాలంజూడగానే రామచంద్రుని యుల్లము జల్లుమని, ఒడలు వడంకగా దిగులును వ్యసనమును నగ్గలింపగా, నలుగెలంకులుంజూచి యామె జాడఁగానక, వెలుపలి, తిరిగెడి చోటులన్నియుం గలయ వెదవెద యూర్పుచు వెదక సాగెను. ఆమె జాడయే గానబడకుండుటయు మఱియు దిగులొంది తనలో ఇది యేమివింత? సీత యడుగుల జాడయే కనఁబడకున్నది.

ఎందరిగినది? నాకొఱకై తానును వెదకుచుం బోయియుండునా? లేక భయమున బ్రమందిన, మృగములు భక్షించియుండునా? కాదేని యెవఁడైనం గొనిపోయి యుండునా? ఏమైనది" యని తలంచి శోకబాష్పములు కన్నుల జాఱుచుండగా, నందందుం జని చూచుచు పిలుచుచు, గానరాకున్న వివశుండై ప్రలాపించుచు, వనమునందలి వృక్షలతా గుల్మములను, మృగపక్షి చయములను నడుగుచు భ్రమాకులచిత్తుండై జనకజ తన ముందటనుండిన చందమునఁ దోఁచిన సంతసింపుచు, ప్రేమాధిక్యతచే, బయలు కౌఁగలించి, సీత లేమికిఁ గుందుచు, బహువిధములం దలంచి యడలుచున్న యన్న రీతి జూచి సౌమిత్రి దుఃఖాక్రాంతుఁడై యిట్లనియె,

"అన్నయ్యా! ధైర్యమువీడి యిటుల చింతాసాగర మగ్నుండవై పరితపించుటచే లాభ మేమిగలదు? శోకమువలన దుఃఖము. జనకరాజనందన యెందైనం గొలనికిఁ బోయినదియో, పూవులుగోయుటకై పోయెనో, లేక మన మానసము లరయుటకై యెచ్చోట నేనియు దాగి యున్నదో గాక, మనము నలుకెలంకులను వెదకి, కానరాదయ్యెనని నిరాశఁ జెందఁదగునా? ఇంకను నీయరణ్యముఁ గలయ వెదకుము. మనల గికురించి పరిహాసమునకై చాటుమాటుల నెటనేని యుండిన నుండవచ్చునని తోఁచుచున్నది" యని చెప్పి యతని దోడ్కొని కాననమున వెదకుచు కొంత దవ్వు చని చూచి యెందును నామె పొడగానరాకుండుటయు శాంతవచనములు పలుకుచుం జనుచున్న సమయమున జానకి జానితమ్మునితో, "లక్ష్మణా! మందాకినీ, జనస్థానములం, బ్రసవణగిరిగాను ప్రదేశములను వెదకితిమి. ఎందును గానరాకున్నది. ఇంకఁ గొంతతడవు సీత కనబడకుండె నేని మదీయ శరాగ్ని నీ యరణ్యంబంతయు భస్మీకరించెద"నని పలుకుచు, మఱియుం గొంతదవ్వు చని యొక్కచోట జానకీదేవి ధరించియున్న పుష్పదామము బడియుండఁ "కాంచితివా! ఇది యిచ్చోటి కెటుల వచ్చినది? సీత యిందే యేవంకనో యుండవలయుంజుమీ!" యని చెప్పి యాతురతతో నటునిటుం గనుంగొనుచు నరుగుచు, ముందట నొక్కెడ సీత యడుగులును, రావణుని యడుగులును నుండుటంజూచి యవి సౌమిత్రికిఁజూపి "చూడుము! లక్ష్మణా! ఇవి

భూపుత్రి పాదచిహ్నములు ఇవి దనుజుని యడుగుల జాడగా దోఁచు చున్నది కాఁబట్టి రాక్షసుం డెవ్వఁడో సీతను గొనిపోయి యుండును. ఇదియే నిశ్చయము. నాయొద్ద జానకి యుండగా కన్నెత్తి చూచుటకైనను యముఁడు సయితము సాహసింపఁజాలఁడు. ఇప్పుడు నేను లేని కారణమున నిట్లు తటస్థించినది. ఈ యడుగుల జాడ యిచ్చట మాత్రమే కనబడుచున్నది. మఱి కానవచ్చుట లేదు. దనుజుం డేదిక్కున కేగెనో యెటకు గొంపోయెనో యది తెలియకున్నది. మన మింక యా రక్కసుండు పోయిన దిశను తెలిసికొని యావంక నరుగవలయు"నని దుఃఖించుచు గద్గద రవమున, బలికి యా పదముల గురుతును లక్ష్మణుండు సూచి, యన్న చెప్పినట్లు యుండుటయు దిగులునొంది తత్తరిల్లుచు, కార్యము తెఱంగు నూహించి, శోకాకులుండై తల్లట పాటునుం జెంది తపించుచున్న రామచంద్రు నూరార్చుటకు, దలంచి యతనికి ధైర్యము గలిగించుటకుం దగిన మాటలు పలుక దొడంగెను.

ఏడవ ప్రకరణము ముగిసెను.



# శ్రీ రామ వన వాసము.

## వచనకావ్యము.

### ఎనిమిదవ ప్రకరణము.



సీతాదేవి నన్వేషించుచు, రామలక్ష్మణులు వనాంతరములుసొచ్చి పోవుచుండగా, రఘుకులేశ్వరుండా యిందువదన వియోగముచేఁ గలిగిన యపారమైన వ్యసనమును సహింపలేక యామె గుణములును, చేష్టలును, పలుకులును, తనయందు గలిగియుండిన ప్రీతియుందలంచి, యంతంతకు నెక్కుడగుచున్న చింతచే వెతనొందుచుండుటంజూచి, సౌమిత్రి యా పుణ్యశీలునకుఁ దొడరిన మహాదుఃఖమున కెతయు మనమున నొచ్చి "రాఘవేశ్వరా! ఇటుల నీవు చింతాసాగర మగ్నుండవై యుండగా నేను చూచి సహింప జాలకున్నాను. ధైర్యవంతుఁడవై యుండియు నజ్ఞుని చందమున నడలుట యుక్తమగునా? కార్యము తప్పి వచ్చినపుడు దానికిఁ దగిన తెరవు నరసికొనవలయును గాని, చింతించినచో ప్రయోజన మేమియున్నది శోకింపకుము. ఎట్లయినను ప్రయత్నించి జానకి పోయిన తెఱంగుఁ దెలిసికొని యామెను గనుఁగొనుటకు తెరవు నూహించుట కర్తవ్యముగాని, ఇది శోకించుటకు సమయము గా"దని చెప్పిన విని రామచంద్రుం డతని కిట్లనియె

"లక్ష్మణా! నీవు చెప్పెడి పలుకులు నిజములేయైనను, యెంతదిక్కబట్టినను నా హృదయ పరితాపం బించుకయు నడంగకున్నది జానకి దెస నాకుంగల ప్రేమపాశము నన్ను పలువిధముల నలంచి శోకసాగర మగ్ననిఁ గాంచినది. ఏమిచేయుదును? నాదుఃఖము సూచిక కనికరించియే వేల్పులుగాని మునులుగాని మఱి యెవ్వరుగాని మదీయ మనోహారిణియగు మిధిలేశ సుతందెచ్చి యివ్వకున్నారు. పోయిన తెఱఁగైనం జెప్పకున్నారు. ఆహా! ఏమి చిత్రము ప్రాణ సమానయగా భూపుత్రి లేకుండినచో, నే నీ లోకమున జీవించియుండియుం బ్రయోజనములేదని తలంచుచున్నాను. ఆ సుందరాంగి యరిగిన చొప్పును దెలుపుట కొల్లని

యీ ప్రపంచమందలి భూతకోటిని నిర్మూలించి మదీయ మహోగ్రశ రాగ్నిచే త్రిలోకములును నాశ మొనరించి పిమ్మట ప్రాణములు తొఱఁగె దను" అని యుగ్రుండై పలికి వాఁడి బాణము సంధించి లోకములేర్చి భస్మీకరించుటకు యత్నించినఁ జూచి వారింపుచు సౌమిత్రి యమ్మహాత్ము నితో నిట్లనియె.

—(*) సౌమిత్రి రాముని కోపంబును శాంతిఁ నొందఁజేయుట. (*)—

"రాఘవేశ్వరా! శాంత స్వరూపుఁడవైన నీ వింతటి కోపోద్రేకమును వహించినాఁడ వేల? అకటా! నీవు కోపించినచో లోకము లెట్లు మనగలవు? లోక శరణ్యుఁడవును. లోక త్రాణుఁడవును, లోకేశ్వరుం డవునునై లోక హితార్థముగా దుష్టరాక్షస భంజనమునకుఁ గడంగి యవతరించిన పరమపురుషుండ విటుల నలుకఁబూనినచో నివారించ గలవా రెవ్వరున్నారు? స్వామీ! లోకము రక్షించుటకు బదులుగా సంహరింపఁబూనుట న్యాయమగునా? అదియుఁగాక, తప్పు జేసిన వానిని దండింపవలయునుగాని నిరాపరాధులను నీవంటి ధర్మవర్తనులు శిక్షింపఁ దలంపుదురా? సీత నెవ్వఁడో రక్కసుండు గొనిపోయెనని వానిపై బొడమిన కోపమున ప్రపంచమును దహింపఁదగునా? నిర్దోష జీవ తతిని నిర్మూలముఁజేయుట ధర్మమగునా? ఎవఁ డపకృతిఁ గావించెనో, వానిని వెదకి కనుంగొని శిక్షించుట కర్తవ్యముగాని, ఇటుల చేయుటకాదు. నా విన్నపము నాలకించి యీ యుద్రేకమును జాలింపుము. దేవా! మనము ప్రయత్నము విడువక, గిరులు, వనములు, నదులు, బిలములు, సముద్రములాదిగా, వెదకి, సీతను హరించినవానిని గానకపోయినను, దేవముఖ్యులు వాని తెఱంగుం దెలుపకుండినను, నటుపిమ్మట భవదీయ నిర్ఘాత సమాన బాణానలార్చుల లోకములు దహింపుగావుగాక. మొదటనే యిటుల చేయుట యోగ్యపద్ధతి గానేరదు. విజ్ఞుండగువాఁడు కార్యాకార్యముల తెఱంగు నెంచి యర్హపథము ననుసరించిన శుభంబగునని పెద్దలు పలుకుదురు. ఎవఁడు పొడమిన తన తీవ్రకోపంబు నడంచి ధర్మయుక్తంబులుగాని పనులకుఁ దొడఁగకుటను వీడి వర్తించునో యతం డెంతయు నుత్తమపురుషుండని యభిజ్ఞుల మతము. కావున నీ యాగ్రహంబు నుత్తమపురుషుండని యభిజ్ఞుల మతము. కావున నీ యాగ్రహంబు నుపశమించి కార్యంబు తెఱంగు నాలోజింపుము సీతానిమిత్తమున నజ్ఞుని భంగి దుఃఖించుట యుచితంబుగాదు. మన మెవ్విధముననైనను, సీతా

పహారునిం గనుంగొని పరిమార్చి పుణ్య గుణోపేతయగు సీతం గొని వృత్తము. మఱియొక విధమున నేదియుం దలంప వల''దని చెప్పెను. రాఘవేశ్వరుండు తమ్ముని పలుకులు విని యతని సమంజస వర్తనోద్దేశము నకలరి, యుద్రేకంబు నడంచి లోక సంహారోప క్రమణ భావంబు రుపీడి విల్లెక్కుడించి యతనితో యిట్లనియె.

"ఓయిలక్ష్మణా! నీవు మిక్కిలి బుద్ధిమంతుఁడవు. నీ పలుకులు నామనంబున కెంతయుం దృప్తికరములై యుండును. కాఁబట్టి యెటుల చేయఁదగునని నీవు చెప్పెదవో యటులనే చేసెదను. ఇపుడు మన మొనరింపవలసిన దెట్లు? ఎక్కడికి పోవుదము? ఎచ్చోట వెదకుదము? జనకజను గనుంగొనుటకు మనము చేయఁదగిన యుపాయం బెయ్యది? తత్ప్రికారంబు నెఱిగింపు"మనుఁడు, వివేక ధనుండైన లక్ష్మణుండు యోజించి "రఘుకులేశ్వరా! ఇంకను మన మీ జన స్థానారణ్యంబునంగల గిరి దుర్గవన బిలాదులందు వెదకుట మంచి"దని చెప్పిన వల్లెయని యనుజ సహితుఁడై యందందు రోయుచు పోవుచున్న తఱి నొక్కచోట, రావణ బాణాహతిచే పక్షంబులు తెగి, దారుణక్షత గాత్రుండై కదలలేక కుట్లూపిరితో బడియున్న జటాయువుంగాంచి, పర్వతోపమాన దేహుండైన యప్పక్షీంద్రుని తమ్మునకుం జూపుచు, వింటశరంబు సంధించి యుగ్రకోపానల దీప్తలోచనుండై రామచంద్రు డిట్లనియె. లక్ష్మణా! చూచితివా! వీఁడొక రాక్షసుఁడుగా నుండునని తోఁచుచున్నది. మహీసుత నపహరించినవాఁడు వీఁడుగానే యుండనోపును. ఆ యబలందెచ్చి మ్రింగి, మన రాకనుచూచి యివ్విధంబున మాయవిహంగ రూపమును దాల్చియున్న వాడుగా కనుపట్టుచున్నది. తీక్ష్ణములైన బాణంబులచే వీని ప్రాణంబులఁ గొనియెదను" అని పలికి శర ప్రయోగంబున కుపక్రమించుటయు నెఱింగి జటాయువు హీనస్వరంబుతో, డాయవచ్చిన రామచంద్రునకు వినవచ్చు నంతటి కంఠరవంబున "ఓరామా! రామా! ఆర్త శరణ్యా! పుణ్యస్వరూపా! నేను జటాయువును, మీ తండ్రియగు దశరథేశ్వరునకు ప్రాణ సఖుండను, నాపై భవత్కృపాదృష్టులు ప్రసరింపఁజేయుఁడు నాస్థితి యిటుల నగుటకు కారణంబుఁ జెప్పెదనువినుము'' మీరు లేని సమయంబున, లంకాపురాధిపతియగు దశాననుం డరుదెంచి మహీనందనను చెఱగొని పోవుచుండగాఁ జూచి, నేను వాని నరుగనీక రథంబున కడ్డంబునని, వాని రథంబును విఱిచి కవచంబుఁ జించి మేనుచిల్లులు

వడంబొడిచి నఖంబుల వ్రచ్చి బాధించుటయు, వాఁడు భూపుత్రిని డించి నాతోడ పోరొనరించి, నేను సుంత బడలుటయు ఖడ్గంబుచే నా పక్షంబులు దెగవ్రేసి రయంబున జానకి నెత్తికొని గగన పథంబున లంకకుం బోయె.''

అని చెప్పుటయు, నప్పులుగులఱేని పలుకులు విని రామ విభుండు సౌమిత్రితో "వింటివా! తమ్ముఁడా! ఆహా! ఎంతటి కష్టకాలము వచ్చినది? దైవతంత్రమున కన్యథా జరుగదుగదా! రాజ్యము తొలంగుట, తండ్రి మృతుఁడగుట, గహనవాసము సంప్రాప్తమగుట, జనకజ యెడబాయుట, మొదలగు దుఃఖములన్నియు నొండొంటి ననుసరించి తటస్థించుటయు నది చాలక, అయ్యో! మన తండ్రికి ప్రాణసఖుండైన యీ పక్షివరుఁడు నాపక్షమున దుష్ట రాక్షసునితో పోరి ఱెక్కలు తెగిపడి యుండుటంగనగా, మఱియొక వ్యసనమునన్ను ముంచివేసినదిగదా! ఏమి చేయుదును?" అని వగచి ధనుర్బాణంబులు క్రిందఁ బడవైచి జటాయువుంజూచి "విహంగోత్తమా! నాకొఱకై నీవిటువంటి యాపదను బొందవలసిన వాఁడవైతివి ఆ పాపాత్ముఁడైన దైత్యాధముఁడు సీతంగొని యేదిక్కున కరిగెను?" అని యడిగిన యాపరానిశోకాతిరేకంబున పుడమిపైఁబడియె. లక్ష్మణుండును నట్లన పడి కొంతవడికి తేఱి శోకంబు నడంచికొని రోదనంబుఁ జేయుచున్న యన్నంగని, యతని పాదంబులనొత్తుచు "రాజశేఖరా! శాంతిబొందుము. భవద్వియోగంబున కోర్వజాలక మనతండ్రి లోకాంతర గతుండయ్యె భరతుఁడు రాజ్యభారంబువహింపుమని ప్రార్థించిన, జనకుని వాక్యంబులు సత్యంబులగునట్లు వనవాసంబును కడపి యయోధ్యకరిగి రాజ్యపాలనంబును గావింపఁ బూనునట్లు వాగ్దానంబును గావించినాఁడవుగదా! సీతంబడసి మరలి పురంబున కరిగి భవదాగమనంబును గోరుచున్న పౌరులు, మంత్రులు, తల్లులు, సోదరులు మొదలుగాఁగల వారికి సంతోషముఁ గలిగించుటకు యత్నింపుము. విరక్తినొంది యివ్విధంబున దుఃఖించుట నీవంటి యుత్తమపురుషునకుఁ దగిన పద్ధతిగా" దని పెక్కుతెఱంగుల బోధించిన తెలివినొంది రామచంద్రుండు జటాయువుం గనుంగొని, "పక్షివల్లభా! ఆ రాక్షసుని వృత్తాంతమునుఁ వానిచేఁ బట్టువడిన సీత నన్నుఁగూర్చి పలికిన మాటలును సవిస్తరముగాఁ దెలియఁబలుకు" మని యడుగుటయు, జటాయువు హీనస్వరంబున, గన్నుల నీరుగార్చుచు యిట్లనియె.

"సముద్రమధ్యంబున లంకాపురం బను మహాపురంబు గలదు. దానిని పాలించువాఁడును, మహా బలవంతుఁడునునైన రావణుండ నెడిరాక్షసనాథుండు చనుదెంచి జానకిం గొనిపోయె. ఆ లంకాపురము దక్షిణపు దిశయందుండును. కాఁబట్టి మీరు యామ్య సముద్రమందలి యుప్పురంబున కరిగి యా ఖలుని సంహరించి భూసుతంగొని రావలయును. రామచంద్రా! నీవు దుఃఖింపవలదు, అనతికాలంబున నీకు సీత లభింపగలదు. ఆ సాధ్వితోఁగూడి యయోధ్యకరిగి పట్టాభిషిక్తుండవై సకలవిధంబుల రాజ్యభోగంబులు ననుభవించెదవు. ఇది సత్యము నేనింకప్రాణంబులు భరింపనోఁప మీ దర్శనంబు గలుగుటచే ధన్యుఁడనైతి"

—(*) శ్రీరాముఁడు జటాయువున కగ్నిసంస్కారంబుఁ జేయుట. (*)—

నని పలికి ప్రాణంబులు విడిచెను. అదిచూచి రామచంద్రుండు తమ్మునితో "లక్ష్మణా ఈ పక్షీంద్రుం డుపకారముఁ జేయుటకు వచ్చి రావణునితో ఘోరయుద్ధం బొనరించి నేలఁగూలి మృతినొందె. ఇవ్విధంబునుజూచిన, నామనంబున సీత పోవుటకంటె నధికంబైన దుఃఖముపొడముచున్నది. ఇవ్విహంగేంద్రుండు ధశరథావనీశ్వరునివలె మనకుపూజ్యుండును మాననీయుండును నగును. కావున మన మితని కగ్నిసంస్కార మొనర్చుట కర్తవ్యంబు. చితి సిద్ధముఁజేయు"మనిన, సౌమిత్రియట్ల కావించి యగ్నిమథించి తెచ్చిన, నయ్యిరువురుంబట్టి యెత్తి జటాయువు నా చితిపై నిడిరి. అపుడు రామచంద్రుండు వహ్నినిడి, "నాకొఱకైపోరి ప్రాణములు తొఱంగి, నాచే దహింపఁబడిన యీ పక్షీంద్రుండునా యనుజ్ఞ నుత్తమలోకంబులఁ బొందునుగాక" యని పలికి దహించి, యవ్వనమున నొక హరిణిజంపి, తదీయ మాంసంబున, పచ్చని కడిమిపట్టున, జటాయువ్రుందలంచి దర్భప్రస్తారితముగాఁ బిండముపెట్టి విప్యుక్తక్రమమునఁ బ్రేతకృత్యముఁ దొలఁగఁజేసి, గోదావరి కరిగి కృతస్నానుండైయా పుణ్యనదీ జలముల ధర్మోదకంబిచ్చిన, మహా పుణ్యుండైన రాఘవేశ్వరునివలన సత్కృతుండైన కతను, రణ నిహతుం డగుటచేతను, జటాయువు, పుణ్య దేహముఁదాల్చి, యత్యంతంబైన పుణ్యలోకమునకరిగె.

అంత రామలక్ష్మణులు సూర్యాస్తమానంబగు నంతకు మగుడిపర్ణశాల కరుదెంచి సీతఁదలంచి శోకసాగర మగ్నులై యా రేయి నచ్చోటకడపి, వేగుటయు, లేచి యా శూన్యగృహమువిడిచి, శరచాపములు

ధరించి సీతాన్వేషము సేయుచు, పశ్చిమాభి ముఖముగా దిరిగి, జనస్థానమును దాఁటి మూఁడు క్రోశముల దూరముపోయి, క్రౌంచపతిగాంఢి బ్రవేశించి, బహుతర పక్షిగణాన్వితమును, నానావిధ పుష్ప ఫలశోభితమును, వివిధమృగ నివహ సంచార యుక్తమునునగు నొక్కవనముఁ గని, యందు సీతను వెదకి, తమసా నదిం జేరవచ్చుటయు తత్సమీపాష నిస్థలిని, ముందట, నూర్థ్వకేశియు, లంబస్తనియు, నుగ్రగంధియు, కుండకుక్షియు, ఘూకస్వరయు, నగు భయంకరాకార నొక్కరక్కసిం జూచి, దాశరథు "లీ ఘోరరూపిణి యెవ్వతెయో" యని తలంచుచుండ. నది త్వరితముగా వారలఁ జేరవచ్చిఁ తటాలున సౌమిత్రి కరముఁబట్టుకొన, వికృతములైన కోఱపండ్లు వెలికి దోఁచుచుండ, నగుచు "ఓ సుందరస్వరూపా! అయోముఖియను పేరుగలదానను, నేను రాక్షసస్త్రీని నీసొబగుంగాంచి నిన్ను మోహించివచ్చితి నాయందు కనికరించి నాతోడఁ గూడి యిష్టరతులం దేలింపు"మని ప్రార్థించెను. లక్ష్మణుండు దానిన్జూచి యసహ్యతనొంది "ఛీ! ఆవల బొమ్మని చేయివిడిపించుకొని పాఱద్రోచిన యది పోవక మోహావశయై వెండియుం జేరవచ్చుటయు దాని సాహసముఁగని, నానా కర్ణ స్తనములుగోసి "ఓసి నిశాటీ! ఇపుడు నీవు మిక్కిలి సౌందర్యవతి వైతివి. ఇట్లుండినంగదా పురుషులు నిన్నుఁ గని వలపుఁ బొందుదురు. ఇంక వచ్చిన పనియైనది బొ"మ్మని పరిహసించెను. అది యొడలంతయు నెత్తురుచేఁ దడియగా యాబాధ కోర్వఁ జాలక, వ్రాలుచు, సోలుచు సొక్కుచు, తూలుచు, నార్చుచుం గొంత దూరము పఱచి నేలఁగూలి ప్రాణములు తొలంగె. అయోముఖి చచ్చుటయు, నాకాశము బ్రద్దలగునట్లుగా నఱచిన యొకమహాధ్వని వినవచ్చుటయు, రామలక్ష్మణు లారావముపుట్టిన దిక్కునంగల వనముఁ జొచ్చి యది యెయ్యదియో యని తలంచుచు పోవుచుండగా వారి ముందట నొక పర్వతమువంటి స్వరూపము గనుపట్టెను. వారించుక సమీపించి, జంఘారహితుండును, వనమృగ మాంసభక్షణ నిమిత్తమున రక్తసిక్తంబై యొప్పు దంష్ట్రికరాళ వక్త్రుండును యోజన దీర్ఘబాహుండును, భయంకరాననుండును, దారుణాక్షి యుగళుండును వృష

—(*) రామలక్ష్మణులు కబంధునిఁ గాంచుట. (*)—

భమువంటి కంఠంబుగలవాఁడునునైన యా మహదాకారునిఁ జూచి వాఁ డొక ఘోర నిశాటుండని యెంచి తద్రూపమును గని యచ్చెరువొందు

ఛుండ, కబంధ దేహుండైన యా రాక్షసుండు, రామలక్ష్మణుల విలోకించి భయంకరముగా నార్చి యోజన దీర్ఘములైన బాహువులచే నయ్యిరువురను, రాహుగ్రహము గ్రహణ సమయమునం బోలె పొదవి యదల్చి పండ్లుగుఱుకుచు, "ఓరి మనుజాధములారా! విండ్లు నమ్ములుం బట్టి యుండుటంగని నేను వెఱతునని తలంచితిరా? ఇంక మీరెట్లు తప్పించుకొని పోవనేర్తురు? నాచేఁ జిక్కినవానికి బ్రతుకేది? కాలుని బారినుండియైన తప్పుకొనవచ్చునుగాని, నావలన విడిపించుటకు సాధ్యముగాదు. మిమ్మిరువుర నిప్పుడు మ్రింగెద"నని యుగ్రముగాబలికి యిరువురను చేరఁబట్టి నోటియొద్దకుఁ జేర్చుచుండ, దుఃఖాక్రాంతుఁడై సౌమిత్రి యన్ననుజూచి రాఘవేశ్వరా! ఎట్లును యిద్దురాత్ముండు మనల విడువఁడు. వీనిచేఁ జిక్కుకొంటిమి విడవడఁజాలము. కాఁబట్టి నీ విపుడు నన్ను వీని కప్పగించి నేను భక్షింపఁబడుచున్న సమయమున నీవు తప్పించుకొని పొమ్ము. నా ప్రాణములుపోయి వీని కెరయైన నయ్యెదనుగాని నీవైనం బ్రతికియుండఁగలవు. అదియ చాలు"ననిన విని రఘువీరుండు తమ్ముని పలుకులకు మనమున గుందుచుండ నయ్యసురుండు వారిందిగిచి వక్త్రంబుఁ దెఱచి మ్రింగుటకు దమకించుటంగని మహాధైర్యముతో రాముండు ఖడ్గముఁగొని తటాలున వాని భుజముం దఱుగుటయు, నదియ యదనని రెండవబాహువు సౌమిత్రి తెగనేసె, ఇట్లు బాహుద్వయముం ద్రెంచి రాక్షసుని పట్టు విడిపించుకొనిన పిమ్మట వాఁడు, భయంకరముగా నఱచుచు, నెత్తుటంబొరలుచు, మహాశైలము కరణి, నచ్చోటి వృక్షములు నేలఁ గూలునట్లును, మృగపక్షి గణములు కలతనొందునట్లును భూమిపైఁ గొంతతడవు గిరగిరం దిరుగుచుండి, యనంతరము దశరథ నందనులంజూచి "అసమాన శౌర్య ధనులరైన యోమహనీయులారా! మీరెవ్వరు? ఈవనమున కేల వచ్చితిరి?" యని యడిగెను. వానింజూచి రామచంద్రుఁడు కనికరించి తమ వృత్తాంతము సర్వమునుం దెలియఁబలికెను. తమ వర్తమానము నెఱింగించి నంతట లక్ష్మణుఁడు వానింగని "ఓయీ! ఱొమ్మున కన్నులుగలవాఁడవై మేననంటిన నోరును భయంకర శరీరముతో నొప్పుగా, కబంధరూపమున నుండెడి నీ వెవ్వఁడవు? నీ యుదంతమును జెప్పు"మని యడిగెను.

వారి చరిత్రమును విని నంతట యా రాక్షసుండు సంతోషమును జెంది "దశరథాత్మజులారా! పరమ పుణ్యస్వరూపులరైన మిమ్ము పొడ

గని ధన్యుఁడనైతి. ఇంక మీ కృపావిశేషముచే మదీయ శాపముదీఱి దివ్య స్వరూపమును ధరించెదను ఇటువంటి యసహ్యపు ఘోరరూపము నాకుఁ గలిగిన నిమిత్తము జెప్పెదను. కరుణా సహితచిత్తులరై యవధరింపుఁడు" అని చెప్పఁదొడంగె.

—(*) కబంధుఁడు తన వృత్తాంతము రామలక్ష్మణులతో చెప్పుట. (*)—

"అయ్యలారా! ఇది మత్స్వీయం కృతాపరాధ ఫలమునఁ బడసిన రూపము, నా పూర్వపు పేరు దనువు కాంతి యందు చంద్రుని, తేజమున సూర్యుని, భోగముల నింద్రుని ధిక్కరించి మహదైశ్వర్యసుఖముల ననుభవింపుచు, తపముచే పరమేష్ఠిని మెప్పించి కామరూపమును చిరంజీవితత్వమును వరములుగాఁగొని గర్వించి హింసారతిని వర్తించుచుంటిని, ఒకనాఁడు స్థూల శిరుండనెడి ముని యాశ్రమమున కరిగి ఇట్టి వికృతాకారముదాల్చి యమ్మునిని ముందట దిరుగుచుండగా, అతఁడు నన్నుచూచి మదీయ కపటవర్తనము నెఱింగి యలిగి "ఓరీ! నీవు యిటువంటి రూపమున నుండుట నెంతయుం బ్రియమునొంది ఈ యాకృతిం దాల్చినాఁడవు. కావున నింక నీవీ యాకారముతోడనే యుండుము. నీ గర్వమున కిదియ ఫలము పొమ్మ"ని శాపంబొసంగె. అంత నేను భీతిల్లి తపోధనునకు నమస్కరించి "స్వామీ! నా యపరాధముక్షమించి శాపావసానము ననుగ్రహింపు"మని ప్రార్థించిన కనికరించి "అయోధ్యాపతి యగు దశరథ రాజనందనులు నీబాహువులు ద్రుంచిననాఁడు నీకు శాపము దీఱఁగలదు వారిచే నీ దేహము దగ్ధముఁ గావింపఁ బడనేని భవత్పూర్వ స్వరూపము సంఘటిల్లఁగల"దని యాదేశించె.

పిమ్మట నేను దేవేంద్రుని యొద్దకుఁబోయి సంగరమునకుఁ బిలిచిన, యతం డుగ్రుండై వచ్చి వజ్రాయుధముచే కంఠమును, కాళ్ళను, తలయు బొట్టలోని కడఁగునటుల వేసిన నేను చిరంజీవి నగుటం నెఱిఁగి, "ఇట్లే వీనిని బ్రతికి యుండనిచ్చెదను గాక" యని యెంచి కడుపునవక్త్రమును, పక్షమున గన్నులునుం గలిగి యుండునట్లుచేసి, యోజనాయతములైన బాహువులనొసంగి పొమ్మనుటయు, నాఁటగోలె నేనీ యరణ్యమునందుండి యామడ దవ్వున సంచరించుచుండినను, సింహ, వ్యాఘ్ర, సైరి, భైణాది జంతువుల మదీయ బాహువులచేఁ బెనచిపట్టిభక్షింపుచు పెద్దకాలమున నుండియు నిట్లు పడియున్నవాఁడను. నేను రాక్షసుఁడ, ఇది భవదీయ చరిత్రము పావనాకారులైన మిమ్ము బొగడను

భాగ్యము నేఁటికి సమకూరె''నని పలుకుటయు, రామచంద్రుఁడు తమ్ముని జూచి "లక్ష్మణా! ఇతఁడు పెక్కు వత్సరములనుండి యిందున్నవాఁడు కావున దశాననుని యెఱింగియుండునని తోఁచుచున్నది. వాని వృత్తాంతంబడిగి తెలిసికొంద'' మంచుబలికి కబంధునితో "ఓయీ! మేము జనస్థానముననుండగా మమ్ము గికురించి పంక్తిముఖుండు జనకనందనఁగొని పోయె, వాని యున్నచోటును, నచటికి బోదగిన మార్గమును, మొదలుగాఁగల విషయములు దెలియఁజెప్పుమా!'' యన్న వాఁడు "రామచంద్రా! ఈ స్వరూపమున నిట్లు బాధ నొందుచుండగా నే నేదియు బలుకఁజాల, సూర్యాస్తమానమునకు లోపల నా యీతనువును దహించితిరేని, నాపూర్వరూపముఁ బొందుదును. అపుడు నాకు జ్ఞానమును నధికంబై పూర్వోత్తర విషయములు మనో గోచరములగును. అంతట సర్వమునుం జెప్పెద. శీఘ్రముగా యీ దేహము దహింపుఁ'' డని ప్రాణములు విడిచిన, రామలక్ష్మణులు కట్టియలుపేర్చి వానిపై కబంధ దేహమునిడి మథనా నలమున దరిగొల్పిన, యా శరీరము దగ్ధంబగుటయు, నప్పుడ దివ్యవస్త్ర మాల్యాభరణ భూషితములైన సర్వాంగములు శోభిల్లి, నాకాశమున దివ్యవిమానారూఢుండై, తన దివ్యతేజమున దశదిశలు వెలిగించుచు దివ్యుండైన కబంధుండు రామచంద్రునితో నిట్లనియె

—(*) దివ్యరూపుఁడైన కబంధుఁడు రామున కుపాయంబు సెప్పుట. (*)—

"ఓ రాఘవేశ్వరా! ఇంతకు పూర్వము నీవు నన్నడిగిన విషయమునుగూర్చి చెప్పెదను వినుము. మహా సత్యవంతుఁడును లంకాధిపతియు రాక్షస నాయకుఁడునునగు పంక్తిముఖుఁడు మీరు లేని సమయమున వచ్చి మోసగించి క్షితీసుత నెత్తుకొని లంకకుపోయె. అతం డజేయపరాక్రమ వంతుడగుటచే మీరు సులభముగా నతని జయింపఁజాలరు. బలవంతుడైన శూరుని సహాయము గలిగినంగాని యీ కార్యము మీకు సాధ్యమగునదికాదు. దీనికి నేనొక యుపాయముఁ జెప్పెదను. ఆకర్ణింపుము. ఇచటికి కొంతదూరమున ఋష్యమూకమను పర్వతంబొకటి కలదు. కిష్కింధకు పతియైన వాలియను వానరరాజుచే తరుమఁగొట్టఁబడి యతని తమ్ముడు సుగ్రీవుండనువాఁడు నలుగురు మంత్రులతో వెడలివచ్చి యాకొండపై వాసముఁ జేయుచున్నాఁడు. అతఁడు కడు బలవంతుఁడు, కృతజ్ఞుఁడు, మఱియుం గామరూపి, యతనికి వానర బలగం

చెప్పఁగలఁడు. అచటికిఁబోయి నీ వతనితో సఖ్యముఁ జేయుము. సుగ్రీవుండు మిక్కిలి పరాక్రమవంతుఁడగుటచే నీకు సహాయము నొనరింపఁగలండు. అయ్యగచర శ్రేష్ఠుని యండగాఁ గొని రావణుని మదం బడఁగించుటకుఁ గడంగుము. సుగ్రీవుండు దేశకాలజ్ఞుండు వాలివలన భీతిచేఁబోయి సకల దేశములుంజూచి యందుంగల విశేషము లెఱింగి వచ్చినవాఁడు. కావున మహావీరులైన వానరులంబనిచి ఎక్కడనున్నను రావణుని సాధించి సీతం దెప్పించి నీకు సమర్పింపఁగలండు. కౌసల్యానందనా! అతని సహాయముచే నీకు తప్పక మేలు కలుగును. దశాననుని సాధించి సీతం దోడ్కొని నీవు సంతోషముతో నయోధ్యకుఁ బోవుదువు. ఈ మార్గమున పడమరగా నడిచి నానావిధ ఫల భరిత బహుతర వృక్ష సముదయముల వలనను, రమణీయ పుష్ప లతా వితానములవలనను, శోభిల్లు వనములం జూచుచు, నందందు గావలసిన ఫలములు రాల్చి భుజింపుచుం జని క్రౌంచ బక బలాహకాది విహంగముల తోడను, కమల కల్హారాది పుష్పముల తోడనుం గూడి విరాజిల్లుచుండు పంపా సరోవరమునొద్ద కరిగి యట విశ్రమించి తత్సమీపస్థ ఋష్యశృంగమునందుండు సుగ్రీవునితో సఖ్యముఁజేయుము. కార్యసిద్ధి యయ్యెడు. నింక నేగుఁ''డని పలికి రామలక్ష్మణులచేత ననుజ్ఞాతుండై సూర్య సంకాశ తేజోవిరాజితంబైన దివ్యరూపముతోడ కబంధుండు నాగలోకమునకుం బోయెను.

అంతట దశరథనందనులు కబంధుండు సెప్పిన చొప్పున కొంత దూరముపోయి యటనొక కొండంగాని దాని సమీపమున యా రాత్రి వసించి మఱునాఁడు ప్రొద్దుపొడుపునఁ గదలియటనుండిపూర్వాభిముఖులై చాల దవ్వు నడిచి పంపాహ్రద పశ్చిమ దేశముఁజేరి యచ్చోట, బహు

—(*) రామలక్ష్మణులు శబరి యాశ్రమంబునకుఁ బ్రవేశించుట. (*)—

కుసుమ ఫలభరిత తరు విలసితంబైన శబరి యాశ్రమముఁగని, యందు సొచ్చిన వారి రాకంగాంచి శబరి యెదురుగా నరుదెంచి కృతాంజలియై నమస్కరించిన రామచంద్రుం డామెతో యిట్లనియె.

"పుణ్యావర్తనీ! నీవు విఘ్నము లెవ్వియుం బొరయక తపముఁ జేయుచు, విజితేంద్రియ వృత్తిఁ గైకొని, గురువులఁ బూజింపుచు, సుఖమున నుండెదవా? అపుడపుడు సంయమీంద్రులు నీయొద్దకువచ్చి నీవలన పూజలు గైకొని పోవుచుందురా?" యని యడుగుటయు, నామె

భక్తియు, వినయమును నొప్పగా "స్వామీ! భవత్కృపా విశేషమునం జేసి సర్వమును భద్రంబగు నీ శుభదర్శనము గలుగుటచే నేను తపస్సిద్ధినిం బొందితిని. దేవా! వినుము మీరు చిత్రకూటమున వసించి యుండగా? కొందఱు ఋషు లిచ్చోటికి వచ్చిరి. భక్తితో నేను వారి నర్చించిన యమ్మహాత్ములు సంతుష్టులై నన్నుంగని "శబరీ! భవ్యస్వరూపులైన రామలక్ష్మణు లొక నిమిత్తమున నిచ్చోటికి రాఁగలరు. వారి రాక నిరీక్షించుచుండి నీ మహాత్ముల నర్చించి వారి కృపనొంది పుణ్యలోకమున కరుగు"మని యాదరమున నాదేశించిపోయిరి. అది మొదలు మీకొఱకై మేలైన ఫలవర్గములు సమకూర్చి మీరాక కెదురుచూచుచుంటి. నా పురాకృత పుణ్య విశేషమున నేఁడు మిమ్ముఁ గనుఁగొను భాగ్యము గలిగినది నాయందు కరుణించి నావలన పూజలొంది నే

—(*) శ్రీరాముఁడు శబరిం గరుణించుట. (*)—

నొసంగు ఫలాదులు స్వీకరించి నన్ను ధన్యత నొందింపుఁ"డని ప్రార్థించెను. రామచంద్రుం డాతపస్విని వేడికోలున కంగీకరించి, యామెవలన పూజలు గైకొని యనుజ సహితుండై వన్యఫలములను గైకొని సంతుష్టి నొంది "తపస్వినీ! మున్ను నీ ప్రభావమును దనుసుతుఁడు చెప్పగా వింటిని. ఇపుడు ప్రత్యక్షముగా కనుఁగొంటిని. నీవు మహా పవిత్ర చరిత్రవు, నీ శీలం బత్యధికంబైనది" యనిన యామె రఘుపుంగవునిజూచి "రామచంద్రా! యీ యరణ్యమున మతంగ వనంబను పుణ్యస్థానం బొందుగలదు. అందు జంతువులకు జాతి వైరములేదు అందలి మునుల మహిమచే యచ్చోట దేవతా విరచితంబైన వేదిక గలిగియున్నది. పెక్కునాళ్ళకు పూర్వ మా వేదియం దొక గృహము నిర్మించుకొని, మద్గురువులు జ్వలనుని నర్చించి బహుళంబగు హోమము గావించిరి. ఆమహిమ యెట్టిదియోగాని యచట దర్భ లెండుటయుం బువ్వులు వాడుటయును లేదు. మహాత్ములైన యా ఋషిశ్రేష్ఠులు బహుత రోప వాసములచే స్రుక్కిన వారగుటచే, తీర్థస్నానమున కరుగలేక సప్త సాగరములందలంచి, యా తీర్థములన్నియుం దమయొద్దకే వచ్చుటయు, వారలు స్నానంబొనరించి, తాము కట్టిన వల్కలముల నిచ్చోటనేబెట్టి దివమున కరిగిరి. రఘువల్లభా! ఆ వల్కలము లవిగో! వున్నవి చూడుము

మహాత్మ్మ ఏ నమ్మునీశ్వరుల సేవకురాలఁగాన, వారికి శుశ్రూషసేయు వారలున్న పుణ్యస్థానమున నీకళేబరమును విడిచి పోవం గోరెద. నన్ను జ్ఞయొసంగు"మని ప్రార్థనగావించి రామలక్ష్మణులచేత ననుజ్ఞాతయై తన్ను నగ్నిహోత్రున కాహుతిఁజేసి, యాశబరి గురువులున్న స్వర్గలోక మునకు దివ్యమూర్తితోడ చనియె.

ఇవ్విధమున శబరి యేగుటయు నాశ్చర్యమొంది రామభద్రుండు తమ్మునితో "చూచితివా! శబరీ ప్రభావము! లక్ష్మణా! ఈ యాశ్రమ మున మునులు సప్తసముద్ర తీర్థములను రప్పించి యధిక తపము సలి పిరి, ఇటువంటి పుణ్యస్థానమును జేరి పితృ తర్పణం బొనరించి కృతా ర్థులమైతిమి. ఇది వర్ష శతములైన నుండ నర్హంబైన పుణ్యస్థలము, కాని మనము కార్యాసక్తులమగుటచే నిలువ వలనుగాదు. ఋష్య మూ కాచలమునకుఁబోయి రవిసుతునితో సఖ్యముజేసి సీతాన్వేషమునకుఁ ప్రయత్నింప వలసి యున్నది" యని పలికి ప్రయాణంబై పోయి ముందట, తాలతక్కోలహింతాళ రసాల సాల చందన వటప్రముఖా నేక హావృతమును, బహువిధ పుష్పితలతా సందోహ విరాజిత తీర భాగమును, కమలహల్లక కల్హార షంజురంజితమును, నిరంతర చం

—(*) పంపా సరోవర వర్ణనము. (*)—

చరీక నికర ఝుంకారనినాద కలితమును, నానావిధ జలవిహంగ సముద య కోలాహల సమన్వితమును, రంగత్తరంగ సంచయ శోభితమును, ప్రవిమలాంభః పరిపూర్ణమును నైరమణీయముగా నొప్పుచున్న పంపా సరోవరమునుగాంచి, తదీయ విలక్షణతా విశేషముల కచ్చెరువు నొం దుచు జేరంబోయి యచ్చోటంగల శృంగారమును కన్నుల పండువుగాఁ గని దాని సౌభాగ్యమును వర్ణించి మెచ్చుచు, తత్సమయమున రామ చంద్రుండు సీతందలంచి తద్వియోగ దుఃఖమును సహింపఁజాలక, లక్ష్మ ణునితో యచ్చోటి విశేషముల వర్ణించి పలుకుచు, జనకనందన లేనికత మునదా నొందుచున్న విరహ వేదనాతిశయమును దెలుపుచు, వగచు చున్నంగని, సౌమిత్రి యన్నకు సంభవించిన శోకములం దలంచి లోలోన

ఖిక్కిలి వగపుఁజెంది, పెక్కు తెఱంగుల నూరడిలఁ బలికి" దేవా! విజ్ఞుఁడవైన నీవీరీతిని శోకించుట కార్యముగాదు. ఊఱటఁ గైకొని, ధైర్యము విడువక త్వరితముగా సుగ్రీవుని యొద్దకుఁబోయి యతనితోడ చెలిమిఁజేయుదము ప్రయాణము గ"మ్మని చెప్పిన, లక్ష్మణుని మాటలకు సమ్మతించి రామచంద్రుండు ఋష్య మూకమునకు పయినంబయ్యె. అంత వారలు పంపాసరోవరము నుత్తరించి కొంతదూరముచని, ఎదుట, గరుడ గంధర్వ కిన్నర ప్రముఖ దివిజ గణములు సంచరించుచు చుండునదియు సింహ వ్యాఘ్ర ఋక్ష సారంగ సైరభకిరి కిటి శరబాధి మృగముల కునికిపట్టయినదియు, పల్లవ, కుసుమ ఫల భరిత తరు సముదయ యుక్త మహోన్నత శృంగ విరాజితమును, విమల శీతలాము సరిర్ఘ్ఝర సహితమును. మహా రమణీయమునునగు ఋష్యమూక పర్వతమును చూచి యన్నర వరోత్తములు సంతోషచిత్తులై తత్సమీప ప్రదేశముఁన విశ్రమించి కర్తవ్యమునుగూర్చి యాలోజింపుచుండిరి.

ఎనిమిదవ ప్రకరణము ముగిసెను.



# శ్రీ రామవనవాసము.

## వచనకావ్యము.

### తొమ్మిదవ ప్రకరణము.



రవిసంకాశ భాసుర తేజులును, కార్ముక బాణ కృపాణధారులను మహా విక్రమాఢ్యులునైన రామలక్ష్మణులు ఋష్యమూకము చేరువ విశ్రమించియున్న సమయమున ఋష్యశృంగ పర్వతముపై మంత్రి చతుష్టయ సహితుఁడైయున్న సుగ్రీవుండు వారలంజూచి మంత్రులతో "అదె

—(*) సుగ్రీవుండు రామలక్ష్మణులంగని భయంబుఁజెందుట. (*)—

చూచితిరా! ఘోరశాస్త్ర పాణులై మునివేషములతో యున్న యీ యిరువురును వాలిపంపున కపటవేషములుదాల్చి మనకు కీడుచేయువారై వచ్చియున్నట్లు తోఁచుచున్న యది. ఇపుడు మన మేమి చేయుద''మని వెఱపుఁజెంది చెప్పిన వారును రామలక్ష్మణుల ముని వేషధారులఁ గాంచి భయభ్రాంతులై ''వనచరేశ్వరా! ఇంక మన మిచ్చోట తడవు నిలుచుట మేలుకాదు. మఱి యెటకైనఁబోవుటయ కర్తవ్యంబని చెప్పి యతిరయమున పరుగెత్తి యన్యవనమునకుం బోయియుండిరి. తత్పూర్వము వారి యొద్ద లేక యొందేనియుం బోయియుండిన హనుమంతుడపుడు వారలఁ జేరవచ్చి రవినందనుంగని "కపివల్లభా! ఇచ్చటి కేల వచ్చినాఁడవు? నీ కింతటిభయం బెవ్వరినిఁ గనుటచేఁ గలిగినది?" యని యడిగినవారు కారణము నెఱింగించుటయు "ఓహో! ఈ కారణముననా? వెఱచి వచ్చితివి. ఆ యిరువురును వాలిచేఁ బంపఁబడి వచ్చినవారుకారు ఎట్లనగా, పూర్వమువలె వాలి యిపుడు నిన్నుఁగూర్చి విరోధమును సాధించుచుండుట లేదు. కావున నతఁడు పనిచిన వారలని తలంచుట వట్టి భ్రమయేకాని మేలుకాదు. నీవు బాగుగా యోజనఁజేయక వెఱ్ఱితలంపున లేని భయమును జెంది తత్తరిల్లుచున్నాఁడవు. భయము విడువు" మనిన సుగ్రీవుండు వాతాత్మజు జూచి "హనుమంతా! నీవు ధైర్యమున నిట్లు పలుకుచున్నాఁడవు గాని నా మనమున సంశయము తొలంగకున్నది. వాలి నాయెడ

నధికమైన పగఁ బూనియుండుటచే, నాకుఁ గీడుచేయు తలంపున కపటో
పాయము లెన్నియైనం దలంచునుగాని యూరకుండువాఁడు కాఁడు. ఎం
దును రాజులను నమ్మఁగూడదు. తమ కప్రియులుగా నుండువారి నేయుపా
యముచేతనైనను వారు తెగఁజూచుచుందురు. కాఁబట్టి నమ్మి యేమరి
యుండరాదు. బుద్ధిమంతుఁడు శత్రువిషయమున కడు జాగరూకుఁడై
యుండవలెను. నీవు యెన్నివిధములఁ జెప్పినను నా సంశయము తొలం
గదు. నేను నమ్మఁజాలను, ఇట్లే నమ్మి యేమరియుండి ప్రాణము మీఁ
దికి వచ్చినపుడు కష్టములొందఁ బాలగుటకంటె ముందుగనే యప్రమ
త్తుఁడై యుండి రానున్న యిక్కట్టులను తప్పించుకొనుట శ్రేయస్కరము.
అయినను నీవింత దృఢముగా పలుకుచున్నాఁడవు. కావున వారియొద్ద
కరిగి, వారలెవ్వరో, ఈ ప్రదేశమునకు వచ్చిన కారణం బెయ్యదియో
యడిగి, వారి మాటలవలనను ప్రసంగములవలనను, నేర్పున కలరూపుక
దెలిసికొనుము. నిజముగా వారలు మనుజులే యైయున్నచో, తగినవిధ
మున సమ్మానము నొనరించి మనకు క్షేమముగలుగ నాశీర్వాదములు
గైకొనిరమ్ము పొమ్మ"ని చెప్పిన హనుమంతుం డట్ల యగుఁగాక యని
యనుజ్ఞఁ గైకొని రామలక్ష్మణు లున్నయెడ కరుదెంచి, వారిం బ్రియో
క్తుల నగ్గించుచు యిట్లనియె.

—(*) హనుమంతుండు రామలక్ష్మణులతో సంభాషించుట. (*)—

"మహాత్ములారా! అసమాన తేజోవిరాజితులును, సకల శుభలక్ష
ణ శోభితులును, ఆజానుబాహులును, రమణీయ రాజలక్షణ సమన్విత
లును, పుణ్యస్వరూపములఁ జెన్నొందుచున్న వారలును, ధనుర్బాణ
ధరులునునైన మిమ్ముఁజూడఁగా యీ ప్రపంచంబంతయు నేలఁదగిన వార
లని తోఁచుచున్నది. ఇటువంటి సర్వ గుణాభిరాములైన మీరు జటా
వల్కలములు ధరించి ఈ పర్వత పరిసర ప్రదేశమునఁ దిరుగుటకు కార
ణమెయ్యది?. మీరెవ్వరు? ఎచ్చోట నుండువారలు? ఇటుల నడిగితినని
కినియక మీ వృత్తాంతము నెఱింగింపవలయు నని ప్రార్థించుచున్నాను.
భవ్యమూర్తులారా! సుగ్రీవుఁడను వానరాధిపతికి నేను ముఖ్య మంత్రినై
యుండువాఁడను, వాయుపుత్రుఁడను హనుమంతుఁడనెడి నామముగల
వాఁడను. మా ప్రభుండైన రవిసుతుండు తన యన్నయైన వాలితో వి
రోధించి యతనివలని భీతిచే మంత్రులంగూడి చనుదెంచి యీ ఋష్య
మూకాచలముపై వసించియున్నాఁడు. అతఁ డిపుడు మీ రిచ్చోటికి

వచ్చి యుండుటంగాంచి, మీతోడ సఖ్యము నెరపుటకుఁ దలంచి మీ వృత్తాంతం బరయుటకై నన్ను మీయొద్దకుఁ బుత్తెంచి వచ్చినాఁడ. కా కాబట్టి కరుణించి మీరిచ్చోటికి వచ్చిన నిమిత్తమును మీవృత్తాంతమును, దెలుపుఁ"డని యడిగెను.

అతని పలుకులు విని రామచంద్రుండు మందస్మిత వదనారవిందుఁడై తమవృత్తాంతమును నెఱింగించుటకు సౌమిత్రి కాజ్ఞాపించిన యతండు హనుమంతునింగని "ఓయి కపికులశ్రేష్ఠుడా! వినుము. అయోధ్యాధిపతియగు దశరథ మహీపతికి మేము నందనులము. ఈ మహాత్మునకు నేను తమ్ముఁడను, ఇతనిపేరు రాముఁడు నానామము లక్ష్మణుండు, ఒక కారణమున తండ్రివాక్యము సత్యముఁ జేయుటకై, ఈ పురుషోత్తముఁడు సతీసహితముగా, నేను వెంట వచ్చుచుండగా వనవాసమున కరుదెంచి యచ్చోట వసించియుండగా రాక్షసుం డొక్కండు మోసగించి, ఈ రాజన్య శిఖామణి భార్యయగు సీతంగొనిపోయెను, యామె జాడఁగానక మేము వెదకుచు వచ్చుచుండగా, నొకచోట మునిశాపమున రాక్షసుండై యున్న దనువను వాఁడు మమ్ముఁగాంచి "మహాత్ములారా! మీరు ఋష్య మూకముననుండు సుగ్రీవునియొద్ద కరిగితిరేని యతనివలన సర్వ విషయములను మీరెఱుంగ గలరు పొం"డని చెప్పిన సంతసించి సుగ్రీవుని సఖ్యముఁగోరి మేమిచ్చోటికి వచ్చితిమి. మేము పురమునుండి వచ్చినపుడే యిట్టి మునివేషములు దాల్చితిమి ధైర్య, శౌర్య, గాంభీర్యాది లక్షణములు గలవాఁడయ్యు రామచంద్రుండు భార్యా వియోగ దుఃఖము సహింపఁజాలక మిక్కిలి శోకించుచున్నాఁడు. ఇప్పుణ్యశీలుని దుఃఖమును నేను చూడఁజాలక వగచుచున్నాఁడ" ఇది మావృత్తాంతంబని" చెప్పిన లక్ష్మణుం గనుంగొని హనుమంతుం డతని నూరార్చుచు నిట్లనియె.

—(*) శ్రీరామ సుగ్రీవులకు హనుమంతుండు సఖ్యంబుఁ జేయుట. (*)—

"సుమిత్రా కుమారా! సుగ్రీవుం డన్నయైన వాలితో యుద్ధముఁ జేసి చేపచెడి యతండునుం దన యాలిని గోల్పడి రాజ్య భ్రష్టుండై పట్టణమువిడిచి సంపదలు తొలంచి, వనములందును దుర్గములందును నానా కష్టములు ననుభవించుచున్నాఁడు. ఈ సమయమున నతనికి మీకును సులభముగానే సఖ్యము కలుగును. మీరును నతండును స్నేహముగల వారలై కలిసియుండినయెడల నెంతటి కార్యమైనను నవలీల జరుగును.

కపిబలముల సహాయముతో రవిసుతుండు మీకు తోడ్పడఁ గలఁడు. అటుల నయ్యోనేని ధారుణియెల్లను సాధింపవచ్చును సంశయింపవలసినది లేదని చెప్పిన సంతోషించి, లక్ష్మణుం డన్నతో "నేను చెప్పినమాటలకు సమ్మతించి యీ హనుమంతుఁడు మనకు సహాయుఁడగుటకు సిద్ధముగాయున్నాఁడు. కావున మిత్రనందనునకు మనకును త్వరితముగనే సఖ్య మేర్పడఁ కల"దనుటయు, ముదమంది రామచంద్రుండు హనుమంతుని సంభావించి "హనుమంతా! సుగ్రీవుండు సూర్యపుత్రుండు, మేమ నినవంశ సంభూతులము కావున మాకు సూర్యునివలన సంబంధముగలదు, మేమొండొరులము మైత్రిగలవారమై యుండుట యర్హమే యగును. నీవు మాకు నతనికిని సంబంధమును గలిగింపు" మనుటయు, సంతసించి రాజనందనులు కృతకార్య సిద్ధులైరని యెంచి వారలం దోడ్కొనిపోయి శైలోపరి నొక్కచోట యెడ గలుగనిలిపి తానరిగి సుగ్రీవునిఁ బొడగని రామలక్ష్మణుల వృత్తాంతముఁజెప్పి, "వానరేశ్వరా! నీతోడి సఖ్యమున కా రఘుకులుఁ దోడ్కొనివచ్చితి కృతార్థుండ వైతివి. ఆ రామచంద్రుండు ధర్మజ్ఞుండును కృతజ్ఞుండును, సత్యసంధుండును, పితృవాక్య పరిపాలకుండును, నధిక బలపరాక్రమ సహితుండును, నాశ్రితవత్సలుండును, నగుంగావున నీ మనోరథసిద్ధి కాఁగలదు. నిన్నుఁ గనుఁగొన నేతెంచిన యమ్మహానుభావుని నభి వందనపూర్వకముగా సంభావింపు"మని చెప్పిన హనుమంతుని వాక్యములకు సంతోషించి, తనలో వాలివలని భీతి తొలంగినట్లు నిశ్చయించి సమ్మదంబెసంగ హనుమంతునితోఁగూడ నేతెంచి రామలక్ష్మణులఁ బొడగని భయభక్తి వినయము లతిశయింపగా వారి పాదారవిందములకు నమస్కరించి కృతాంజలియై రామచంద్రునిఁజూచి "నరేశ్వరశేఖరా! నీదు విజయ ధర్మ సత్య పరాక్రమాదులను పవన సుతుండు చెప్పగా విన్నాఁడను.

—(*) శ్రీరాముఁడు సుగ్రీవునితో సఖ్యంబుఁ జేయుట. (*)—

చూచినంతట సర్వమును సత్యంబగుట నెఱింగితి. భవదీయ శుభదర్శనమువలన నాకు రాజ్యవిభూతి సిద్ధించుట నిశ్చయము. వానరబృంద సహితముగా, నీతోడ సఖ్యముఁ జేయవలయు"నని దృఢముగా బుద్ధి పొడముచున్నది. రామచంద్రా! నమ్మిక బుట్టుటకై యొండొరులము ప్రమాణ మొనరింప వలయు''నని రామచంద్రుని చేయిఁబట్టుకొనిన యతండు సుగ్రీవు నాలింగన మొనరించె. అంతట లక్ష్మణుం డగ్నిమథించి

తెచ్చిపెట్టిన రాము సుగ్రీవు లిరువురుం బ్రదక్షిణ మొనరించి వహ్నిసాక్షిగా నిష్కళంక చిత్తములు గలవారలై సఖ్యముఁ జేసిరి. ఇట్లు జాతవేదుఁడు సాక్షిగా సఖ్యంబొనరించి నంతట యది కానందమున పరస్పర ముఖావలోకములు సేయుచుండి రప్పు రక్కజుం డర్కవంశ భవునితో "కకుత్సకులవరేణ్యా! ఇఁక నీవు వగవ వలదు. భవదీయార్ధాంగ లక్ష్మియగు మహీసుత దేవలోకమునుండినను, పాతాళమున నుండినను, లేక సముద్రములోనుండినను వెదకితెచ్చి నీకు సమర్పించెదను. సంశయింపకుము. రామచంద్రా! మఱియొక విశేషము నాకర్ణింపుము సీతాదేవిని రావణుండు గొనిపోవుచుండగా నేనును నా మంత్రులును యీకొండపై విహరించుచుండి యామెను చూచితిమి. "హా రామా! రామా! హాలక్ష్మణా! దుష్టాసురునిచేతఁజిక్కుపడి నేనుపోవుచున్నాను త్వరితముగావచ్చి నన్ను రక్షింపుఁడని పలుకుచు రోదనముఁ జేయుచుండెను. ఆ సాధ్వీమణి దీనాలాపములు విని మిక్కిలి జాలిఁజెంది మే మందరము నట్టె కనుచు నిలిచియుండగా, తన భూషణములు పైఁట చెఱంగుజింపి మూఁటగట్టి మామందు పడునట్లు వైచెను ఆమూఁట గైకొని నేను భద్రముఁజేసి యున్నవాఁడను, అది తెమ్మనినఁ గొనివచ్చెద" నని చెప్పిన రఘువల్లభుండు తెప్పింపుమని చెప్పెను.

—(*) సుగ్రీవు డిచ్చిన భూషణోత్తరీయంబులు గని రాముండు వగచుట. (*)—

అట్లు రామచంద్రుం డాజ్ఞాపించుటయు, సుగ్రీవుండు తానేపోయి పర్వతగుహాంజొచ్చి యందు భద్రముగా దాచియున్న సొమ్ములమూఁటం గైకొని వేగమునవచ్చి యమ్మహీపాలుని ముందుబెట్టెను. ఆసొమ్ములును వస్త్రమునుం జూడగానే రఘుకులుండు మహాశోకమున కన్నుల భాష్పధారలు గురియుచుండగాఁ నల్లన మూర్ఛిల్లి కొంతవడికి తెలివినొంది వాని నక్కునం జేర్చియు ముద్దుఁబెట్టుకొనియు జనకజయందుగల యత్యంతంబైన ప్రేమచే యామె తనముందటన యున్నవిధంబునఁ భ్రమించిన పలువిధంబుల సంభాషించుచు పరితపించుచుండి యెట్టకేలకు మనంబు పదిలపఱచుకొని పరమ సాధ్వీరత్నంబైన యా కోమలాంగి నవ్విధంబున కపటోపాయంబుచేఁ గొనిపోయిన రక్కసుని దుర్వర్తనంబును దలంచి యధికమైన రోషావేశంబు గలవాఁడై రవిపుత్రునింజూచి "ప్లవగేశ్వరా! ఆ రాక్షసాధముఁడు జానకింగొని యెచ్చోటికిఁ బోయినదియు మీరెచ్చట చూచినదియు వాఁడు నివసించు స్థలంబును సర్వమును వివరముగా

నెఱిఁగింపుము. ఖలుండైన వాని నస్మదీయ భయంకర శాస్త్రానల జ్వాలలచే భస్మీకరించెదను, నాచేఁ జచ్చుటకొఱకే వాని కిటుల దుర్బుద్ధి గలిగినది. ఇంక వాఁడు బ్రతుకఁజాలఁ"డని మహా దుగ్రుండై పలికిన కపీశ్వరుండు కోపాటోప శమనముగా నిట్లనియె,

రాఘవేశ్వరా! యుద్రేకమును వేగిరపాటును నడంపుము, జానకీదేవిం గొనివచ్చుటకుఁ దగిన ప్రయత్న మొనరించెద వనచర బల సమన్వితుఁడవై యరిగి పంక్తికంఠుని సంహరించి భూపుత్రిం గైకొనిదిగంత విశ్రాంతంబైన కీర్తినిఁ దాల్పుము. ఇంతలో నింత వేగిరపడ నేమిటికి? మైథిలినింగురించిన చింతను మానసమునఁ దొలంచి ధైర్యముఁ బాదుకొల్పి కర్తవ్యముఁగూర్చి యోజింపుము. దుఃఖమునకు చిత్తమునఁజోటు నొసంగరాదు. దానివలన సకల కార్యములకును భంగము వాటిల్లును. శోకమగ్నునకు సుఖము గలుగనేరదు. కాఁబట్టి సర్వార్థ సాధకంబైన ధైర్యమును విడువకుండుట యుత్తమపథము. సఖుండనైన నావాక్యములాదరించి, చింతను వీడియుండుము. అనతికాలమున నెల్లకార్యములును ననుకూలములై ప్రవర్తిల్లఁ గల"వని చెప్పిన యతని వాక్యములు విని రామభద్రుండు మనమునఁ దొడరిన కోపమును రోషమును ఆవేశమును శోకమును నడంచి శాంతిల్లి "మిత్రనందనా! నీ హితోక్తులముచే మదీయ చిత్తము వికసించినది. నీ చెప్పినట్ల కోపశోకములు విడిచితి. ఇంక సీతందెచ్చుట యెట్లో యేవిధమున రక్కసుని సంహరింపఁ గలమో దీనికై మనమేమి చేయవలెనో చెప్పు"మని యడిగెను.

ఇట్లు చెప్పి, వెంటయు రాఘవేశ్వరుం డతనిఁగని "రవినందనా! నీకేదేనియుం గోరికగలదేని చెప్పుము. అది యెట్టిదైనను నొనరించి నీకు సంతోషమును గలిగించెద నిన్ను సంతుష్టి నొందించుటయే నాకు ముఖ్యమైన కర్తవ్య"మనిన కీశపతి ముదమంది రామచంద్రున కిట్లనియె. "దేవా! ఇటువంటి భవదీయ వచన సుధాధారలు నాకర్ణముల కెంతయు నానంద మాపాదించుచున్నవి. నీవును నేనును నొక్కటియై చేసెడి యే కార్యమునకును భంగము వాటిల్లదు. దేవలోకమునైనను తృణలీల సాధింపఁగలము. నీతోడ సఖ్యము గలుగుటంజేసి, మిత్రులయందును, నా బంధువులయందును, ప్రతిష్ఠ జెందినవాఁడనైతిని. నేనెంతయు ధన్యుఁడను, మఱియుం బూజ్యుఁడను రామచంద్రా నన్ను నేను పొగడుకొనరాదు గాని, అయినను జెప్పెదను. నేను నీకు తగిన మిత్రుఁడను కొ

ముగా యితరులు చెప్పగా విని నీవు మదీయ యోగ్యతా విశేషము లను దెలిసికొనఁగలవు. నీ వంటి యుత్తమోత్తమ పురుషునితో చేసిన చెలిమి వలన నాబోంట్లు కృతార్థులగుదురు. ఇంక నా కోరిక లన్నియు ఫలించినట్లే తలంచుచున్నాను" అని పలికి యటఁ జని యొక్క సాలతరు శాఖ విఱిచివైచి దానిపై రఘువల్లభునిఁ గూర్చుండఁజేసి చెంత దాను నుంగూర్చుండె. అంతట నాంజనేయుండు మఱియొక కొమ్మందెచ్చి లక్ష్మ ణుని దానిపై నాసీనుంగావించె. ఇట్లందఱుం గూర్చుండి నంతట సుగ్రీ వుండు కన్నులనుండి దుఃఖ భాష్పములు రాలుచుండగా, దీనవదనుండై రామునితో నిట్లనియె.

—(*) రామునితో నిజవృత్తాంతంబుఁ జెప్పుట. (*)—

రవికులనాయకా! మదీయ చరిత్రమును చెప్పెద కృపచేసి యవ ధాన మనస్కుండవై యాకర్ణింపుము. కిష్కింధా పురాధిపతియైన వాలి యనువాఁడును నేనును, నన్నదమ్ములము. అతఁడు నాపై పగఁబూని దయా దాక్షిణ్యములును, ధర్మాధర్మములునుం దక్కి క్రూరబుద్ధితో నాభార్య నపహరించుకొని, నన్ను పురమున నుండనిక వెడలగొట్టె మహాబలవంతుం డగుటవలన యతనికి వెఱచి యీ నామంత్రులతో వచ్చి నేని ఋష్యమూకాద్రిపైఁ జేరి చెప్పరాని కష్టములపాలై దుఃఖిం చుచున్నాను. నేఁటికి నాకష్టములు దీఱు సమయమువచ్చినదనెడి తలం పుగలిగినది. మహీవల్లభా! నాయందు కృపకలవాడవై నాదుఃఖమును నివారింపవలయు. ఇదియ నాకుంగల కోరిక'' యని చెప్పి శోకించెను. అతని దుఃఖముఁగని కరుణామయుండైన రామచంద్రుండు మనము గర గి కనికర మతిశయింపగా నూరార్చి "వానరేశ్వరా! చింతింపకుము. పరుల కుపకారముఁ జేయవలసిన విధమును నేనెఱుంగుదు. పరమ సఖుండవైన భవన్మనోదుఃఖము తొలగించుట నాకు కర్తవ్యము గాదా? అతి దారుణములును పరపీడ నాశకరములును నైన మత్సాయకము లచే నీకెవం డపకృతిం జేసెనో ఎవఁడు నిన్ను కష్టములును దుఃఖమును నొందించెనో యా దుశ్శీలుండైన వాలిని దునిమి నీక్లేశము నివారించెద ఇంక దీనికై నీవు మనమున చింతింపకు" మనిన సంతసించి సుగ్రీవుం డిట్లనియె.

స్వామీ! యా వాలి సామాన్యుండు గాఁడు జగదేక వీరుఁడు మహా బలశాలి మహోన్నత శైలములను సయిత మవలీలఁ బూవుల

చెండ్లనుంవలె మింటి కెగరవేయుచుండును. అతని సామర్థ్యము దెలియుటకై యొక దృష్టాంతముం జెప్పెద వినుము. అసదృశ బలాఢ్యుండైన దుందుభియనెడి పేరుంగల రక్కసుండు తనతోడ నెదిరించి నిలిచి పోరంగల మేటి వీరుల లోకములం గానక గర్వించి హిమవంతునియొద్ద కరిగి "పర్వతోత్తమా! రమ్మా! నాయొక్కయు నీయొక్కయు బలాబలము లెఱుంగవలయు. సమరకాంక్షచే వచ్చితి"నని పిలిచిన హిమవంతుండు వాని జయింపంగల శక్తి తనకుం గలుగమిం దలంచి వానిచే తనకు వెఱుపు లేకుండుటకును పరునిచే వానిని జంపించుటకు నుపాయముం జింతించి "దుందుభీ! నీవు మహాబలశాలివగుటచే నేను పోరుటకు శక్తుండంగాను, యుద్ధముం గోరుదువేని కిష్కింధకుంజని తన్నగరాధీశుండైన వాలికి బ్రియంబైన మధువనమునుజొచ్చి చీకాకు పడంజేయుము. అది యెఱింగివచ్చి యతండు నీతో కయ్యముం జేయంగలడు. ఆవాలి యొకండు దక్క యన్యులెవ్వరును నీతోడం బోరంజాల" రని చెప్పిన సంతసించి వాడు రయమునం జనుదెంచి హిమవంతుండు చెప్పినట్లు గావించుటయు నది యెఱింగిపోయి పురందర నందనుండైన వాలి రక్కసునితో పోరి వధించె. పర్వతోపమానమైన యాదనుజుని కళేబరము వాలియో నేనో దక్క యన్యులు కదల్పజాలరు. అటువంటి శక్తి సామర్థ్యములు గల వాలిని జంపుట సులభ సాధ్యమైన కార్యము గానేరదు. అతం డీ చొప్పటంగల ఏడు తాటిమ్రాకుల యాకుల నతి లాఘవమున నొక చేతిలో నొక్కసారిగా దూసివైచుచుండును. అవిగో! అవియు యా వృక్షములు, ఇపుడు రామచంద్రా! యా తాళముల నేడింటి నొక్కయమ్మునం గూలనేసితివేని వాలినిం జంపుదువనెడి నమ్మకము నామనమున దృఢంబగు'' ననిన నగి రఘువరుం డొక్కబాణముం బ్రయోగించి యాచెట్ల నేడింటినిం బడవేసె. అదిగని సుగ్రీవుం డాశ్చర్యముంజెంది యమ్మహాత్మునిచే వాలి నేలంగూలుట నిక్కంబని యెంచి రామభద్రుం గాంచి వెండియు నిట్లనియె.

స్వామీ! యొక నిమిత్తమున నతని రాజ్యము నేను పాలించుటవలన నాపై నధిక కోపముంగొని నాభార్య నపహరించి నన్ను పురి వెడల నడచి, నా యాప్తులను బాధించి నిరంకుశుండై వాలి రాజ్యసుఖంబు లనుభవించుచున్నాండు. ప్రాణమునకంటె నెక్కుడైన నాప్రాణేశ్వరిం గైగొనుటం దలంపగా నా మనం బెరియుచున్నది. ఇవ్విధమున

నేను కష్టములొంది కుందుచున్నాఁడ ఏమిచేయుదును? కష్టసుఖములు గలిగినపుడు రెంటికిని సహాయుండు సఖుఁడయని పలుకుదురు. నీవు నా ప్రియ సఖుండవగుటచే జరిగినది జరిగినట్లు చెప్పినాఁడను" అనెను.

—(*) సుగ్రీవుండు మాయావియను దనుజుని వృత్తాంతంబుఁ జెప్పుట. (*)—

ఈక్రమమున కపినాయకుండు తనకు కలిగిన కష్టములం జెప్పుటయు విని కటకటంబడి రామచంద్రుం డతనింగని "కుమారా నీయన్నయైన వాలికిని, నీకును విరోధము సంభవించిన విధంబెట్లు? అతని కంతటి కోపము నీపైఁ గలుగవలసిన కారణం బెయ్యది? తద్విషయమును వివరముగాఁ దెలియఁబలుకుము. నేను విన్నంతట యతని బలం బెట్టిదియో తలపోసి తగిన యుపాయముఁ దలంచి వధించి నీకు సంతోషమును గలిగించెద" దని పలికెను. ఆ పలుకులువిని యచ్చట నుండిన వారలును, సుగ్రీవుండును ప్రముదిత చిత్తులై, రామచంద్రుని స్తుతించిరి.

పిమ్మట హరిసుతుండు తనకును వాలికిని, విరోధము కలుగుట కారణంబైన వృత్తాంతమును దెలుపఁ దలంచి యిట్లని చెప్పందొడంగె. "రఘుకులేశ్వరా! వినుము. మాతండ్రి రాజ్యము పాలించి మృతినొందిన పిదప మంత్రులు వాలికి పట్టంబుఁగట్టిరి. అతండు రాజ్యాభిషిక్తుండై వానర కులాధిపత్యముఁబూని పాలించుచుండె నేనన్ననో, యతనికి బాసటగా, చెప్పిన కార్యములను క్రమముఁదప్పక కావించుచుంటిని. ఇట్లు కొంతకాలము కడచినంతట స్త్రీసంబంధంబైన యొకవిరోధముచే దుందుభియను రాక్షసుని పెద్దకొడుకు మాయావియనెడి వాఁడు పురము నెల్లరును నిద్రించుచుండగా నిశీథ కాలమున, కిష్కింధా నగర ద్వారమున కరుదెంచి భయంకరముగా నఱచుచు, పౌరుల యుల్లంబులు తల్లడిల్లఁజేసి తనతో యుద్ధముఁ జేయుటకు రమ్మని వాలిని పిలచెను మహాసత్వసహితుఁడైన యారక్కసుని పలుకులు విని మిక్కిలి కోపముఁ గొని వాలి వానితో సమర మొనరింపఁబూని పోవుచుండగా నతని భార్యలును నేనును, నడ్డముసొచ్చి పోవలదని వారించితిమి. మహాదాగ్రహంబుచే మా పలుకు లాదరింపక వాలి మమ్ముఁ బాయఁద్రోచి వానిపై కురికెను. అపుడతనికి సహాయముగా నేనును, నన్న వెంటనే పోవుటయు, మాయావి మమ్ము నిరువురంగాంచి భీతినొంది పరుగెత్తి పోవఁదొడంగె. కాని వాలి వానిని విడువక తరుముచుం బోవఁగా నేనును, వెనుకనే పోవుచుంటిని. రాక్షసుం డవ్విధమునఁ గొంతదవ్వు పోయి యొక పర్వ

శమున గడ్డిచే వాలి గానరాక మూసికొనియున్న గుహలోఁ జొచ్చెను.
అపుడు వాలి వెంట వచ్చుచున్న నన్నుఁగని, యా రాక్షసుని వధించి మరలి తాను గుహ వెలువడి వచ్చువరకును, బిలద్వారంబున గావుగా నుండవలసినదిగా దిట్టముఁజేసి యుగ్రుండై యాగుహలో ప్రవేశించెను నేను బిలద్వారమున నప్రమత్తుఁడనై కావలి యుంటినిగాని యెన్ని దినంబులున్నను, నతండు రాఁడయ్యె అట్లు యొక సంవత్సరము కడచెను. అంతట బహుళంబుగ నార్పులును, పెడ బొబ్బలును గుహాంతరముననుండి వినవచ్చి, పిమ్మట దనుజుం డార్చుటయు, బిలంబులోనుండి యధికముగా నెత్తురు కండలతో వెలికిఁ బ్రవహించుటయుం దోచిన, నేను వివేకహీనుండనై వాలియే మృతినొందెననియు, నచ్చోటనుండి నచో మాయావి నన్ను సయితము వధసేయుననియు నెంచినవాఁడనై, పెద్ద రాయిదెచ్చి యాబిలద్వారంబును మూసి, విధిక్రమముగా వాలికి తిలోదకంబు లొసంగి వ్యసనాక్రాంతుఁడనై పురంబునకువచ్చి తద్వృత్తాంతముజెప్పిన మంత్రులు మొదలుగా నందఱును నతని మరణమునకు చింతించి యరాజకం బగునని యెంచి, నన్ను రాజ్యాభిషిక్తునిఁ గావించిరి.

నేను రాజ్యపాలనముఁ జేయుచుండగా, వాలి మాయావింజంపి గుహవాకిట నేను బెట్టిన రాయిం ద్రోచివైచి కిష్కింధకువచ్చి, ప్రభుండనై యున్న నన్నుగని కినుకఁజెంది నా యాప్తులంబట్టి బంధించుటయు, నపు డతని సంహరించుటకుఁ దగిన బల సహాయముఁగల వాఁడనై యుండియు, నేను ధర్మపథముఁ దొలంగి నడువనొల్లక నమస్కరించి, యన్న తండ్రికి సమానుండనుట నెంచి, జరిగిన వృత్తాంతంబు సర్వమును సత్యముగా వివరించి "అగ్రజా! నేను కోరి నీరాజ్యముఁ గైకొనలేదు. అరాజకంబగునని యెంచి మంత్రి ముఖ్యులు నాకు పట్టముఁగట్టిరి. నీ రాజ్యమును నీవే గైకొనుము. నేను నీ సేవకుఁడనై వర్తింపఁ గలవాఁడ" నని వినయమునఁ బ్రార్థించిన, నతండు నా పలుకులు నమ్మక తన కపకారముఁ దలంచిన వానినిఁగా నిశ్చయించి నన్ను కనికరములేక కట్టిన పుట్టములతో పురము వెడలఁగొట్టించి నా ప్రియసతిని సయితము తాన గైకొనియె. అంత నా వియోగమున కోర్వని ఈ మంత్రులంగూడి వచ్చి నేని ఋష్యమూకముఁజేరి కాలముఁ గడపుచున్నాఁడను. ఇప్పర్వతము మీఁదికివాలి రాజాలఁడు. అతనికి శాపము గలదు. అది యెఱింగి

యున్నవాఁడ నగుటచే యిచ్చోట నిర్భయముగా నున్నవాఁడను. అత
నికి శాపముగలిగిన కారణముఁ జెప్పెద నాకర్ణింపుము, అదియెట్లనగా.

—(*) సుగ్రీవుండు దుందుభి వృత్తాంతంబుఁ జెప్పుట. (*)—

వేయిమదపుటేనుంగుల బలముఁగలవాఁడు దుందుభియనెడి రాక్షసుండొకండు మహాగర్వితుండుండెను. వాఁడొకనాఁడు సముద్రునియొద్దకరిగి తనతో యుద్ధమున కతని బిలిచెను. సముద్రుండా రక్కసునియుద్రేకముచూచి మంచిమాటలతో తాను సంగరమునకుఁ జాలమింజెప్పి, "రాక్షసోత్తమా! హిమవంతుండు కడు బలాఢ్యుండు అతనితోఁడఁ బోరు"మని పనిచెను. వాఁడు మంచు కొండకరిగి హిమవంతుని పోరునకుఁ బిలిచిన యతండు వాని గర్వము నడంపనెంచి "శూరాగ్రేసరా! నీతో ననిఁ జేయుటకు నేను శక్తుండనుగాను. కిష్కింధకుబోయి వాలితో యుద్ధముఁ జేయుము నీకు సమానుండతం డొక్కఁడుండే కలుం"డని పలికి పొమ్మనుటయు, మదోన్మత్తుఁడైన యా యసురుండు కిష్కింధకు వచ్చి, పెల్లుగా నార్చి గర్జిల్లిన వాలి చనుదెంచి వాని తలంపునెఱిగి, మిక్కిలి కోపమును జెంది తొడరి యన్నిశాటునితో పోరి నిజ బలసామర్థ్యములు మెఱయగా వానిని వధించి, యాకళేబరమును కాలితో మెగజిమ్మిన యది యీ ఋష్య మూకమునఁ తపముఁ జేయుచుండిన మతంగముని ముందుబడి యమ్మహాత్మునిపై శోణితము చిందిపడుటయు నలిగి యది వాలిచేసిన పనియగుట నెఱింగి, "మదాతిరేకమున నట్లు చేసిన వాలిని ఋష్యమూకము నెక్కినవాఁడు వాని శిరము వేయివ్రక్కలగుఁ గాక'' యని శాపమొసంగె. అది కారణముగా వాలి యిప్పర్వతమును జేర వెఱచుచుండును. ఈ వృత్తాంతము నెఱింగియున్న కతన నేనిచ్చోటికివచ్చి యతనివలన బాధలొందక నిర్భయుండనై యున్నాఁడను" అని చెప్పి మఱియు నిట్లనియె.

రాఘవేశ్వరా! దుందుభి కళేబరం బదిగో! ఉన్నది చూడుము. వాలికాలఁ జిమ్మినపుడు యిచ్చటఁబడి యది యట్లేయున్నది. దానిని నీవు కాలితో మెగర మీటితివేని వాలిని జంపగలవనుట నాబుద్ధికి దృఢముగాఁదోఁచు"ననిన రామచంద్రుండా రాక్షస కళేబరమును తృణమునుంబోలె మూఁడు యోజనముల దవ్వునఁ బడులాగున నెగయఁజిమ్మె. అంతటితో సుగ్రీవుండు సంతుష్టినొందక "రఘునాయకా! బుద్ధికిధైర్యము గలుగుటకై నేనడుగుదానికి కోపమును బొందకుము. ఈ దుందుభి శరీ

ర్థము మాంసశోణితముతో యుండగా వాలి చిమ్మెను. అపుడు కడు భారముగానుండెను. ఇపుడన్ననో శుష్కించినది తేలికయైనది. దీనినిఁ జిమ్ముట నామనమున కాశ్చర్యకరమై యుండలేదు. ఇదిగో! శాలవృక్షములు, ఈ యేడింటి నొక్కశరమున నొక్కసారియ తెగిపడవేయుము. అపుడు నిన్ను వాలికంటె యధికుఁడవని నమ్మెద" ననుఁడు నవ్వుచు, రాఘవేశ్వరుం డతండు కోరిన చందమున నయ్యావనిజములం గూల్చె నదిగని సుగ్రీవుం డాశ్చర్యమునొంది "రామచంద్రా! ఇప్పుడు నాలోని సంశయమంతయుం దొలంగినది. ఆవాలిగాని మఱి లోకత్రియమున నెవ్వఁడుగాని నిను గెలువఁజాలడనుటఁ దెలిసికొంటిని. నీవు అద్వితీయ పరాక్రమ కలితుఁడవు. నిరుపమాన శక్తి యుక్తుండవు నీ మహిమ వర్ణింప నలవిగానిది. భవత్కృపా విశేషమున వాలిచే గలుగుచున్న భయముతొలంగి, సౌఖ్యమును జెందగలవని నమ్ముచున్నాను. నాకు కష్టదినములుపోయి మంచికాలము వచ్చుటవలన జగన్నుతుండవైన నీ వరుదెంచుటయు నీతోడ సఖ్యము గలుగుటయుం దటస్థించె" నని చెప్పెను.

అతని పలుకులకు కౌసల్యాపుత్రుండు సంతోషించి "వానరేశ్వరా! తడవుఁజేయక నీ యనుచరులంగూడి కిష్కింధకు ప్రయాణముఁ గమ్ము. నీవెంటనే. నేనును వచ్చెద"నిచెప్పి సుగ్రీవునిఁ ప్రయాణముఁ జేసి తానును తక్కిన వానరులును నతనివెంటఁగదలి కిష్కింధాపురము నొద్ద కరిగి యొకచోట దట్టముగా చెట్లుపెరిగి యున్నయట నిలిచి "రవినందనా! మరుగున నేనిచటనుండెద నీవు పోయి వాలిని సమరమునకుఁ బిలిచి, యతని నా దృష్టి పథమునకు వచ్చునట్లు చేయుము. అతనిని వధించి నీమనోరథ సిద్ధిఁగావించెద''నని పలుకుటయు ముదంబంది సుగ్రీవుండు కిష్కింధా నగరద్వారము కడకుఁ బోయి, వెల్లుగా భయంకర లీలనార్చె.

—(*) వాలి సుగ్రీవుల ప్రథమ యుద్ధము. (*)—

ఆ ధ్వని సుగ్రీవుం డార్చుటచేఁ గలిగినదిగా యెఱింగి వాలి కుపితుఁడై చనుదెంచి మహోగ్రమూర్తిగా మయిబెంచి యతనిం దాకెను. అపు డయ్యిరువురకును సంగరం బతిఘోరముగా బ్రవర్తిల్లుటయు, నొండొరులు జయకాంక్ష యతిశయింపగా పిరుదివియక సవ్యాప సవ్యములం దిరుగుచు, పెనంగుచుండిరి. తత్సమయమున మాటుననుండి

పొంచి వారి సమరము చూచుచున్న రామచంద్రుం డయ్యిరువురు రన్న దమ్ములు నొక్కరూపున నుండుటచే వాలియనియు, సుగ్రీవుఁడనియు నేర్పడ నెఱుగఁజాలక శర ప్రయోగముఁ జేయుటకు శంకించుచుండగా యుద్ధతుండై బలాధిక్యచే మించియున్న వాలిని జయింపఁజాలక సుగ్రీవుం డతనిచే మిక్కుటముగా దెబ్బలు దిని సత్వహీనుండై, నిలువతరము గాక మేనర క్త ధారలు గాఱుచుండగా పాఱిపోయి, ఋష్యమూక పర్వతము నెక్కెను.

అంతట లక్ష్మణ హనుమదాదులతోఁ గూడి రఘునాయకుండు సుగ్రీవునియొద్ద కరుగుటయు, కపివల్లభుం డమ్మహీపాల శేఖరునిఁగాంచి, "ఓయి రామచంద్రా! వాలి బలమునకు వెఱచి యతని నెదిరింప లేక యిందు కాలము గడపుచున్న నన్ను పురికొల్పి యవ్వాలిని జంపునట్లు నమ్మఁబలికి యతనితోఁడ పోరాడుటకుఁ బంపినాఁడవు. అయ్యో! నేనతని బారినుండి బ్రతికివచ్చినదియే యతిశయము, అన్యాయముగా నమ్మించి నను జంపింపఁ దలంచితివి. ఇది న్యాయమగునా? ఇటులు నసత్యముఁ బలుకదగునా?" యని ఖిన్నుండై పలికిన విని రఘువరుం డతనితో "వానరేశ్వరా! నాపై నలుకనొందకుము. నేను మిన్నకుండిన కారణమున జెప్పెదవినుము. నీవును వాలియు బోరుచుండగా శర ప్రయోగము నకుఁ దొడరితిని గాని గొప్ప సంశయ మొకటి కలుగుటచే యటుల చేయుటకు సాహసింప జాలనైతి. ఏమనగా, నీవును నతండును, నించుకయు భేదము లేనివారలై యొక్కరూపుగా యున్నందున, నిన్ను తెలిసికొని వాలిని జంపుటకు సాధ్యాము గాకపోయినది. ఎట్లు చేయవచ్చును? నీవే యోజింపుము. ఒకవేళ పొరబాటున నీవే వధింపఁ బడితివో యేమి కావలయును? ఉపకారముఁ జేయుటకు బదులుగా కీఁడు జేసినవాఁడ నగుదునుగదా! అదియునుగాక మన యత్నమంతయుం జెడిపోవకుండునా? కాబట్టి వేగిరపడి యేమియుం జేయరాదని మిన్నక చూచుచుంటిని. ఇపుడేదియు మించిపోయినది లేదు. వగవకుము" అని యూఱటఁబలికి లక్ష్మణుంజూచి "తమ్ముఁడా! సంగర సమయమున సుగ్రీవుని నే నెఱుంగుటకు చిహ్నముగా, నీవతని కంఠముం పుష్పహారము నొకదానిని తెచ్చిపెట్టు"మని యాజ్ఞాపించెను. తక్షణంబ సౌమిత్రి యన్న చెప్పినట్లు గావించెను.

రామచంద్రుని పలుకులు సత్యములుగాఁ దోచినందున సుగ్రీవుండు తనమనంబునఁ బొడమిన ధైర్యమును దుఃఖమునుపడి "దేవా! ఇంక కర్తవ్యంబెట్లు? ఆనతి యొసంగుమనిన, "వనచర వల్లభా! భయంబు నొందక వెండియు వారితోఁడ బోరునకు గడంగుము. ఈ మారతని వధించెదం జూడు"మనుటయు సంతోషించి, మరల కిష్కింధకు ప్రయాణంబయ్యె. అతనివెంట రామలక్ష్మణ హనుమత్ప్రముఖులుం బోయిరి. రాఘవేశ్వరుండు పూర్వముండిన స్థలంబుననే వృక్షంబుల చాటున నిలిచి సుగ్రీవునిఁ బొమ్మనిచెప్పెను. అతండును ధైర్యముతో కిష్కింధా నగరద్వారమున నిలిచి యార్చెను ఇట్లు పెల్లుగా నార్చుచున్న యింద్ర

—(*) వాలి సుగ్రీవుల ద్వితీయ యుద్ధము. (*)—

నందనుండు రోషభీషణ నయనుండై యధికోగ్రంబైన మూర్తితోఁడ నినజుని కెట్టకేలకుం జంపినకాని మరలనని వచ్చుచున్న సమయంబున భార్యయగు తారయనునది యడ్డంబుసొచ్చి పతితో యిట్లనియె.

"ప్రాణేశ్వరా! నాపలుకు లాదరించి, ఇపుడు రవినందనునితో పోరుట కరుగుటను మానుము. ఎందువలననగా, నీచే నవిధంబున మోదులంబడి యలసివెఱచి పాఱిపోయిన యతండిపుడు భయంబుదక్కి మరలివచ్చి నిన్ను మార్కొనిపోరుట కెంచుటం దలఁపగా నిన్ను జయింపఁగల యోధుఁడెవఁడో యతనికి సహాయుండై వచ్చియుండునని తోఁచుచున్నది. కావున యిట్టి సమయంబున నయ్యిన సుతుని మీఁదికిఁబోవుట లగ్గుగాదు. అంగదునివలన నేను వినినదేమనగా, అయోధ్యాపతియగు దశరథుని నందనుండు రవిపుత్రునకు సహాయముఁజేయునట్లు వాగ్దానముఁ జేసివచ్చెనఁట. అటులనయ్యెనేని నీకు జయంబు గలుగనేరదు. ఆరాజసుతుండు జగదేక వీరుండు. నీవుగాని మఱియెవ్వరుగాని యతని జయింపఁ జాలరు. ఇపు డూరకుండుటయే మేలు" అని చెప్పిన యా పలుకులం దలంచి వాలి యొక్కింత చింతించి భార్యతో "తరుణీమణీ! నీవు పలికిన హితంబునకు సంతసించితిని గాని, సుగ్రీవుని గర్వం బడంపక విడుచుట మాత్రము నాకు సమ్మతముగాదు. సిగ్గులేకపోయి మఱియొకని సహాయమును వాఁడు కోరినట్లు నేను కోరెడివాఁడనుగాను. ఇదియును గాక రామునకు నేను చేసిన యపకృతి యెద్దియుంగలుగదు. అతఁడు నాకపకార మేలచేయును? నాతో పోరాడి యోడి పరుగెత్తి పోయినవాఁడు మరలివచ్చి యుద్ధముఁజేయఁ బిలిచినపుడు పోవకుండుట వీరధర్మము

కానేరడు. నేను వానివంటి పిఱికిపందమాగాను సుమీ! దీనికై నీవు చింతింపవలదు. వాని గర్వము నడంచినంగాని నా మనంబునకుఁ దృప్తి గలుగఁబోదు. నీవు నీయంతఃపురంబున కరిగి నిబ్బరంబున నుండు"మని చెప్పి అతి కుపిత మానసుండై నగరంబు వెలువడి చనుదెంచి రవిసుతుం దాకెను.

ఆ సమయంబున నయ్యన్నదమ్ములకు తత్పూర్వము జరిగిన దానికంటె నతి భయ కరముగా యుద్ధంబు ప్రవర్తిల్లె. ఉత్సాహంబును మత్సరంబును రోషంబును, జయాభిలాషయు, నంతంతకు మీఱుచుండగా వాలి సుగ్రీవులు పోరదొడంగిరి. వారి సమరప్రకారంబున కాశ్చర్యంబుఁ జెంది, మింట దేవతలును, భూమిపై వనచరులును నట్టె చూచుచు, నందెవనికి జయంబు సిద్ధించుటయు నిశ్చయింపలేక తమకుఁదోచినట్లు మాటలాడుకొనుచుండిరి. ఈప్రకారము కొంత తడవు పోరాడినంతట క్రమక్రమముగా సుగ్రీవుని బలంబు తఱుగఁజొచ్చెను. వాలి విజృంభించి యతనిఁగొట్టి బడలు వడం జేయుటయు, మిత్రాత్మజుండు సత్వంబుడిగి డిల్లపోవుచుండుటయు రామచంద్రుండు గాంచి "ఓహో! కార్యము చెడునట్లున్నది. ఇంక తడవుఁ జేసినచో వాలిచే రవిసుతుండు నిహతుం డగుట నిశ్చయ"మని యెంచి చటాలున వింట బాణంబుసంధించి వాలిపైఁ బ్రయోగించెను. ఆ క్రూరాస్త్రంబు దాకుటకు నిద్రిన దనుండు వేళ్ళుతెగి కూలిన వృక్షంబు చందంబున నేలపైఁబడియెను. అతఁ డట్లుపడుటయు రఘుకులవల్లభుండు చనుదెంచి యతనిముందు నిలిచెను. అంతట వాలి రామచంద్రునిగని "ఓరామా! నేను పరునితోఁ బోరుచుండగా, ఏమరు

—(*) రాముని శరంబుచే వాలి నేలగూలుట. (*)—

పాటున నుండిన వానిని నన్ను చాటుననుండి యక్రమంబునకకూలనేసితివి. అయినను సంగ్రామంబునఁ బడినవాఁడ నగుటచే నా మరణంబును గూర్చి నేను చింతింపను. గాని మిక్కిలి ప్రియకరుండైన నా ముద్దుపట్టియైన యంగదుని విడిచి పోవలసివచ్చెనే యని చింతిల్లుచున్నాను'' అని చెప్పి దుఃఖించుచుండ సుగ్రీవుండును నతని యెదురుగావచ్చెను. వారి నిరువురం జూచినంతట మనంబున కోపంబు రెట్టింపగా రామునితో "దశరథనందనా నేను నీకెట్టి యపకారమునుం జేయలేదు. అన్నదమ్ములమగు మేము మాలో కలహించి పోరుచుండగా, నడుమఁ జొచ్చి ధర్మంబును పాలింపవలసిన నృపాలుండు నిటుల నధర్మంబున కొడిగట్టి

నన్ను కూలనేయుట, పాడియగునా? ఇట్టిది రాజధర్మమని యెవరైనం బిలుకుదురా? ఈ పాపంబు నీకు కలుగకపోవునా?" యని పలికిన ధరజాపతి యతనింగని "ఓయివాలీ! రాజులు దుష్ట శిక్షణమును శిష్ట రక్షణమును విధిగా జరిగించి తీఱవలయును. ఆ ధర్మము ననుసరించియే నేను శిక్షించితి. ఎట్లనగా, తమ్ముని భార్యను పాప భీతిలేక గైకొనిన నీవు పాపాత్ముఁడవును, దుష్టుఁడవును నగుటచే నిన్ను శిక్షించుట మాకు కర్తవ్యము. అయినను, నీవు నాచేఁదగిన కారణంబున శాశ్వతంబైన పుణ్యాలోకప్రాప్తి నీకుఁ గలుగ గల"దని పలుకుటయు, వాలి తన యాగ్రహంబువిడిచి రామునితో "మహాత్మా! బాణవేదనను సహింపలేక నిన్ను తూల నాఁడినాడను నా యపరాధములు క్షమింపు"మని ప్రార్థించి నమస్కరించి ప్రాణంబులువిడిచెను. వాలినిహతుండైన వార్తనెఱిగి యుల్లంబు తల్లడిల్లగా, యతని భార్యయైన తార మహాదుఃఖముతో రోదనంబొనరించుచు, యుద్ధభూమి కరుదెంచి యస్త్రంబుచేఁ గూల దూళి ధూసరితమును, రక్తసిక్తమునునగు దేహముతో బడియున్న తనపతింజూచి మొగంబున మోదుకొనుచు పైఁబడి విలపించుచు, నతని గుణవిశేషంబులును, పరాక్రమంబును వర్ణింపుచు, నేలఁబొరలుచు "అయ్యో! ప్రాణేశ్వరా! ఇంక నాగతి యేమి కావలయును? నన్నును, నీముద్దుకుమారుని విడిచి పోయినాఁడవుగదా? మేమెందుజొత్తుము? మమ్ము రక్షించువార లెవ్వరున్నారు? ఇట్లగునని తలంచియే యుద్ధమునకు వచ్చునపుడు వలదని వారించితి. నాపలుకు లాదరింపక రోషావేశంబున వచ్చితివి. తమ్ముని భార్యను చేపట్టిన పాప మూరకఁబోవునా? అదియే నిన్నింతకుం దెచ్చినది'' యని యనేకవిధంబులం బలుకుచు దుఃఖించి రామచంద్రుని వంకఁ గని "ఓయి దశరథనందనా! అకారణంబుగా నా పతింజంపి ఇవ్విధమున నన్ను శోకసాగర మగ్నునగునట్లు చేసినాఁడవు. ఈ దుఃఖంబు నీ వనుభవింపక తప్పిపోవునా? నీవు సీతంగొని రావలయునని చెప్పియుండినచో యీ కపిలేశ్వరుండు నిమిషకాలంబున దెచ్చి నీకు సమర్పించియుండును.

—(*) తార రామచంద్రునకు శాపంబొసంగుట. (*)—

అటులగాక సుగ్రీవునకు సహాయుడవై నాప్రాణేశ్వరుని వధించితివి. ఇట్లు చేసిన కారణమున నీవు సీతను దోడ్కొని వచ్చినంతట యా లలనామణి పెద్దకాలంబు నీ యొద్దనుండక నిన్ను శోకమునొందఁ



వాలి సుగ్రీవుల ద్వితీయ యుద్ధము.

బాల్పడఁజేసి భూమిలోఁ జొచ్చును గాక"యని శపించి వ్యసనము మించి విలపించుచుండెను. రామచంద్రుండు సుగ్రీవునింగాంచి "కపివరా! ఇట్లు చింతా మగ్నులైయున్న కావలసిన కార్యంబు లెట్లుజరుగును? వలయు వస్తువులం దెప్పించి వాలికి సంస్కారక్రియలు నిర్వర్తింపు"మని యాజ్ఞాపించెను. ఇట్లు రామచంద్రుండు నియోగించుటకు సుగ్రీవుండు హనుమత్సుషేణ తారాది వనచరులంబిలిచి "వస్త్రమాల్య ఘృత తైలాది సమస్త వస్తువులును దెండని పంచిన వారలేగి సకలవస్తువులును గొని వచ్చిరి. అంతట వాలిని వస్త్ర గంధమాల్య భూషణాలంకృతుం జేసి, శిబికయందిడి, యంగదసహితులై తారాది కాంతలు వెంట వచ్చుచుండగాఁ గొని చని గిరి పులిన ప్రదేశంబున నమర్పఁబడిన చితిపైఁ బెట్టి యుక్త క్రమంబున దహించి బంధుమిత్రామాత్య భృత్యవర్గములతోడ బంపా సరోవరంబున కరిగి కృతస్నానులై తిలోదక విధానంబు లాచరించి, కృతకృత్యులై రామచంద్రుని పాలి కరుదెంచిరి.

రామచంద్రుండు వారి నూరార్చి, "పురంబునకేగి వాలికి దశాహతంత్రములును, పార లౌకికాది కృత్యంబులును నడుపు"మని చెప్పిన సుగ్రీవుండు రాఘవానుమతి నట్లచేసి, పూతస్నానుండై, యంగదుం దోడ్కొని, వానర యోధులంగూడి రాఘవేశ్వరుని యొద్దకువచ్చి దండప్రణామంబు లాచరించి నిలుచుటయు, నయ్యవసరంబున మహా బుద్ధిమంతుండైన హనుమంతుండు రామచంద్రునితోడ నిట్లనియె.

స్వామీ! ఈ సుగ్రీవుండు తన యన్నకు జరిగించవలసిన యుత్తరక్రియలు క్రమముగా జరిగించి పూత స్నానుండై యున్నవాఁడు. ఇక నితండు తన, తృప్తి తామహంబుగా నొప్పు రాజ్యంబును బాలించుట కర్హుండగుటచే పట్టాభిషిక్తుం జేయవలసి యున్నది. భవ త్కృపావిశేషంబుననే యీతని కీపదవి లభించినది. కావున నీవే చెంతనుండి పట్టాభిషిక్తుంచేయుట ధర్మము. కిష్కింధా పురంబునకువచ్చి యీకార్యంబును నెరవేర్పు"మని పలికి ప్రార్థించిన రఘుపుంగవుం డతనితో "ఆంజనేయా! నీవు చెప్పినది న్యాయమేయైనను, తండ్రిపంపున నరణ్యవాసముఁ జేయు

టకై వచ్చినవాఁడ నగుటచే యీకాల పరిమితి పూర్ణమగువరకును నేను పుర ప్రవేశముఁ జేయుట యుక్తముగాదు” అని పలికి సుగ్రీవుం గని వానరోత్తమా! నీవుపోయి బంధుమిత్రామాత్యులు సహాయులుగా పట్టాభిషిక్తుండవై, యంగదుని యువరాజుం జేయుము. ఇపుడు వానకాలముగాన, ఈ నాలుగుమాసములు గడచిన తట శత్రు నిర్మూలమునకు మనము పోవుదము. అంతవరకును సుఖంబున నుండుము. నేనును లక్ష్మణుండును, సంతటిపరకును, యీగిరి గుహయందుండ గలవార మింక కిష్కింధకరిగి వర్షాకాలంబు చనినంత మాయొద్దకు రమ్మ” పొమ్మని చెప్పిన రామభద్రునకు దండ ప్రణామంబు లాచరించి సకల వానరులు నుం గొలుచుచుండగా పట్టాభిషేకార్థముగా నానా విధాలంకారంబులను జేయఁబడి మనోజ్ఞంబుగా నొప్పుచున్న కిష్కింధా నగరముం ప్రవేశించెను.

తొమ్మిదవ ప్రకరణము ముగిసెను.



# శ్రీ రామ వన వాస ము.

## వచనకావ్యము.

### ప దియ వ ప్ర క ర ణ ము.



—(*) సుగ్రీవుని పట్టాభిషేకము. (*)—

సుగ్రీవుండు పురంబున కరిగినంతట మంత్రులును నతని బంధుమిత్రులును, సకల సన్నాహంబులు నొనరించి యతని సింహాసనాసీనుండై యుండఁజేసి జయజయధ్వనులెసంగ పుణ్యోదకంబులదెప్పించి యభిషేకముఁగావించి, యనంతరము మంగళస్నానంబుఁ జేయించి దివ్యవస్త్రమాల్యగంధాభరణంబుల నలంకృతుంజేసి, కుశ పరిస్తరణం బొనరించి విధ్యుక్తముగా హోమాదిసత్కార్యంబులు నిర్వర్తించిపెద్దల యాశీర్వాదంబు లెసంగఁ బుణ్యాహవాచనంబు చేసిరంత, గెలంకుల వారకాంతలాడుచుం బాడుచుండగా మహా సంతోషంబున భద్రాసనంబున విరాజిల్లుచున్న యవ్వానరోత్తమునకు పట్టంబుఁ గట్టిరి అంత సుగ్రీవుండు సమ్మోదంబున వాలి నందనుని నాలింగనంబు గావించి రఘుపుంగవుని యానతిప్రకారముగా యతనికి యౌవరాజ్యంబుఁ గట్టె. అపు డఖిల వానరులును సుగ్రీవు నెంతయు న్యాయశీలుండని ప్రశంసించిరి.

ఈప్రకారము రామచంద్రుని సహాయంబుచే కిష్కింధా రాజ్యమునకు పట్టభద్రుండై దివాకర సుతుండు మహా సంతోషముతో సకల భోగంబులు ననుభవించుచు నిర్విచారుండై యుండగా, రామచంద్రుండు ప్రస్రవణ శైల గుహాయందు లక్ష్మణ ద్వితీయుండై వసించుచు, సీతా వియోగ దుఃఖము నోర్వజాలక సంతోషమును బొందుచుండ సౌమిత్రి యుపచరించుచు, శాంతవాక్యములచే యూరార్చుచుండెను. అపుడు వర్షాకాలము ప్రారంభమై యాకాశంబంతయు నీలమేఘము లావరించి యుఱుములును, మెఱుములును, నతిశయింపగా, యంబరంబు చిల్లులు బడినదో యను భంగి కుంభద్రోణముగా వర్షింపఁదొడంగెను [illegible] మంతయును జలమయంబై కనుపట్టుచుండెను నదులు [illegible]

బులై పాఱఁదొడంగెను. కొలంకులు మొదలైన జలాశయ ప్రదేశములు సలిల పూరితంబులై యొప్పుచుండెను. ఈ క్రమంబున వర్షించి వానకాలంబుకడచుటకు సమయంబగుటయును, రాఘవేశ్వరుండు తమ్మునిఁబిలిచి "లక్ష్మణా! శరత్కాలంబు వచ్చుటయు సుగ్రీవుని సాయంబున వానర బలంబులం గూడిపోయి రావణునివధించి జనకజం గొని రావలయు, నంత వరకును నాప్రాణంబులు భరించుట కష్టమైతోచుచున్నది ఏమిచేయుదును? రాజ్యభోగంబులచే మత్తుండై యొకవేళ యినజుండు రాకుండెనేని మనమేమిచేయుదము? ఏమియుం దోఁచకున్నది. ఏవిధంబును మనకు కార్యసిద్ధియగునో తెలియఁబలుకు"మని యడిగిన లక్ష్మణుం డన్నను చూచి "రాఘవేశ్వరా! సుగ్రీవుండు కృతఘ్నుండుగాఁడు. వర్షాకాలంబు గడచుటయు నతండువచ్చి సీతాన్వేషణార్థంబుగా వనచరులం బంపఁగలండు. పిమ్మట నెల్లకార్యంబులునుం జక్కనగును. చింతింపక ధైర్యంబు నవలంబించి శాంతచిత్తుండవై యుండు"మని యతని పరితాపంబుపశమింపఁ జేసెను. ఇట్లు రామలక్ష్మణులు యోజింపుచు పర్వతగుహాలోనుండగా నట కిష్కింధలో హనుమంతుఁడు కాంతాభోగాసక్తి మించి నిర్విచారుండై యున్న రవిజుని సముచితంబుగాఁ బొడగని యతనితో యిట్లనియె.

"భానునందనా! రామచంద్రుని కృపావిశేషంబున నీకు రాజ్యలాభము కలిగినది, నీకన్ననో యమ్మహాత్ముఁ డొనరించిన మేలును మరువక యతనికి సహాయముఁ జేయవలసినవాఁడవై యుండియు భోగాసక్తుండవై యావిషయంబును దలంపక యున్నాఁడవు. ఇటులనుండుట న్యాయంబుగాదు. రాఘవేశ్వరుని దేవి యెందున్నదియో వెదకి కనుంగొనుటకు వనచరులఁ బుత్తెంచి యమ్మహీపతికిఁ బ్రియంబుఁజేయుటకుఁ బ్రయత్నింపుము. నీ వాజ్ఞాపించితివేని వానరు లెందఱో నీ యాజ్ఞానువర్తులై యుండువారుగలరు. ఇంక నాలస్యముఁజేయుట మంచిదిగా"దని చెప్పిన మారుతాత్మజుని హితోక్తుల కలరి సుగ్రీవుం డతనిఁజూచి "వాయుసుతా! నీపలికిన భంగి నొనరించుట నాకు కర్తవ్యము. తగిన సేవకులం బంచి నలుదిక్కులందును వనగిరి దుర్గ ప్రదేశంబులం గల వానరులను నిచ్చటికి వచ్చునట్లుగా మదీయ యాజ్ఞ నెఱింగించి తోడ్కొని రాఁబనుపుము. ఏడునాళ్ళకులోన నాశాసనంబునకు బద్ధుఁడై యెవఁడిచ్చోటికిరాక యుండునో వానిని నిర్దయగా వధింతునని యెఱిగింపుము. ఆలస్యంబుఁ

జేయవల"దని దిట్టముఁ జేసి హనుమంతునిఁ బనిచి యంతఃపురమునకుఁ బోయెను.

—(*) సుగ్రీవుండు తనయొద్దకు రాకుండుటకు రాముండు చింతించుట. (*)—

ఈవిధముగా సుగ్రీవుండు యత్నముఁ జేయుచున్న సమయంబున రామచంద్రుండు లక్ష్మణునిఁబిలిచి, "తమ్ముండా! చూచితివా! భార్యను గోల్పోయి రాజ్యంబులోనుండి తరుమఁగొట్టఁబడి గిరి దుర్గంబుల వసించి యల్లాడుచుండి నన్ను శరణుఁజొచ్చి, నేను కరుణించి వాలిం దునిమి యొసంగిన రాజ్యంబున కభిషిక్తుండైనా యొనర్చిన యుపకృతిం దలఁచి, తాను చెప్పిపోయిన చందంబున ప్రవర్తింపక, సుగ్రీవుండు తారాది కాంతలతో భోగింపుచు, మనయొద్ద కరుదెంచుటను మాని హాయి మెయి నున్నవాఁడు. నేను సీతావియోగ దుఃఖముచే పరితపించుచున్నాను. నాకష్టం బతండు మనంబున నించుకయుం దలంపక నన్నేమఱచినట్లు తోఁచుచున్నది. అప్పుడు చెప్పిపోయిన పలుకులును, అప్పటి వినయ విధేయతలను, ఏమయ్యెనో తెలియకున్నది. ఇటువంటి కృతఘ్నుం డెచ్చటనైనం గలిగియుండునా? ఆహా? వాని వర్తనముం దలంచిన నా మనంబున నాశ్చర్యంబు పొడముచున్నది. ఇటువంటి దురాత్ము నూరక విడువవచ్చునా? నేను నీ కాజ్ఞాపించునది యేమనగా ఈవేళ నీవు కిష్కింధ కరిగి యా దుష్టాత్మునింగని నామాటలుగా, "ఓయి సుగ్రీవా! ఉపకారముఁ జేసినవాని మఱచి, చెప్పినట్లు ప్రవర్తింపక యలసభావంబుఁ గలవాఁడవై, తద్విచారమే లేక యిచ్ఛాభోగంబు లనుభవించుచు, సుఖంబున నున్నాఁడవు. ఈ భోగంబు లిట్టె నీకు శాశ్వతముగా దక్కునని యెంచితివి కాఁబోలు ఏశరంబుచే మహా బలవంతుఁడైన వాలి నేలఁగూలెనో యా బాణము మొక్కఁబోవక యున్నదిగా యెఱుంగుము. ఈక్షణంబున కర్తవ్యతానిశ్చయముఁ జేసి మాతోడఁ బలికిన ఛందముగా యిచ్చోటికివచ్చి తగిన యత్నమును జేయవైతివేని మహోగ్రంబైన మదీయ సాయకంబుచే నిన్నును, నీవారిని, నీ రాజ్యంబును నిర్మూలము గావింతునుగాని విడువను" అని చెప్పితినని నిర్దాక్షిణ్యంబుగాఁ బలికి యతనివలన ప్రత్యుత్తరంబును గొనిరమ్ము శీఘ్రముగా బోయిర"మ్మని చెప్పెను. రామానుజుండు అన్నకు నమస్కరించి ధనుర్బాణంబులు గైకొని కిష్కింధకుపోయి నగరద్వారంబున నిలిచిన యతని యప్పటి కోపోగ్ర రూపంబుఁగాంచి యచ్చోటనుండిన వానరులు భీతినొంది పరుగునఁ జని తారా

రుమాది కాంతా జనంబులంగూడి వినోదించుచున్న సుగ్రీవునకు సౌమిత్రి రాక నెఱింగించిన యతండు భయమొంది మంత్రులరావించి మంత్రాలోచనం గావించి, లక్ష్మణునిం దోడ్తెచ్చుటకు బంగారు పల్లకిం బుచ్చిన, వానరు లరుగునంతలోన సుమిత్రాసుతుండు నగరిముందటి కరుగుదెంచె. అంతట తరుచరనాథుండు తోట్రుపాటుతో మంత్రులు వెంటరా బిరబిరం జనుదెంచి సాష్టాంగ దండ ప్రణామంబు లొనరించి, లోపలికిం దోడ్కొనిపోయి రత్నమయంబైన గద్దియం బెట్టి "దేవా! యాసీనుండవు గ"మ్మని ప్రార్థించిన సమ్మతించి యుపవిష్టుండుగాక రామానుజుండు కోపఘూర్ణంబులైన విలోకనంబు లెసంగగా సుగ్రీవునింజూచి యిట్లనియె.

—(*) లక్ష్మణుండు సుగ్రీవునితో పరుషోక్తులు బలుకుట. (*)—

"ఓయీ! నేను రామచంద్రునిచేం బంపంబడిన యిమ్మహాత్ము భృత్యుండను. కార్యార్థినై వచ్చినవాండను. అరుదెంచిన పనినిగురించి మాటలాడుట విడిచి నీవు చేయు సత్కారములు బొంది యానందించుట కొఱకు రాలేదు. నీ మరియాదలు నాకేమిటికి? నేనొల్లను. రాఘవేశ్వరుండు నీతోడ చెప్పవలసిన ట్లాజ్ఞాపించిన పలుకులను వినుము. ఏలనగా "సుగ్రీవా! వాలిని సంహరించి నేను నీకు సహాయ మొనరించి యొసంగిన రాజ్యంబును గైకొని తదీయ భోగంబుల మత్తుండవై, మాతోడ చెప్పిపోయిన క్రమంబున జరిగింపక యలస భావంబున నున్నవాండవు నీయుద్దేశంబు వేఱువిధముగా నుండునని తోంచుచున్నది. మాతోడ నెటుల బలికి పోయినాండవో, యావిధమున నిప్పుడవచ్చి జరిగింపవైతివేని నీపురంబును నిన్నును నిర్మూలముం గావింపుదును. వాలినిగూల్చిన యమ్ము మొక్కపోకున్నదని తలంపు"మని తెలియబలుకుమని చెప్పెను. నీ ప్రత్యుత్తరమునకై వేచియున్న వాండని భీషణోక్తులతో బలుకుటయు సుగ్రీవుండు భయంబుమించి మేను వదరుచుండగా "స్వామీ! రామచంద్రునకు విరోధముగా ప్రవర్తించుటకు నేను తలంచినవాడనుగాను. అతని యెడల నపరాధ మొద్దియుం జేయలేదు. విధేయుండనైన నాపై రఘునాయకుని కింతటి కోపమేల కలుగవలయును? నేను మిన్నకున్న వాండను గాను. నానా ముఖంబులంగల వానరులను రావించుటకుం దగినయత్నముం జేసియున్నాను. రాఘవేశ్వరుని యాజ్ఞానుసారముగా సకల కృత్యములును జరిగించెద. నీవిపుడు నావలని సత్కారంబులు గైకొనుము. అంతట రఘువల్లభునియొద్ద కరుగవచ్చు"నని వినయంబుతో వేడుకొనెను.

లక్ష్మణుం డతని వాక్యములువిని "ఓయీ! తొలుత రామచంద్రుని యానతిచొప్పున జరిగింపుము. పిమ్మట నేను నీచేయుసత్కారమును గైకొనియెదను. అంతవరకు నొల్లంజుమీ!" యని యుగ్రుండై పలుకుచున్న వెఱచి తార చనుదెంచి సౌమిత్రికిమ్రొక్కి "దేవా! కోపము నడంపుము, రవినందనుండు కృతఘ్నుండును నసృతవాదియును గాఁడు, కృత ప్రయత్నుఁడై యున్న యితనిపై నలుక నొందవలవ"దని యనేక

—(*) తార లక్ష్మణునకు కోపోపశమనంబుఁ జేయుట. (*)—

విధంబుల వేడుకొనెను. మఱియు నామె "ఇతండు మీతోడఁబుట్టినవాఁడుగా దలంపఁవలయును. మీకు భృత్యుండును విధేయుండును నగు నితనియందు దోషం బిసుమంతయుం గలుగదు. కోపమును మానుము. మహాప్రకృతి యొనర్చిన జానకీవల్లభుని యందెంతయు భక్తిగలిగి తదాజ్ఞ శిరమునఁదాల్చి సర్వ కార్యములును జేయుటకు సంసిద్ధుండై యున్నవాఁడు. తిరస్కార భావమున నున్నవాఁడని తలంపవలదు' కరుణా దృష్టిలంగని మన్నింప నర్హుం"డని పలికిన యామె పలుకులవలన సౌమిత్రి శాంతిఁబొంది సుగ్రీవునితో "కపివరేణ్యా! రాఘవేశ్వరుఁడు సీతావియోగ దుఃఖముచే తపించుచున్నాఁడు. త్వరితముగా జనక రాజసుత నరయుటకుఁ బ్రయత్నించుట యుక్తం"బనిన యతం డాంజనేయుఁబిలిచి "శీఘ్రముగా వానర కోటులను రావించుటకు వెంటయు దశదిశలకునుం దగు వారలఁ బనుపు"మని చెప్పి యుచిత సత్కారములచే లక్ష్మణుని పూజించి యతనిని పసిండి పల్లకియందు గూర్చుండఁజేసిన వానరముఖ్యులు వెంట వచ్చుచుండగా కానుకలు గైకొని భేరీ కాహళధ్వనులు సెలంగుచుండగా ప్రయాణంబై తారాది కాంతల నంతఃపురమున కనిచి పురము వెలువడి లక్ష్మణుండున్న పల్లకినెత్తుకొని వానరులు ముందునడువగా కొందరు ఛత్రచామరంబులుబట్టి కెలంకులనడువ రామచంద్రుం డున్న యెడకుఁ బోయెనుఁ ఇవ్విధంబున లక్ష్మణ సుగ్రీవులుపోయి దూరమున శిబికములుడిగ్గి పాదచారులై సమీపించి సాష్టాంగ దండ ప్రణామము లాచరించిన తమ్ముని గారవించి రవినందనుం దక్కిన వానర వీరులను గూర్చుండ నియోగించి యాసీనుండైన సుగ్రీవునిఁజూచి ప్రణయ కోపావేశమున నతనితో రామచంద్రుం డిట్లనియె

"ఓ వానరోత్తమా! నీవు నాతోడ చెప్పిపోయిన కార్య పద్ధతులనుమఱచి భోగ పరాయణుండవై యుండుట ధర్మంబగునా? ఇపుడు

నేను పిలువఁ బంచినందున నేమి యుపద్రవము కలుగునో యనెడి భయ
ముచే నీబ్రతుకు తెరువు నెంచి వచ్చితివి. కాని యది మైత్రివలన వచ్చు
టకాదు. నీతోడ నేను సఖ్యముఁ జేసినపుడును, వాలినిదునుమించినపుడున్ను
పట్టాభిషిక్తుండవగుట నీవు కిష్కింధ కరుగుచున్నప్పుడును నాతోడ
చెప్పిన పలుకులును నీచేసిన బాసయుం దలంపక కామ పరతంత్రుఁడవై.
సీతాన్వేషణ కార్యభారముఁ దాల్చుట మానియుండుట యోగ్యలక్ష
ణంబగునా?" యనిన కృతాంజలియై సుగ్రీవుండు రఘువల్లభునిఁజూచి
భయభక్తి వినయము లెసంగగా "రఘునందనా! నేను కృతఘ్నుండను
గాను. అసత్యమును బలుకలేను. భవదీయ కార్యమునకంటె నాకు
రాజ్యసుఖము లెక్కుడులుగావు. స్వామీ! నేను మఱచి యుండలేను.
సీతను వెదకుటకును లంకాపురమునకు యుద్ధమున కరుగుటకును వనచర
బలముల రావించుటకు సౌమిత్రివచ్చుటకు పూర్వమే ప్రయత్నించి నలు
దిక్కులకును సేవకులం బంచియున్నాను. దేవ గంధర్వాంశ భవులును
కామరూపులును, బహుళ సత్వ సముపేతులును నైన వానరవీరు లెల్ల
దిక్కులనుండియుం దమ తమ బలములతోఁగూడి నూఱులు వేలు లక్ష
లు కోటులు నర్బుదములు శంఖములు ఖర్వములు సముద్రములు మహా
సముద్రములు మొదలుఁగాఁగల సంఖ్యల కెక్కుడుగా చనుదెంచి మిమ్ము
పొడ గనఁగలరు. రఘువరా! వారు మిమ్ము గొలిచివచ్చి లంక ముట్ట
డించి నిశ్శంక నేఁపుమీఱ రావణుని సపుత్రమిత్ర బాంధవముగాఁ బరి
మార్చి కల్యాణ గుణ సమేతయైన సీతందెచ్చి నీకు సమర్పించెద"రని
పలికిన సంతోషించి దాశరథి యతని కౌఁగలించి "వానరేశ్వరా! నీవు
సత్యసంధుండవును, పుణ్యమానసుండవును, న్యాయశీలుండవు నగుదువు.
నాయందు దృఢమైన సఖ్యతయు భక్తియుంగలిగి వర్తించువాఁడవు
బంధుఁడవునుం బ్రియుఁడవును, నగుటచేనీవలన మదీయ కార్యము సఫ
లంబగుట నిశ్చయము. ఇంక తడవుఁజేయక తగిన తరుచర వీరులను
భూపుత్రిని వెదకి కనుఁగొని వచ్చుటకై పనుపు"మని చెప్పెను

—(*) వానరబలంబులు సుగ్రీవుని జేరవచ్చుట. (*)—

ఇట్లు రామసుగ్రీవులు సంభాషించుచున్న సమయమున సుగ్రీవుని
శాసనమున, నదనదీ, సముద్రతీర పర్వత వనాంతర వాసులైన వాన
రులు లెక్కింప శక్యముగాని మొత్తములుగాఁ సాలతాల శిలాపాణులు
ను,నఖదంష్ట్రాయుధులును, సితాసితకనక కేసరవర్ణులును, కామరూపులును

కామ గమనులును, నీల జీమూత భీమాకారులును నగు వారలు దెసలు నాకసమును నిండి రాఁదొడఁగిరి. అందుముఖ్య వీరులైన, శతబలియు, సుషేణుండును, కేసరియు, గవాక్షుండును ధూమ్రుండును బనసుండును, నీలుండును, గజ, గవయ, గంధమాధన, వృషభ, శరభ, మైంధ, ద్వివిధ, ఋమణ్వంత, నీల తారులును, ఇంద్ర జాలాంగద హనుమంత శతగుల్మ యుల్కాముఖ గతత్రసూదనోద్ధతసుహోత్రాదులును తమబలములతోడ గర్జిల్లుచువచ్చి నలుగడలం బొలిచి నిలిచిరి. అటుల చేరిన సైన్యములంగని సుగ్రీవుండు రామచంద్రునితో "దేవా! వనచర వీరులందఱు నరుదెంచిరి. ఇంక జానకిని వెదకుటకు వీరిలో తగిన వారిని నిర్ణయముఁజేసి పనుపు"మనిన రఘువరుండు "భానునందనా! నీవు వీరి శక్తిని బాగుగా నెఱింగి యున్నవాఁడ వగుటచే పనుపదగిన వారిని నిశ్చయించుట నీకేతగును. ఈ పని నావలన గానేరదు. కాఁబట్టి నీయిచ్ఛచొప్పున నిర్ణయింపు"మని పలికెను.

—(*) సుగ్రీవుండు సీతను వెదకుటకై నలుదెసలకు వానరులఁబంపుట. (*)—

సుగ్రీవుండు సంతసించి మహాసమర్థుండైన వినతుండను వానిఁబిలిచి "నూఱువేల సంఖ్యగల వానర వీరులంగూడి నీవు తూర్పుదిక్కునకరిగి సీత యుండుచోటును వెదకి కనుఁగొని నెలదినములకు లోపల నిచ్చోటికిఁ జేరవలసినది. అటుల రాక తడసినచో ప్రాణదండనము విధింతు"నని చెప్పిన ప్రాగ్దిశ నరుగవలసిన మార్గములును నందుండుఁగల విశేషములును నెఱింగించి యతని పిమ్మట హనుమ జ్జాంబవ దంగద మైంద ద్వివిధ సుహోత్ర తార గజ గవయ గంధమాదన ప్రముఖులం బిలిచి వారిని దక్షిణపుదిక్కునకు సీతను వెదకుటకుఁ బోవలసినదిగా యాజ్ఞాపించి వినతునితోడ చెప్పిన చందమున మార్గములును విశేషములును మరలివచ్చి చేరవలసిన గడువునుం దెలిపెను. ఆ సమయమున రామచంద్రుండు హనుమంతునిబిలిచి "అనిలనందనా! నీయందనేకవిధములైన శుభలక్షణములు గలిగియుండు, అదియునుగాక నాయందు మిక్కిలి భక్తియు నా పనులలో నెక్కుడు శ్రద్ధఁగలిగి వర్తించుచుండుదువు. కావున నీవలన మదీయాభిమతసిద్ధి యగునని తోఁచుచున్నది. కావున నాదు నామాక్షరములు చెక్కియున్న మదీయాంగుళీయకం బిదిగో! కొనుము. దీనినిఁ గొనిపోయి పొడగంటివేని జానకి కొసంగుము. ఇదిచూచి సంత

సించి జనకసుత నిన్ను గౌరవించు''నని యిచ్చెను. దానినతండు గొన్ని వానరవీరులతోఁగూడి ప్రయాణంబై పోయెను.

అటుపిమ్మట సుగ్రీవుండు సుషేణుని పశ్చిమంబునకును శతబలినుత్తరమునకును దరుచర నివహంబులతోడ ప్రయాణముఁజేసి మొదటి బంపినవారితో చెప్పిన విధముగానే యన్నివిషయములునుం దెలిసిన, వారలును తదాజ్ఞతలఁదాల్చి యాయా దిశలకు మహోత్సాహంబుతో వెడలిపోయిరి. తాను గావించిన యేర్పాటులను సుగ్రీవుండు రామచంద్రునకు నివేదించి "స్వామీ! మిథిలేశ తనయ యెచ్చోటనుండినను వెదకి కనుంగొని బల్లిదులైన వనచర వీరులు శీఘ్రంబునవచ్చి వృత్తాంతంబు నెఱింగించెద"రని చెప్పిన రఘువరుండు సంతోషంబునుజెందె. ఈరీతిగా తరుచర నివహంబులుఁబుచ్చి రామలక్ష్మణ కపివరులు వారల రాకకు నిరీక్షించుచుండిరి. అట్టియెడ పూర్వ పశ్చిమోత్తర దిశలయందు వెదకఁబోయిన వినత సుషేణ శతబలులు గోలాంగూల బృందములతోడ జనుదెంచి రాజసుతులకును, మర్కటేశ్వరునకు నమస్కరించి "మేముపోయి యెల్లెడలను వెదకి చొరరాని చోటులఁజొచ్చి చూచియు నెందును జానకి పొడగానఁ బడలే"దని విన్నవించిరి. దక్షిణపుదిక్కున కరిగిన హనుమదాదులుమాత్ర మప్పటికిరారైరి. కావున వారలేమివార్తఁదెచ్చెదరో తెలిసికొని కర్తవ్యంబు నిశ్చయింపవలయునని తలంపుగలవారై యందఱును వారిమార్గం బరయుచుండిరి.

—(*) హనుమదాదులు సీతను వెదకుట. (*)—

సుగ్రీవునివలనఁ బంపఁబడిన హనుమ జాంబవ అంగద ప్రముఖులు యామ్యపార్శ్వమున కరిగి వింధ్యాద్రిం జేరి యందలి బిలములును పరిసర మహాదట విప్రదేశములును వెదకి యట సీతంగానక, మఱియుం బోయి పోయి పూర్వముతపోధనుండొక్కఁడు తనకుమారుండు సప్తవత్సరముల ప్రాయము వాడరణ్యమున కరిగి యందు గతాసుఁడగుటయు, నమ్మునివరుం డాగ్రహించి శపించిన కతమున, పుష్ప పలఫత్ర రహిత తరు నిచయమును, మృగపక్షి గణవర్జితయేను నిర్జల ప్రదేశమునునైన శుష్కవనముఁ నొక్కటినిఁ బొడగని యాశ్చర్యమొంది, దానిఁ గడచి మఱియొక యున్నతశైలముఁజూచి, యందలి బిలముఁజొచ్చిరి. వారికా గుహాంతరమున మహాకాయుండైన దైత్యుఁడొక్కఁడు దోఁచిన సరకు సేయక వానిని దాఁటి చని సీతాదేవి నచ్చోటవెదకి కానరాకుండుటయు

వీలయే వెలువడివచ్చి బహు ప్రదేశమున గొప్పదైన వృక్షంబొకటి కనుపించుటయు, నచ్చోటుం జేరి యాతరు మూలమున నాసీనులై భూపుత్త్రి జాడ తెలియమికి చింతించుచుండు సమయమున నంజనిపుత్త్రుం డంగదునింజూచి "వాలినందనా! ఎల్లచోటులను సీతను వెదకినారము. ఆమె యున్నచోటు తెలియదయ్యె. సుగ్రీవుండు మన కొసంగిన గడువుకాలమును ముగియుటకు కొలది దినములు మాత్రమే గలవియున్నవి. ఈ యల్పకాలములోపల జనకనందను కనుంగొనఁ గలమనెడి నమ్మకము లేకున్నది ఇంక కర్తవ్యమెయ్యది? జానకిదేవిం గనుంగొనిపోయి సంతోషవార్తను రామలక్ష్మణులకును, రవిసుతునకునుం జెప్పి కీర్తినొందు భాగ్యము మనకు కలుగంబోవునది లేదు. ఇంత కష్టములు నొందియు వ్యర్థయత్నులమై చని వారిముందు నిలుచుటకంటె, ఇచ్చటనే ప్రాణములు విడుచుట మేలుకార్యమని తలంచుచున్నాఁడ"నని వ్యసనాక్రాంతుండై పలికిన, విని యంగదుం డతనితో "సమీరకుమారా! మన మింతలోని రాశులము గారాదు. గడువుకాలమువరకును నానా చోటులను వెదకి యెంకనుం గానఁబడకున్నచో, యప్పటికి తగుభంగి విచారింతము. ఇంతలో వేగిరపడి, పిరికి పందలమై వెదకుటమాని ప్రాణములు విడువఁదలంచుట యవివేకముగాని మేలుకాదు విచారముడిగి తడవుఁజేసి కాలము వ్యర్థముగా గడపక వెదకుదము పదం"డనిన తారుడును నంగదుండు చెప్పినట్లన చెప్పిన వారి పలుకులం దక్కిన వారలందఱును నంగీకరించి యదియ కర్తవ్యంబనిరి. అంతట నచ్చోటనుండి వానరవీరులు కదలి యటనట జూచుచు, బహుదూరంబరిగి యొకచోట యున్నతంబైన మహీధరము నొకదానిఁ బొడగని యందఱును దాని నారోహించి నలుప్రక్కలను జానకిని వెదకివెదకి వేసారి యలసి కొండదిగి దాహముమించుటంజేసి జలాపేక్షగలవారై యొక చెట్టు నీడింగూర్చుండి చూచుచుండ వారికి సమీపమున వృక్షసమూహములతో క్రమ్ముకొనియున్న బిలముతోనుండి కలకలారవము లెసంగగా జలపక్షులు వచ్చుచు గుహలోనఁ జొచ్చుచుండుటయుం, గనుపట్టెను. అదిచూచి యాంజనేయుండు తక్కిన వారితో, "వానరవీరులారా! తడసిన ఱెక్కలుగలవై పక్షు లాగుహనుండి వచ్చుచుం పోవుచున్నవి చూచుఁచు, ఆబిలమున సలిలము లుండకున్నచో విహంగము లిటుల చేరవు. కావున నిందు నీళులు నిశ్చయముగా నుండవలయునని తోఁచుచున్నది. మన మరిగిచూచి నీరు గ్రోలి

దాహముఁ దీర్చుకొనివచ్చి పిమ్మట యోజింపుఁడ'' మనియెను.

—(*) హనుమదాదులు గుహలో స్వయంప్రభను చూచుట. (*)—

హనుమంతుం డటుల చెప్పగా క్షుత్పిపాసాపీడితులై యున్న యా వనచర వీరులెల్లరును సమ్మతించి లేచి యాగుహాయొద్దకేగి చెట్లచే మూసికొనియున్న బిలద్వారమును మెల్లగా సందుఁజేసుకొని లోపలఁ బ్రవేశించిరి. అటులపొచ్చి గాఢాంధకారముగా నుండుటచే యందు మార్గము దెలియక యంధులవలె యొకరినొకరు పట్టుకొని మెల్లమెల్లగా యోజనదూరము మిక్కిలి కష్టముతో నరిగినంతట క్రమముగా చీకటులడలి, దేదీప్యమానముగా వెలుతురు గలుగుటయు నాశ్చర్యముఁ జెంది యచ్చోట కుసుమ పత్రఫల భరితయోలైన వృక్షంబులును, సువర్ణ వర్ణంబులనొప్పుచు కలకలంబలుకు పక్షులును, స్వచ్ఛజలంబులు గలిగి కలువలును తామరలును వికసించియుండగా కన్నుల పండువఁ గావించుచున్న కొలంకులును, రమణీయ భర్మరత్న స్థగిత వివిధ చిత్ర శిల్ప కల్పనాభిరామంబులై విలసిల్లుచున్న ధామంబులును, సకల వస్తు నిచయ సంపూర్ణ గేహంబులును. మొదలుగాగల విశేషంబులచేనొప్పుచు, నేదియుం గొఱంతలేక సమృద్ధిగా దోఁచుచుండుటయు నయ్యతిశయంబునకు విస్మయించి వర్ణింపుచు, నటకుంబోయి, యందొక్కచోట నిరుపమానంబైన తేజంబుచే దిశలు వెలిగించుచు, కృష్ణాజినంబుపై సమాధినిష్ఠతోఁ గూర్చుండియున్న పావన స్వరూపిణియైన తపస్వి నొకర్తుంగావించి, కపులందఱు నామెకు నమస్కరించి నిలిచిరి.

అపుడాంజనేయుండు కరములుమోడ్చి "ఓతల్లీ! నీవెవ్వతెవు? ఈ యంధకార గుహాంతరంబున నిట్టి కాంతులు గలుగుటకును, యీ దివ్య భవనాదులు గలుగుటకును నిమిత్తంబెయ్యది? అద్భుతంబుగాఁదోఁచుచున్నది. నీవు సామాన్యస్త్రీని గావనుట యిచ్చోటగల్ల విశేషంబులనుబట్టియు, నొంటరిదానవై తపంబుఁజేయుచు నిందుండుటఁ బట్టియు నిశ్చయింపవలసియున్నది కరుణించి భవద్వృత్తాంతముం జెప్పుము" అని ప్రార్థించిన యామెకన్నులు విచ్చిచూచి యతని పలుకులు విని "ఓయి వానరోత్తమా! నేను మేరు సావర్ణి కుమార్తెను, నానామంబు స్వయంప్రభ, హేమయనెడి యచ్చరబోటిని మయుఁడు వలచి తోడ్కొనివచ్చి యీ బిలంబున దివ్య మందిరారామాదులు నిర్మించి యిందా కాంతారత్నంబుతోఁగూడి కామభోగంబు లనుభవించుచుండెను. అది యెటిం

గివచ్చి దేవేంద్రుండు మయుని వధించె. నేను హేమకు ప్రియసఖిని, కావున మయుండ మృతినొంది నంతట యీ నగరు గాచియుండుటకు నన్నిచ్చో టు నిలిపి తాను దేవలోకంబునకుఁబోయె అప్పటినుండియు నేనిచ్చోట నొంటరిదాననై తపోనిష్ఠంబూని నివసించియున్న దానను. వానరులారా! మీరిచ్చోటి కెటులవచ్చితిరో యెఱుంగఁబలుకుఁ"డని తన వృత్తాంతంబుఁజెప్పి వారి యుదంతంబు నడిగిన, వాయుపుత్త్రుండు తమవచ్చిన తెఱంగంతయు విన్నవించి "జననీ! పరమ పుణ్యశీలవైన నిన్ను మేము మా భాగ్యవశంబునఁ బొడగని ధన్యుల మైతి"మని పలికెను. అంతట నామె వారలకందఱకును, మధుర ఫలములును, ప్రియమ లోదకములును యథేష్టముగా నొసంగి యాదరించెను.

ఆకలిదప్పులచే మిక్కిలి బడలియున్న మర్కటవీరులు స్వయం ప్రభవలన నాతిథ్యముఁబొంది తృప్తులగుటయు నామె వెండియు వారియాగమన కారణమును వివరముగాఁ జెప్పఁగోరుటయు, హనుమంతుడు సర్వమును వివరించి "అమ్మా! గడువుప్రకారము మేము సుగ్రీవునియొద్దకు బోవలసియున్నది. తడవుఁజేసిన వో యతం డాగ్రహించి మమ్ము శిక్షించును శీఘ్రముగ లరుగవలసియున్నది. మేమీ గుహాంబ్రవేశించు తరుణమునఁ బడినపాటు లిట్టివని పలుకుటకు శక్యముగాదు. అపు డిచ్చోటనుండి బిలము వెలువడుటకు మాకు సాధ్యమగునని తోఁచకున్నది. కృపామతివై మమ్ము గుహ వెడలింపు"మని వేడిన, స్వయంప్రభ యతనితో "వానరోత్తములారా! ఎవ్వరుగాని, బిలముఁజొచ్చిరేని ప్రాణముల తో వెలువడి పోవఁజాలరు. ఇట్లు మయుండు వరముఁ బడసియుండెను. అయినను మదీయ తపః ప్రభావముచే మిమ్ము నేను వెడలించెద. మీరు కన్నులు క్షణకాలము మూసియుండి తెఱచిచూడు"డని చెప్పినవారు కన్నులుమూసిరి.

క్షణకాలము కడచినంతట కన్నులు విచ్చిచూచి తాము గుహా బహిః ప్రవేశమున నుండుట నా వానరులు కనుఁగొని యామె ప్రభావమును బొగడి యటనుండి కొంతదూరముపోయి, రమణీయంబైన యొక వనముఁ బొడగని యందుఁజొచ్చిరి. ఆ సమయమున వనచరవీరులతో తారాసుతుం డిట్లనియె.

—(*) అంగదాదులు సీతంగానక దుఃఖించుట. (*)—

"కపివరులారా, సూర్యపుత్త్రుండు చెప్పినగడువుకాలము సమీ

పించుచున్నది. ఇప్పటివరకును నెచ్చట వెదకినను సీతజాడ కనఁబడకున్నది. మనము మహీసుతం గనుఁగొనక పోయినచో, కోపించి మనల నతఁడు శిక్షించుట నిశ్చయము. కాఁబట్టి మన ప్రాణములు రక్షించుకొనుటకు నేనొక యుపాయముఁ జెప్పెద నటుల చేయుదము. ఏమనగా, ఇపుడు మనము వెలువడివచ్చిన పర్వతగుహ బహు భద్రంబైనది. దేవతలకు నైతము ప్రవేశించుటకు దుస్సాధ్యము. ఇందఱమును మరలిపోయి యందు మున్నువలె ప్రవేశించి యచ్చోట ఫలాదుల నాహరించుచు స్వస్థచిత్తులమై కాలము కడపుదము. ఇట్లు చేసితిమేని, రామలక్ష్మణులుగాని సుగ్రీవుండుగాని బిలముజొచ్చి మనల గనుంగొనజాలరు. ఇది యుత్తమ పథముగా నామనంబున దోచుచున్నది పోవుదము లేచిరం"డని చెప్పుటయు వనచరు లాపలుకులువిని యెద్దియుం బలుకుటకు తోచకమిన్నకున్న, అంగదునిమాటలు తనకు సమ్మతము గాకుండుటయు హనుమంతుఁ డతనిజూచి "ఓహో! వాలినందనా నీకు దుర్బుద్ధి పుట్టినట్లు తోచుచున్నది. ఈవానరులుం గూర్చుకొని బిలముఁ జొచ్చియుండి ప్రబలుండైన సుగ్రీవునితో మరల పడుటకు నీవు తలంచినట్లున్నది. ఇది నీవంటివానికి యోగ్యమైన పథము గానేరదు. ప్రజలు బలవంతుని జేపట్టుదురుగాని దుర్బలుని తెరువునోల్లరు నేనును, నీలుఁడును, తారుఁడును, నీతండ్రియైన వాలి యున్నప్పుడు సుగ్రీవునిపక్షము వారమై యుండుదుము. ఇపుడా సుగ్రీవునివిడిచి యుండజెల్లునా? అది యర్హముగాదు. మేము ముప్వురమునుగాక తక్కిన యీ వానరులైనను నీమాటలకు సమ్మతించి తమ తమ భార్యా పుత్రుల విడనాడి నీయాజ్ఞకు లోఁబడి గుహాంతరమున నీతోడ జేరియుండుటకు దలఁతురా? ఒకడును నొల్లఁడు. ఇట్లు మేమం దఱముచు తొలంగినంతట నొక్కరుండవు నీవు బిలమున నెట్టుండఁగలవు? ఒకవేళ నొంటరివాడవై యుండినను, నిన్ను వెదకి నీయున్నచోటు నెఱింగి రామానుజుం డాపర్వతమును చూర్ణముఁజేసి నిన్ను వధించునుగాని విడువడు. అతఁడు దివ్యాస్త్రవేదిసుమా నా మాటలువిని దుర్విచారము వీడి మమ్ము ముందట నిడుకొని సుగ్రీవునియొద్ద కరుగుము. అతండు మిక్కిలి యోగ్యుండును, సత్యసంధుఁడును, ధర్మయుక్తుండును, నీతల్లికనురక్తుండును నగుటంజేసి నిన్నుఁ మన్నింపఁగలం"డని చెప్పిన, యంగదుం డాపలుకుల నాదరింపక, "మరున్నందనా! శ్రీరామచంద్రుండు సుగ్రీవునకు నన్నుచూపి, నీవీతని యువరాజ పట్టముగట్టుమని యాజ్ఞాపించి

వ్వంబున విధిలేక యీయాపదవి నాకొసంగెనేకాని మనఃపూర్తిగా జేసిన పాడుకాఁడు. అదియునుగాక నాతండ్రి గుహఁజొచ్చి శత్రునితోఁ బోరుచుండగా, బిలము వాత శిలవైచివచ్చి వానరరాజ్యముఁ గైకొనియె. అగ్రజుని భార్యయనక నాతల్లిని చేపట్టె. తన కుపచారముజేసిన రామచంద్రునిఁ బొడగనబోవక యతని తమ్ముఁడు వచ్చినంతట వెఱచి చనుదెంచె. అతఁడు చేసినపను లెన్నియోగలవు. సుగ్రీవుండు కృతఘ్నుండును, పాపచిత్తుండును గావున మా తండ్రిపైఁగల విరోధమును మనమున నిడుకొని నన్ను చంపించునుగాని విడువఁడు. ఎట్లును నన్నతఁడు వధించుట నిక్కువము కారణం బరయుచుండెడి యతని కిప్పుడు సీతను వెదకలేదనుటయె నెపముఁగాఁగలదు. కాబట్టి నేనతనియొద్దకు రాఁబోల్లను. ఇచ్చోటనే ప్రాణములు విడిచినను, మీరరిగి నామరణవార్త నతనికి నా తల్లియైన తారకునుం జెప్పుఁడు. ఇదియ మదీయ నిశ్చయం బని దృఢముగాఁబలికి చింతాకుల మానసుండై దర్భలుపరచుకొని ప్రాయోపవిష్టుండయ్యె. ఇవ్విధమున నంగదుండు చేయుటయు, నతనివిడిచి పోనొల్లక కపులందఱును, దుఃఖాక్రాంతులై తామును ప్రాణములు విడువ నిశ్చయించి యతని చందముననే దక్షిణాగ్రములుగా దర్భలు పఱచుకొని వరుసగా ప్రాయోపవేశముఁ జేసిరి.

—(*) ప్రాయోపవిష్టులైన వానరులయొద్దకు సంపాతివచ్చుట. (*)—

ఆ సమయమున, వింధ్యవాసియు, జటాయువున కన్నయు నగు సంపాతియను పక్షివరుండు వారలంగాంచి సమీపించి "ఆహా! ఫలాఫలములు దైవాధీనములు తలఁపని తలంపుగా నాకు నేఁడు సంపూర్ణముగా నాహారము లభించినది. ఈ వానరులఁజంపి భక్షించి యీదినము సంతుష్టినొందెద"నని తనకు తాన బిగ్గఱగా బలుకుచు వచ్చుచున్న యా మాటలువిని దానింగని యంగదుండు తక్కిన కపులతోఁ, తమ కిచ్చోట నటుల భయంకర మహా రూపముఁగలపక్షి కెరయై ప్రాణములు విడువ వలసినట్లు విధించిన విధాత చెయిదికిని తమ దుర్దశకును వగచుచు రామచంద్రుండు సీతాలక్ష్మణులతోడ వనవాసమునకు వచ్చుటయు, జానకీదేవిని రావణుండు గొనిపోవుటయు అపుడు వాని కడ్డపడి జటాయువుపోరి మడియుటయు నాదిగా తామచ్చోటికివచ్చి ప్రాయోపవేశముఁ జేసిన యంతవరకును జరిగిన వృత్తాంతంబంతయు, వరుసగా యేకరువుపెట్టి దైవము మన కిట్టి యాపద గలిగించెగదా! యని పలుకుచు దుఃఖించిన

యతని పలుకుల వినుచుఁ జేరవచ్చిన సంపాతి జటాయువు మరణవార్త
ను వినగా మహా దుఃఖమును బొంది "వనచరులా! మీరు జటాయువు
మృతినొందుటం జెప్పగా విన్నంతట యధికమైన దుఃఖము కలుగుచున్న
ది. యతఁడు నా సోదరుఁడు. నేను పక్షవిహీనుండనై యున్నాఁడను
అటులగాక యుండినయెడల మదీయానుజుం జంపిన ఖలుండైన యారావ
ణుని గర్వంబడంచి వాని ప్రాణములు గొనక యుండఁజాలను. ఏమిచే
యుదును, కపులారా! నాతమ్ముని వృత్తాంతమును వివరముగాఁ దెలి
యఁబలుకుం"డని యడిగిన, యంగదుండు సర్వమును వివరించి రామ
చంద్రుం డరుదెంచిన తన తండ్రికింబోలె సంస్కారము జరిగించుటం జెప్పి
న యధికమైన శోకముఁజెంది మీరు నన్ను సముద్రమునొద్దకుం గొని
చనుండని వేడిన వనచరులట్లు గావించిరి. సంపాతి సముద్రజలముల కృత
స్నానుండై యనుజున కుదకదానముసేసి కపులయొద్దకువచ్చెను. అంతట
నంగదుండు పక్షీంద్రుంజూచి "సీతా వృత్తాంతము నెఱింగియుండిన
చెప్పు"మని యడిగిన సంపాతివారలతో నిట్లనియె

—(*) సంపాతి వానరులతో సీతా వృత్తాంతంబు చెప్పుట. (*)—

"మర్కటోత్తములారా! రావణుండు సీతం గొనిపోవుచుండగా
నేను చూచితి, ఆదేవి రామచంద్రుని నామమును స్మరింపుచు రోదనముఁ
చేయుచుండె. వాఁడు నేను గిరి శిఖరముపై నుండగా నాదాపునకువచ్చి
మార్గంబడిగి, మహా వేగముతో బోయెను. సముద్రమధ్యమున లంకా
పురంబనెడి మహా నగరము గలదు. అదియ వాని నివాసస్థానము జాన
కింగొని వాఁడు లంకాపురమునకే పోయెను. మీరు యిచ్చోటనుండి
మహేంద్రగిరియొద్ద కరిగి యటనుండి సముద్రము లంఘించి లంకకుఁ
బోయి జానకియున్నచోటుం గనుంగొనవలయు"నని పోవలసిన విధానం
బంతయుం జెప్పి యాపక్షి వల్లభుఁడు వారల వీడ్కొని నిజ నివాసమున
కుఁబోయె. పిమ్మట నంగదుండు తక్కిన వానరులంజూచి "మనమింక
సంపాతి చెప్పిన మార్గమున సముద్రమునుదాఁటి లంక కరుగుదము రం"
డని ప్రయాణముఁజేసి దక్షిణ సముద్రతీరమున నుండెడి యగ్గిరిం జేరి దా
నినెక్కి కొంత తడవు కూర్చుండి యోజించుచుండిరి అపుడు భయంకర
తరంగ కల్లోలంబై ఘోషిల్లుచున్న సాగరమునుజూచి యది లంఘించు
టెట్లకోయనుచు భీతావహ చిత్తులై వెలవెలం బోవుచున్న వనచరుల
వీక్షించి యంగదుండు వారి భయమునెఱింగి "కేపు వార్ధిలంఘు నోద్యో

ణమునకుఁ బ్రయత్నింపుదము. ఈ రాత్రి కీపర్వతముపై యుండి కడపుఁ" డని బుజ్జగించి నాఁటిరాత్రి యచ్చటనుండి మఱునటి యుదయకాలమున నందఱును నిదురమేల్కాంచి నంతట పర్వత తటమున కపివీర పరవేష్టి తుండై కూర్చుండి యంగదుం డిట్లనియె.

—(*) అంగదాదులు కడలిందాఁటుటకు తమ కొలందు లెఱింగించుట. (*)—

"తరుచర వీరులారా! భయభ్రాంతులమై మన మిట్లూరకుండుట ప్రయోజనముగాదు. ఎట్లయినం గష్టములు సహించి యీ యంబుధిని లంఘించి సీతా వృత్తాంతమును గనుఁగొనవలయును ప్రాణత్యాగముఁ జేయుటకు నిశ్చయించి ప్రాయోపవిష్టులమైన మనము సంపాతి వాక్యములు విన్నంతట మరల నుత్సాహముఁ గలవారమై వచ్చి యిటుల వెఱచుట పాడిగాదు. నాపలుకులు విని మీలో నెవ్వరు సంద్రము నెంతెంత దూరము దాఁటగలుగుదురో, మీమీ సత్యము లెట్టివో వచింపు"డని న, యతని పలుకులు విని వారిలో గజుండు పది యోజనములును, గవాక్షుం డిరువది యోజనములును, శరభుండు ముప్పది యోజనములును, ఋషభుండు నలువది యోజనములును, గంధమాధనుం డేబది యోజనములును, మైదుం డఱువది యోజనములును, ద్వివిదుండు డెబ్బదియోజనములును, తారుం డెనుబదియోజనములును, దాఁటఁగలమని చెప్పిరి, అంత వృద్ధుండైన జాంబవంతుఁ డంగదుంజూచి "నేను వృద్ధుండగుటచే శిథిల విక్రముఁడనై యున్నాను పూర్వమునుంబోలె సత్వముచాలదు, అయినను తొంబదియోజనముల దూరమును దృఢముగా దాఁటుదును. అటుమీఁద సందేహం''బని చెప్పిన, నలుఁడు తానునుం దొంబదియోజనములు లంఘింతునని పలికెను, అంతట నంగదుండు [illegible] బలిమినెంచి "నేను నూఱుయోజనములు దాఁటగలనుగాని, మగిడి రాగలనో లేదో యనెడి సందేహము గలుగుచున్నది"యని శంకింపుచుం జెప్పిన విని జాంబవంతుండు వాలిసుతునితో "అంగదా! నీవు మాకొడయండవు. వృక్షము వంటివాఁడవగు నీకు మేము శాఖాపుష్పముల వంటివారము. నీవు వారిధి లంఘించిపోయి మగిడి రాలేకపోయినచో మాగతియేమి కావలయును? ఇందఱమును నిన్ను కర్తగా నమ్మి యనుసరించి వర్తింప వలసిన వారమైయుండగా, యెట్లు నీవు లేనపుడు నిర్వహింపఁగలము? నిన్ను సముద్రము దాఁటుటకు నియోగింప నొల్ల"మని దృఢముగాఁ జెప్పినతారా నందనుఁడు జాంబవంతునింజూచి "భల్లూకకుల వల్లభా!

ఎట్లును జానకి వృత్తాంతముసెఱింగి రామచంద్రుని యొద్దకు పోవలయు నుగదా! ఎట్లు? నన్ను పోవలదంటివి. ఇంక సముద్రమును దాఁటి సీతను పొడగని వచ్చువారెవరు? దీనికిం దగిన యుపాయంబుం జెప్పి నామనంబునకు సంతుష్టిఁ గలిగింపుమా!" యని యడిగెను.

—(*) జాంబవంతుఁడు హనుమంతునిఁ గొనియాడుట. (*)—

జాంబవంతుఁ డప్పుడు వాలిపుత్రునితో "కపివీరాగ్రేసరా తెలిసి యుండియు నీవీపనిం చేయఁగలవని నిశ్చయింపఁ జాలకున్నాఁడవేమి? అంబుధి నవలీల దాఁటుటకును, జనకనందనంజూచి వృత్తాంతముం దెలిసికొనివచ్చుటకును, సామర్థ్యముగల మహాబలశాలి వీఁడె హనుమంతుఁ డున్నాఁడు చూడుము. మన మాటలువినుచు నేదియుంబలుకక యితఁ డూరక చూచుచుండుట వింతగాయున్నది. ఈ వాయుపుత్రుండు దక్క మఱియొకం డీకార్యంబును జేయజాలఁడు. ఎంతటికైనను నితండే చాలినవాఁడు. మన మీతనిఁ బ్రార్థించుట కర్తవ్యం"బని వచించి యాంజనేయునిఁగని "మారుతీ! నీవిటుల మిన్నకుండఁదగునా? నీవే యికార్యంబునకుఁ బూనకున్నచో యింకగాఁగల విధంబెయ్యది? మాలోయీ

—(*) జాంబవంతుఁడు హనుమంతునిఁ బురిగొలుపుట. (*)—

పనినిఁ జేయనేర్చిన సమర్థుం డెవ్వఁడున్నాఁడు? శతయోజన విస్తీర్ణంబగు నీ యార్ణవమును లంఘించుటకు మాకు శక్యమగునా? నీవు నిరుపమాన బల పరాక్రమ శౌర్యధైర్య సాహస సత్వసముపేతుండవు. తలంచినచో నెంతటి మహాకార్యంబునైనను నవలీల నొనర్పఁగల సమర్థుండవు. నీకు తుల్యు లెవ్వరునులేరు. ఈసముద్రము నొక్కసారి మాత్రమేకాదు. వరుసగా వేయిమారులు లంఘింపఁ దలంచినను నీకు చెక్కకాదు. గరుడునివంటి జవంబు నీకుగలదు. అంజనీసుతా! ఈపనికి నీవు కడంగకున్నచో మహోపద్రవంబు వాటిల్లును. రామలక్ష్మణులును, సుగ్రీవుండును మేమును, ప్రాణంబులు గోల్పోవుట తటస్థించును. కావున యటులజరుగకుండునట్లు చేయుము. రామహితంబుగా నీవికార్యంబు నొనర్పుము. అబ్ధిదాఁటి లంకాపురంబుఁజొచ్చి. మిథిలేశనందనం బొడగని క్షేమ వృత్తాంతము నెఱింగివచ్చి మమ్ము సంతోషచిత్తులంజేసి రామలక్ష్మణ సుగ్రీవులయొద్దకుఁ దోడ్కొనిపొమ్ము జగత్ప్రాణాత్మజా! మాప్రాణములును దాశరథుల ప్రాణములును, కపివల్లభుని ప్రాణములు రక్షింపు"మని బహు ప్రకారంబుల స్తోత్రముఁగావించి ప్రార్థించెను. తక్కంగల యం

గిద ప్రముఖ శాఖాచరులును, నతని వినుతించి కార్యంబునకుఁ గడంగఁ గోరిరి.

ఈప్రకారము మర్కటులందఱును వేడుటయు స్తోత్రపియుఁడగు హనుమంతుఁడు వారి పలుకుల కెంతయు నలరి, యుప్పొంగి బలోత్సాహంబు లంతంత కతిశయింపం నిట్లనియె. "కపివరులారా! మీరు వెఱవ

—(౭) హనుమంతుఁడు తన శక్తిని వానరులతో చెప్పుట. (*)—

వలదు. ఈకార్యము నాకు పెద్దదికాదు తలంచితినేని, సముద్రములు పంకమయంబగునట్లు కలచుటకును, భూమిని బ్రద్దలు గావించుటకును నాకసంబును మ్రింగుటకును శైలంబులు పెకలించి యెగురమీటుటకును కాలమృత్యువును దనుముటకును శేషునిఁ బట్టుకొని నలుముటకును, సప్త ద్వీపములను దాఁటుటకును, నేఁజాలుదును ఈసముద్రంబును దాఁటుట యెంతమాత్రము! విలువక వేయిసారులు లంఘింపుమనినను లంఘింపఁ గలను. నూఱుయోజనములం జెప్పెదరిదియేమి యధికము? నేను పది వేల యోజనములైనను ననాయాసమున దాఁటుదును. ఈ యల్పకార్యంబునకై మీరు చింతింపవలదు. మీ రాజ్ఞాపించితిరేని సీతా రావణులతో యాలంకాపట్టణమునే పెల్లగించి తెచ్చి మీ రెచ్చటఁజెట్టుమనిన యచ్చోట నిడెదను" అని తనశక్తి సామర్థ్యంబులం జెప్పిన యతని పలుకులువిని, యంగద, జాంబవంత ప్రముఖులు సంతోషమున నుప్పొంగి మఱియు నయ్యనిలసుతునిం గొనియాడి మహేంద్రగిరి శిఖరంబుపైకరిగి సముద్ర లంఘనోద్యోగంబునకుం గడంగి, మహోత్సాహంబు గలవారలై యట నతులిత ఫల పుష్పభరిత క్షితి జాతంబు లారోపించి రసవత్ఫలంబులురాల్చి భక్షించియు, సింహ శరభ శార్దూల ప్రముఖ మృగంబులు వెఱచి నలుగెలంకులను బాఱగా నార్చుచువానిని వెన్నంటితఱిమియు, విహంగంబు లరచుచు మింటికెగర జోపియు, నుత్తుంగ శిఖరంబుల నెక్కి క్రిందికి లంఘించియు, మధుమక్షికంబులందోలి తేనియలు గ్రోలియు నిట్లు పలుతెఱంగుల గొంత తడవు వేడుకతో విహరించుచుండిరి.

పదియవ ప్రకరణము ముగిసెను.



# శ్రీరామవనవాసము.

## వచనకావ్యము.

### పదునొకండవ ప్రకరణము.



అంగద జాంబవంతాదులు మహేంద్రపర్వతంబుపై విహరింపుచు హనుమంతునిఁ బరివేష్టించియుండి యనంతరము వాయునందనుం గని ఋక్షవరుండు "మారుతీ! ఇంక సముద్రలంఘన కార్యంబున కుద్యోగింపు" మనిన నతండును మహోత్సాహంబుఁ గలవాఁడై వానరులఁ గని "మీ రింక విచారింపఁ బనిలేదు. శ్రీరామచంద్రునిం దలంచి యమ్మహాత్ముని కృపావిశేషమున నేనీయంబుధిని దాఁటెద లంక కరిగి సీతను వెదకి యెవ్వరేనియు నన్నెదిరించిరేని యా రాక్షసుల పీచంబడంచెద. భూసుత యచ్చోట లేదేని, యమరావతియుం బాతాళంబునుం జొచ్చి వెదకెదను. అటుల వెదకియు నామె కనంబడదయ్యేనేని రావణునిఁ బట్టి కట్టియో, లేక లంకనే పెల్లగించి తెచ్చియో రఘుకులేశ్వరుని ముందు బెట్టెదను" అని చెప్పి వరుసగా నందఱం గౌఁగలించి ప్రయాణోన్ముఖుండై నిలిచి రాఘవేశ్వరుని ధ్యానించి, రుద్రేంద్ర యమానిలాగ్ని చంద్రార్క మరుద్గణంబులకు మ్రొక్కి, కరంబులు ముందుకుఁ జాచి పదంబులుంకించి దిగ్గన మింటికెగసెను. అతని పాదఘట్టనచే మహేంద్రగిరి సగపాలు భూమిలోనికిఁ గ్రుంగెను ఊరువుల యురవడిచేఁ గలిగిన గాలివలన వృక్షంబులు వ్రేళ్ళతో పెల్లగిలి యతనివెంట చాల దవ్వువరకును మింటికిఁ బోయి క్రిందఁ గూలెను. ఇట్లు వియత్పథంబున హనుమంతుండు లంకాభిముఖుండై వాయువేగంబునఁ బోవుచుండు సమయంబున సముద్రుండు చూచి తనలోదాగి సుర

—(*) హనుమంతునకు మైనాకం బెదురగుట. (*)—

క్షితుండై యున్న మైనాకుండను శైలశ్రేష్ఠునిఁ బిలిచి "నగోత్తమా! రామకార్యార్థంబుగా వాయునందనుండు వ్యోమపథంబున లంకకుం బోవుచున్నాఁడు అతనికి మార్గాయాసము గలుగకుండునట్లు చేయవలసినది మనకు కర్తవ్యము. కావున నీవు మీఁదికి లేచి కొంత తడ నతండు నిలుచుట కనుకూలముగా నుండుము. శీఘ్రముగా లెమ్ము లె"మ్మని తొందఱపెట్టెను.

అంతట సువర్ణ శిఖరములతోడను వివిధఫల భరిత వృక్షంబులతోడను, మైనాకుండు జలధినుండి లేచి వాయుపుత్రుం డేగుచున్న దారికడ్డముగా మహోన్నతుండై నిలిచెను. అవ్విధమున మార్గ నిరోధముగా నిలిచిన యాగిరి సత్తముని( జూడగని యాంజనేయుఁడు తనలో "వీఁడొక ఘోర రాక్షసుండుగా నున్నాడు. నాకు నిరోధంబు గలిగించుటకై యిటుల శైలాకారంబుదాల్చి యడ్డము నిలిచియున్నాడు. మదీయ వక్షంబుచే దాకి వీని పోతరం బడంచెదంగాక" యని చింతించి యధికమైన యురువడి తోడ పరతెంచి తన ఱొమ్మునందాకిన, నతని ఘాతంబునకుం బోలినయ య్యనిలజుని యురంబు తాకుడుచే పర్వతం బట్టిట్టెకదలి మునుంగునట్లె సమాళి(చుకొంచు భీతిల్లి మైనాకుండు మనుష్యరూపంబుదాల్చి శిఖరంబున నిలిచి హనుమంతునకు వినునట్లు పేరెలుంగున నిట్లనియె "ఓ వానరోత్తమా! వాయునందనా! నేను నీకు శత్రుఁడనుగాను మైనాకుండనెడి పేరుగల శైలమును ఇనవంశ జాతుండైన సగరుని కుమారులచే త్రవ్వఁబడిన దగుటచే సముద్రమునకు సాగరమను నామము గలిగినది. ఆవంశమున బుట్టిన రామచంద్రుని కార్యమునకై నీవు పోవుచుండుట గనినసముద్రుం డాపూర్వ సంబంధముచు దలంచి "నీవు శ్రమవాయ నొక్కింత విశ్రమించుటకై సహాయార్థము నిలువు"మని చెప్పగా నీకెదుట నిలిచినాఁడను. అదియునుగాక నీకు నేను సహాయము జేయవలసిన బాధ్యతయునుగలదు. అవిధం బెటులనగా, మున్ను పర్వతములు ఱెక్కలుగలవైయుండి యపుడపుడు మింటికెగసి భూమిపై వ్రాలుచుండెను. అందువలన పట్టణములుం బల్లెలును, జీవకోటులును మిక్కుటముగా నాశమగుచున్నవని యింద్రుండు కోపించి వజ్రాయుధముతో వాని పక్షంబులు ఖండించుచున్న నేను భయంబుజెంది నీతండ్రియైన వాయుదేవుని ప్రార్థించిన యతఁడు తన బలముచే నన్ను గొనివచ్చి యిచ్చట సముద్రమునవైచెను. సముద్రుండు నాకాశ్రయ మొసంగె, అది యాదిగానే నిచ్చోటనేయున్నవాఁడ, కపివీరాగ్రేసరా! అటులనాకు మహోపకారంబు జేసిన వాయుదేవునకు నీవు కుమారుఁడవగుటచే కృతజ్ఞతా బుద్ధిగలవాఁడనై నీకు ప్రతిత్యుపకార మివ్విధమున( జేయదలంచితి కాఁబట్టి నా స్వరూపమైన యీకొండపై గొంత తడవు విశ్రమించి మధురఫలంబు లారగించి సేదఁదేటి పిమ్మట నీయిష్టంబు చొప్పున నరుగు"మని చెప్పి ప్రార్థించెను.

ఇట్లు మైనాకుండు చెప్పుటయు పవనసుతుండు సంతసించె. గిరి

శ్రేష్ఠా! నీ సద్గుణ సంపద కెంతయు మెచ్చితి, ప్రియంబున విశ్రాంతియొసంగి నన్ను నాదరింపఁ దలంచినని పరోపకార తత్వమెంతయు శ్లాఘ్యము. ఐనను నేనిపుడు నిమిషకాలమైన దడవుచేయుటకు వలనుగాదు. చాల దూరము పోవలసియున్నది ప్రొద్దుచాలదు. ఇదియునుగాక యీశతయోజన విస్తీర్ణంబైన సాగరమును దాఁటుటలో నాకిసుమంతయును శ్రమ గలుగఁబోదు. ఎచ్చోటను నిలువక పోవునట్లు శపథము జేసి పోవుచున్నాను. కావున నిలుపజాలను. దీనికై నీవు కినియవలదు, నీయాదర వాక్యంబులవలననే నీవు చేయఁదలంచిన సత్కారము నాకు చెందినది. ఇంతగా ప్రార్థించుచున్నావుగాన, నీకు తృప్తిగలుగుటకై స్పృశించుచున్నాను. ఇంతమాత్రము చాలును'' అని చెప్పి చేతితో యాపర్వతశిఖరంబును తాకి మహా వేగంబున బోవదొడంగె. అపుడు మరుస్నందనుని సాహసంబునుజూచి దేవత లాశ్చర్యంబు జెంది. "ఔరా! ఈ మారుతి సాహసం బేమనవచ్చునుః? నిర్లక్ష్యముగా భయంకరమైన సముద్రమును దాటి యంబరమార్గమున బోవుచున్నాడు. ఇతఁ డరుగుచోట బలీయులైన రక్కసులు పెక్కండ్రు గలరు ఈతండన్ననో యొంటరివాడు. వారిని జయించి యితం డెటుల సీతను గనుంగొని రాగలఁడోయనెడి సందేహము బట్టుచున్నది. మనమీతని ప్రభావము బరీక్షింపవలయు'' ననియెంచి, సురసయను పేరుగల నాగమాతంబిలిచి "సురసా! నీవు భయంకరాకృతి దాల్చిపోయి హనుమంతుని కడ్డమై గమన విరోధంబును గలిగింపుము. నిన్ను జయించి యతఁ డెవ్విధంబున బోవునో చూచెద''మని ప్రేరేపించిరి. దేవతల యిష్టానుసారిణియై సురస మహాదుగ్రరాక్షసి రూపమునుధరించి, వేగముగా బోవుచున్న హనుమంతుని కడ్డంబుగా నిలిచి పెల్లుగానార్చి యట్టహాసంబు జేసి యిట్లనియె

—(*) ఆంజనేయుండు సురసాసింహికల జయించుట. (*)—

"ఓరి వెడగు వానరుడా! ఎక్కడికి బోయెదవు? నిలువుము. నాదృష్టికి గోచరించి నంతట తప్పించుకొనుటకు హరిహరాదులకు సయితము శక్యముకాదు. ఇంక నాకాహారముగమ్ము, వేగముగా బోయెదవెచ్చోటికి? తప్పించుకొనవచ్చుననియు నిన్ను విడుతుననియుం దలంచితివా? గుహాసదృశంబైన మదియ వదనద్వారంబున బ్రవేశింపక తప్పదు. రా రమ్ము!" అని పలికి భయంకరముగా నోరుదెఱచి మ్రింగవచ్చెను. ఆవికృతాకారంజూచి తనకు తటస్థించిన గమన విఘ్నంబున కాంజనేయుండు

మనంబున జింతించి యా రాక్షసింజూచి "నేను రామకార్యార్థముగా లంకాపురంబున కేఁగుచున్నాను త్వరితముగా మరలి నీయొద్దకు వచ్చెద నప్పుడు నన్ను నీ కాహారముగా గొనుము. తొందఱపనికై పోయెడికార్యవిఘ్నముజేయక విడువుము. నామాట నమ్ము"మని చెప్పెను. అతని వాక్యంబులకు సమ్మతింపక యారక్కసి మిక్కిలి యాగ్రహముఁగలదై "ఓరి మర్కటా! నీ మాటలునమ్మి విడుతునని తలంచినాఁడవా? ఆ యాశను విడువుము. రామకార్యమునకుఁ బోవుచుండినను మఱి దేనికొఱకుఁ బోవుచున్నను నిన్ను మ్రింగక నేను విడుచుదానఁగానుసుమీ!" యని కడు విశాలంబును, దీర్ఘ దృష్టాయుక్తంబునునగు వక్త్రంబువిచ్చి మఱియుం జేరవచ్చిన దాని యుగ్రింబునుగాంచి హనుమంతుండు చలింపక తనలో "వచ్చిననేమి? దీనికి నేను చిక్కెడివాఁడనా? దీనిశక్తి యెట్టిదియో చూచెదనుగాక"యని నిబ్బరంబుననిలిచి దానికి మ్రింగుటకు సాధ్యముగాకుండు భంగిని యానోటికంటె పెద్దవిగా నుండునట్లు తన దేహమును బెంచెను. రాక్షసియు నోరును మఱియు విశాలముజేసెను. అంతకంటె పెక్కుడుగా హనుమంతుండు పెరిగెను ఇట్లు క్రమముగా రాక్షసియు వాయుపుత్త్రుండును, వక్త్రశరీరములఁబెంచదొడంగిరి. నూఱుయోజనముల వెడల్పుగా యది తన నోరుఁ దెఱచినంతట మారుతి తటాలున తన రూపము నుపసంహరించి యంగుష్ఠమాత్రుండై దాని కుక్షింజొచ్చి వెలువడి ముందు నిలిచి, "ఓరాక్షసీ! నీవు కోరినలాగున నీ యుదరంబుఁ బ్రవేశించి వచ్చినాఁడను. నీ యాకలిదీఱినట్లు భావింపుము. నేను నాపనికి శీఘ్రముగా బోయెద"నని పలికెను. అతనిశక్తికి సురస యాశ్చర్యమునొంది నిజరూపంబుఁదాల్చి "వనచరోత్తమా! నేను రాక్షసినిగాను, సురసయనెడిపేరు గలదానను నాగమాతను, నీ పోయెడిచోట మహా బలశాలులైన రాక్షసులుండుటచే, నీవు వారిని జయింపఁగలవో, నీసామర్థ్యం బెట్టిదియో యెఱుంగవలయుననెడి తాత్పర్యముఁగలవారై, వేలుపులు నన్నుబిలిచి నీకు గమన నిరోధంబుగలిగించి బలంబు నెఱుంగుటకుఁ బంపిన యిట్టి రాక్షసిరూపంబుఁ దాల్చివచ్చి యడ్డగించితి. నీవు మహా సత్వసంపన్నుండవు. నిన్ను జయించుట కేరికిని సాధ్యముకాదు. నీకు మేలుకలుగును సుఖమునఁ బోయిర"మ్మని చెప్పి తన లోకంబున కరిగెను.

తర్వాత మరుత్సుతుండు త్వరిత గమనంబుఁ జనుచుండ పదియోజనముల లావును, ముప్పదియామడల నిడుపును గలిగినదియు ఛాయా

గ్రాహిణియునైన సింహికయనెడి రక్కసి నీటిపై జారి పరుండియుండి మిన్నం టనరుగుచున్న హనుమంతుని దేహచ్ఛాయనుబట్టి కదలిపోనివ్వక నిలువ రించి లటాలున మీదికెగిసి విశాలంబైన నోరుందెరచి మ్రింగెను. హనుమంతుడంత దాని పొట్టంజీల్చి రక్తసిక్త దేహుండై వెలువడి, యదిమడి యుటయు, రయంబున నంబుధిని తరించి యావలియొడ్డుననుండు సువేలా చలంబుఁజేరి దానిపై నిలిచె. ఇట్లు నూఱుయోజనంబుల వెడల్పుగల యుదధిని దాఁటి మహాశక్తిసంపన్నుండైన యాకపివరుండా కొండపై కొంత తడవు విశ్రమించియుండెను.

—(*) హనుమంతుఁడు లంక ప్రవేశించుట. (*)—

అంతట లేచినిలిచి తనకెదుటఁ దోఁచుచున్న మహోన్నత మణి చయ స్థగిత సువర్ణమయ రమణీయ గోపుర ప్రాకార, సౌధహర్మ్యాభిరామంబును, సుందరతర వనచనీ యావృతంబును, పరవీర దుర్గమ పరిఘా కలితంబును, నిరుపమాన శౌర్య బలోపేత రాక్షసవీర సమృద్ధంబునునై సకల వైభవ పరిపూర్ణంబై మహాసంపత్కరంబై కన్నులపండువ సేయు నదియగు లంకాపట్టణంబును గనుల విలోకించి తదీయ శోభావిశేషంబు నకెంతయు నాశ్చర్యంబుఁజెంది సూర్యాస్తమాన కాలపర్యంతం బచ్చోట నగడపి సాయంసమయంబున నప్పురంబునందలి యుత్తరద్వారంబుఁ జేరి తనమనంబున దానిని వర్ణింపుచు "ఆహా! శత్రుజన ప్రవేశంబునకు సాధ్యంబుగానిదియు నభేద్యంబునునైన ఈపురము సురాసుర చతురో పాయ ప్రయోగ దుస్సాధ్యంబైనది ఇచ్చోట లోక భయంకరుండైన రావణుండు మొదలుగాఁగల రక్కసుల కనుమొఱంగి నేను నగరంబుఁ జొచ్చి సీతను గనుంగొనుట యెట్లో తోఁచకున్నది. అయినను యేలా గునఁనైనియు వచ్చిన కార్యమునకు బ్రయత్నింపవలయునుగదా? ధైర్యమే సహాయము. ఇచ్చోటనుండి యూరక యోజించుటచే లాభములేదు. ఏవంకఁజూచినను యినుముపైచిన రాలనట్లు రాక్షసులు నిండియున్నారు. వీరు నన్నుఁ గనిరేని యడుగైనం జొరనీక నిరోధింపఁగలరు. గాలికి నయిత మీ పురంబులో ప్రవేశించుట కష్టము కాబట్టి యిట్టిరూపము తో జొచ్చుటకు వలనుగాదు. ఈరాక్షసులను మోసగించియే ప్రవే శించవలయును. శ్రీరామచంద్రుండు పరమ ధర్మస్వరూపుఁడు. ఆమహాత్ముని కార్యంబునకై వచ్చినవాఁడనైన నాకు యేసంకటంబైనను నేల కలుగును? అన్నియు ననుకూలముగానే జరుగును. నావంటివాఁడ నీ

మున్నిక్కడి రక్కసులంజూచి భయమొందుట కర్జంబుగాదు. ఇప్పటిరూపము నుపసంహరించి సూక్ష్మాకృతిందాల్చి జొచ్చెద”నని యిట్లు తలపోసి యణుమాత్రదేహుండై, తత్పురగోపుర ప్రాసాదాధిరోహణంబుంగావించి, జాజ్వల్యమానశోభా విరాజితంబును, నానావిధాలంకారయుక్తంబును, బహుతర రమణీయంబును నైన రావణుని నగరుంజూచి యచ్చెరువునొంది కొంత తడవు దాని సొబగును వర్ణించుచుండి పిమ్మట తత్సౌధంబుడిగి సీతా దర్శనోత్సుకుండై లోపలికిం బోవుచున్న సమయమున నల్పశరీరుండై పోవుచున్న యతనింజూచి, యాద్వారమునం గావలిగా యుచున్న లంకిణియనెడి రక్కసి మహా దాగ్రహముచే కనుబొమలు ముడివడగా పెల్లుగానార్చి యడ్డగించి “బళీ! ఓరి మర్కటాధముడా! ఇచ్చోట కావలియున్న నన్ను గికురించి పురముంజొచ్చి పోవుచున్నాండ

—(*) హనుమంతుండు లంకయను నిశాటిని నిగ్రహించుట. (*)—

వెక్కడకు? నీవెవ్వండవు? ఈ పురమున కేమి పని గలిగి వచ్చినాండవు? త్రిలోక భయంకరుండైన రావణుండేలెడి యీ పట్టణములో మన్మోజుం గనీక ప్రవేశించుటకు శక్యమా? సత్యముం జెప్పితివేని విడిచెద లేదా? నిన్ను పట్టి వధింతును గాని విడువను? అని దారుణమైన మాటలుబలికెను. దానిపలుకులకు సందియముకొందక హనుమంతుండు ఎదురుగానిలిచి ధైర్యముతో యిట్లనియె.

“ఓనిశాటీ! ఈ పురద్వారమందు నీవేమి చేయుచున్న దానవు? నన్నునిరోధించుటకు కారణమెయ్యది? నీవెవ్వతెవు? పేరేమి? చెప్పుము!” అని ప్రశ్నించె. అతనినిచూచి కోపారుణితలోచనయై యది “ఓరి వానరాధమా! లంకయనెడి పేరుంగలదానను. నేనీద్వారమున గావలియుండి పురముం రక్షించుచుందును. నాకుం దెలియక హరిహరాదులయినను, ఈపురముం బ్రవేశింపంజాలరు. నీవు యెంతటివాండవు? ఎచ్చట నుండి వచ్చినాండవో, పోవుట యెచ్చోటునకో, యెఱింగింపు” మని గద్దించి యడిగెను. ఇటుల నారక్కసి యడుగుటయు, వానరసత్తముండు

—(*) హనుమంతుండు లంకయను రక్కసిని వర్జించుట. (*)—

“ఓసి నిశాటీ! నేనెవ్వండనైన నేమిగాని, ఈ పురమునం గల హర్మ్యశ్రీ ప్రాసాదాదులును, విశేషములును జూడందలంచి వచ్చినాండను. కావున నిరోధింపక తొలంగు”మని ప్రత్యుత్తరం బొసంగిన, మహాదాగ్రహము నొంది, లంక పండ్లుగొరుకుచు, వాయుపుత్రునిం బోనీక యడ్డగించి యా

ర్చి పిడికిట యతని వక్షమును బొడిచెను, అపు డాంజనేయుం డుగ్రాకా
రుండై వజ్ర సన్నిభంబైన ముష్టిచేఁ బొడుచుటయు నది సొమ్మసిలి బల
మఱిగి క్రిందఁబడి "వానరోత్తమా! కరుణించి చంపక విడువుము. అద్వి
తీయ పరాక్రమవంతుఁడ వగుటఁ దెలిసికొంటిని. మున్ను పరమేష్టి నా
తో "ఓలంకా! లోకముల నిన్ను నిర్జించుట కెవ్వరికిని సాధ్యముగాదు కా
ని యెన్నఁడు వానరుఁడువచ్చి యెదిరించునో, యతనివలన నెపుడు నీవు జ
యింపఁబడుదువో యది మొదలుగా లంకాపురమునకు చేటుకాలము
ప్రారంభము కాఁగల"దని చెప్పెను ఇపుడు నీవు నన్ను జయించినాడవు.
ఇంక నీపురమునకు మహాపదలు వాటిల్లుట నిశ్చయముఁ మర్క
ట వీరాగ్రేసరా! నీ యిష్టానుసారముగాఁబోయి చూచిరమ్ము'' అని చెప్పి
యూరకుండెను. ఆంజనేయుండు దానిని జయించి నగరముఁజొచ్చి రాజ
వీధులును, మణిమంటపములును, మహోన్నత భర్మ్య హర్మ్యములును
సౌధ గోపుర పంక్తులును, చావళ్ళును, దీర్ఘికలును, గృహారామంబులును
గజాశ్వ గోశాలలును, ఆయుధశాలలును, కాంచన రథములును, నగ
ణిత వీరరాక్షసుల భటస్తోమములును, జటిలకేశ, యపినాంబర, స్వాధ్యా
యనిరతులైనరాక్షసులును నేకకర్ణులును, నేక నేత్రులను, దీర్ఘదంష్ట్రిలు
ను, దీర్ఘనాసలు గలవారలును, భకపాదులును, ఘూక శ్వానతురంగ
హస్తి మార్జారముఖులును, భయంకర నేత్రిలును, ఏక, త్రినేత్రులును
ఖరకర్ణ, గజకర్ణ, గోకర్ణులును మొదలుగాగల వికృతరూపులైన రాక్ష
సస్త్రీ పురుషులంగాంచుచు, కుబ్జ వామన, మహాస్థూల, మహాదీర్ఘ కా
యుల విలోకించుచు, తత్కాలమున చంద్రోదయంబగుటయు వెన్నెల
వెలుగు సహాయముగా నెల్లచోటులం దిరిగి సీతను నానాముఖముల వె
దకి, స్త్రీల యంతఃపురములును, నధికారుల మందిరములును, కుంభకర్ణ
విభీషణ, మహోదర, మహాపార్శ్వ, ప్రహస్త, విద్యుజ్జిహ్వ, విద్యుత్క
ర్ణ, విద్యున్మాలి, జంబుమాలి, సుమాలి, శుక, సారణ, వజ్రదంష్ట్ర, వజ్ర
గ్రీవ, వజ్రకాయ, కట, వికట, ఘన, ప్రఘన, హస్తిముఖ, నాగజిహ్వ,
కరాళ, వహ్నికేశ, రశ్మికేతు, సూర్యశత్రు, సంపాతి, విరూపాక్ష, ధూ

—(*) హనుమంతుఁడు లంకయందు సీతను వెదకుట. (*)—

మ్రాక్ష, భీమాక్ష, మకరాక్ష, శోణితాక్ష, మత్తోన్మత్త, కుంభ, నికుంభ
కంప, నాకంపన, దేవాంతక, నరాంత, కాతికాయ, మహాకాయ, మహో
దర మేఘనా దాగ్నివర్ణ ప్రముఖులైన యాతుధాన శ్రేష్ఠుల గృహము

బుం కలయ వెదకి రావణుని సౌధమును బ్రవేశించి యందు భోజనశాల యును నృత్తగీత వాద్య ప్రదేశములుం జూచి నానావిధ మాంసములును పదార్థములును బూర్ణము గావింపఁబడిన పాత్రములుగనియు మురజ మర్దళ వీణాది సాధనములం గరములం బూని యలసట పెంపున నట్లే శయనించి నిదురించుచున్న యువతులంగాంచియు నందలి యలంకార రమణీయకతయు వైభవమును విలోకించియు నచ్చెరువొంది మెచ్చుచు నలుగెలంకులం దిరిగి రావణుని శయనగృహముం బ్రవేశించి హంసతూలి కా తల్పముపై మండోదరియనెడి పేరుఁగలదగు భార్యతోఁగూడి శయ నించి నిద్రించుచున్న యతనిని వీక్షించి యా యిందువదన సీతగా దలంచి వగచి మరల యోజించి పరమ సాధ్వీరత్నంబైన జనక రాజ నందన గామినిని యెట్టిగి యామెయందు దోషము గలిగినటుల తానుభా వించుటకును తన యవివేకంబునకును మిక్కిలి చింతించి యచ్చోటువిడి చి మఱియుంగల సకల ప్రదేశములను వెదకి యెందును సీత జాడఁగానక యున్నతంబైన యొక గోపురంబుపైఁ జేరి కూర్చుండి ప్రయాసనొంది తానువచ్చుటయు భూమిజ కానరాకుండుటయు తన యత్నంబు వ్యర్థం బగుటయుండఁ దలంచి చింతాక్రాంతుండై "అయ్యో! నేను ధరాసుతంగని క్షేమవార్తం జెప్పుదునని యాసతో రామలక్ష్మణ సుగ్రీవులునారాకకై నిరీక్షించుచుందురు. నేనరిగిన వారికేమి చెప్పుదును నావలనకార్యం బనుకూలము కాఁగలదని యెదురుచూచుచున్న యంగదాదుల కేమి చెప్పుదును? ఛీ! జానకీదేవిం గనుంగొనక పోవఁజెల్లునా? పోవకున్న కర్తవ్యమేయ్యది? ఇచ్చటనే దేహంబు విడిచెద"నని వ్యసన మంతంతకు మించి యోజించి తుదకు తానంతవరకును చూడకున్న యశోకవనం బును జూచి పిమ్మట కర్తవ్యమును నిశ్చయించువాఁడై యచ్చోటనుండి యశోకవనంబున కరిగెను.

—(*) హనుమంతుఁడు సీతాదేవిం జూచుట. (*)—

ఇట్లుపోయి వనంబుల నలుగడలను వెదకి యొకచోట విశాల శా ఖావ్యాప్తమును నిబిడ పత్రయుతంబును నత్యున్నతంబునునైన యొక యశోక వృక్షంబు మూలమున పెక్కండ్రు భయంకరా కారులగు రాక్షసస్త్రీలచే పరివేష్టితయై చెక్కిట చేయిఁజేర్చి జలములు బాసిన కమలములవలెను త్రెంచివైచిన పూదీగెవలెను మేఘాచ్ఛాదితంబైన చంద్రబింబమువలెను మాసిన వస్త్రము గట్టిన రత్నంబువలెను కాంతి



హనుమంతుడు సీతకు ముద్రనొసంగుట.

క్షీణమై ధూళిబెరసిన యంగములతో శోకబాష్పములు కన్నుల జాలుచుండగా కూర్చుండి రామనామమును స్మరించుచు నేలజూచుచు దైన్యదేవత చందమున నొప్పుచున్న భూపుత్రింగని రామచంద్రుండు చెప్పియున్న లక్షణములన్నియుం గలిగియుండుటచే యామెయే జనకనందనయగుట నిశ్చయించి తటాలున నామె ముందున గరిగినచో రాక్షసమాయాకృతిగా నెంచుననియు తానెంతచెప్పినను తన వాక్యములు నమ్మజాలదనియు యుక్తిగా మొదట తన్నెఱింగించుకొనిపిమ్మట సంభాషించుట యుక్తమనియు యోజించి వృక్షాగ్రం బారోహించి కూర్చుండెను.

—(*) రావణుండు సీతయొద్దకు వచ్చుట. (*)—

ఆ సమయంబున సీతయందు తనకుంగల మోహాతిశయముచే చిత్తంబుకలంగి రావణుండు మహాడాంబరముతో, వెడలి యశోకవనంబున సీత యున్నచోటునకువచ్చి యామెనుజూచి, తనవిభవంబును, పరాక్రమాది విశేషంబులను తానువర్ణించిచెప్పి తనతోడంగూడి సుఖింపఁగోరి బహువిధంబులఁ బ్రార్థించెను. ఆ దుష్టునిమాటలు విననొల్లక సీత చెవులుమూసికొని రామనామంబును జపింపుచు, వానిపై మిక్కిలి కోపమును రోషమునుం జెంది నిరసన భావంబుఁ గలదియై యలక్ష్యముగా దూఱనాడి తిరస్కరించెను తనమాటల నటుల ననాదరించి నిందించుటయు, మహోగ్రుండై పంక్తిముఖుండు ఖడ్గంబుఁగొని యామెను తెగవేయ నుంకించుటయు వెంట వచ్చియుండిన యతనిభార్యయైన ధాన్యమాలిని యనునది యడ్డంబుసొచ్చి హితోక్తులచే యతని కోపంబు శాంతిల్లఁజేసి నివారించెను.

అంత దశముఖుఁడచ్చట తాను కావలిఁబెట్టియున్న దనుజ స్త్రీలంబిలిచి "మీరు నయభయములచే బోధించి యీ యువతిని నాయందనురాగముఁగల దానినిఁగాఁ జేయుఁడు. ఆలాగు మీరు చెప్పిన మాటలు వినక నిరాకరించెనేని, రెండుమాసముల వరకునుండి జంపుడని నాజ్ఞాపించి వెడలి లంకకుఁ బోయెను. పంక్తివదనుండరిగినంతట క్రూరచిత్తలైన యానిశాచరస్త్రీలు సీతకు చుట్టునుంజేరి, రావణుని మహిమను వర్ణించియు, బహువిధంబుల నాశలుచూపియు, నయవాక్యంబులు వలికియు, బతిమాలియు బెదరించియు, చంప నుంకించియు, నిందించియు, నయ్యసురేశ్వరుని వరింపఁజేయుటకై తమవలన నైనంతవరకు నాయాసపడి నిర్బంధింపఁ దొడంగిరి. సీత వారిపలుకులు చెవులని

డక వారలంగాంచి "ఓసీ! నిశాటలారా! ఈ దురుక్తులు నామోహ్రం బలుకవలదు.

—(*) సీత రాక్షస స్త్రీలవాక్యంబులు నిరాకరించుట. (*)—

మీా రావణుఁడు మీాకధికుండుగాని, వాఁడు నాబుద్ధి కత్యధముఁడుగా దోఁచును, త్రిలోక సామ్రాజ్య ధురంధరుండైన రాఘవేశ్వరుని యందు లగ్నంబైన నాచిత్తంబును మరల్చుటకు మీాకు సాధ్యంబగునా? ఏల వెతలొందిన నన్ను తొందఱపెట్టెదరు? ఈప్రయత్నములవలన మీారు చెందఁబోయెడి లాభమేయ్యది? ప్రయోజనములేదు. వట్టిభ్రమయే సుండీ! జగద్విఖ్యాత చరిత్రుండైన రామచంద్రుం డనుజ సహితుండై వచ్చి క్రూరమతియైన రావణుని సపుత్ర పౌత్ర బంధు మిత్రామాత్యముగా వధించి నన్నుఁ గొంపోఁగలండు. ఆసమయంబున మదీయ ప్రాణేశ్వరుని శౌర్యపరాక్రమములును, రావణుండు చెందఁబోయెడి దుర్గతియును మీారు చూడగలరు. ఇంక నేమియుం బలుకకుండుం"డని పల్కెను.

తమ మాటలువినక యవ్విధంబున నిరాకరించుటయు నిశాటస్త్రీలు కోపగ్రస్తచిత్తలై యామెను చంపెదమని బెదరించిరి ఆసమయమున నట బరుండి నిదురించుచుండునదియు, నచ్చోటనుండు రక్కసి గుంపున నధ్యక్షురాలునునైన త్రిజటయనునది మేల్కొని సీతను బెదరించుచున్న దానవ స్త్రీలంజూచి వారించి వారితో తనకుఁ గలిగిన స్వప్నమును యివ్విధంబునఁ జెప్పసాగెను.

—(*) త్రిజట తన స్వప్నమును రాక్షసస్త్రీలకు దెలుపుట. (*)—

యువతులారా! నేనొక కలఁగన్నాను. రావణుండు విపత్తును, సీతాపతియైన రామచంద్రుండు జయమునుం జెందుట తథ్యము. ఎట్లనగా వేయి తెల్లటి యేనుగులతోఁగూడి, సిభికారూఢుండై రామచంద్రుండు నెత్తురు ద్రావుచున్నట్లును, ఆకాపురమును మ్రింగుచున్నట్లును, సీతయు రామునిఁ జను, తెల్లని వస్త్రములు దాల్చి యున్నతంబైన కొండపై నుండు నట్లును, సీత సూర్యచంద్రులనంది తాకుచున్నట్లును, సీతాలక్ష్మణ సహితుఁడై రామచంద్రుండు పుష్పకమునెక్కి యంబరమార్గమునఁబోవుచున్నట్లను, మఱియు ననేకములయిన శుభలక్షణములతో నొప్పుచుండి నట్లును గంటిని. రావణునిగురించి యనిననో, ఎవతెయో యధిపతియో కత్తిక చేయిఁబట్టి యీడ్వగా యతండు భూమిపైఁ బడినట్లును,

బడినతలయు, నల్లని వస్త్రములును, యెఱ్ఱని పూవులును గంధమును ధరించిన దేహమును గలవాఁడై గాడిదెలు గట్టిన తేరెక్కి దక్షిణ దిక్కు గాఁబోయి, పేడచే నింపఁబడిన గుంటలో చొచ్చినట్లును, దక్షిణ నలం దికొనిన శరీరము గలిగిన భయంకర రూపిణియైన యొకస్త్రీ రక్తవస్త్ర మును మెడకుఁగట్టి రావణుని దక్షిణముగా లాగికొని పోవుచున్నట్లును, మఱియు, పంక్తిముఖుఁడు పందిని, యింద్రజిత్తు మొసలిని, కుంభకర్ణుం డుష్ట్రమును, నెక్కి దక్షిణముగాఁ బోయినట్లును, లంకయందలి రాక్షసులు రక్త మాల్యాంబరములుదాల్చి నృత్యమాడుచు, పాడుచు దక్షిణదిక్కునకుఁ బోయినట్లును, విభీషణుండు మంత్రులతోఁ గూడి యున్నతమైన తెల్లని కొండపై విహరించుచున్నట్లును గంటిని. నాకల తప్పునదికాదు. లంకేశ్వరునకు కీడుగలుగుటయు రఘువరునకు శుభముగలుగుటయు సిద్ధము. కావున మన మీసీతను బెదరించి చిక్కులఁబెట్టుట యుక్తముకాదు. ప్రియము గదుర సేవించుటచే మనకు మేలు గలుగును లేనిచో యుపద్రవము వాటిల్లును. నామాటలునమ్మి యీమె జోలికిఁబోవక మిన్నకుండుఁడు" అని బోధించిన వారలా వృత్తాంతమును విని వెఱఁగొంది జానకిని బెదరించుట మాని యంతతల మిన్నక శయనించి యుండిరి.

తత్సమయమున జనకసుత తనకు కలిగిన కష్టమును, దుఃఖమును, పతివియోగమును నెంచి మిక్కిలి చింతాక్రాంతయై రాక్షస సహితముగా లంకాపురము నాశమై పోవునుగాక యనిశపించె. వృక్షముపై గూర్చుం డి సర్వమునుం గనుచున్న హనుమంతుఁ డామెకుఁ దొడరిన కష్టమునకు వగచి, యది సమయంబని తలంచి తనరాక నెఱింగించుకొనదలఁచి శ్రీరామచంద్రుం డయోధ్యనుండి వనవాసమునకై సోదర భార్యాయుతము గా యడవికి వచ్చుటాదిగా, వనవాస వర్తనమును, కపట మృగాగమ నమును, సీతాపహరణమును, రామసుగ్రీవుల సఖ్యమును వానరులు నానాముఖముల భూపుత్రిని వెదకుటకుఁ బోవుటయు, తాను సముద్రమును దాఁటివచ్చుటయు, నిత్యాది సర్వవిషయములను వరుసగా వృక్షముపై నుండి చెప్పెను. ఆమాటలువిని రామచంద్రుని నామము చెవుల సోఁకుట కలరి సీత తలయెత్తి చెట్టుకొమ్మపైనున్న వనచర శ్రేష్ఠుని గని భయముఁజెంది పలువిధములం దనలో తలంచెను. అప్పు డాంజనేయుఁడు దిగివచ్చి యామెకు మ్రొక్కి బద్ధాంజలియై నిలిచి, తానెవ్వ

టకు కారణమైన వృత్తాంతంబంతయు జెప్పెను కాని రావణుండే యే మరించుటకై యట్టి రూపముందాల్చి వచ్చెనని తలంచి యామె హను మంతుని పలుకులు నమ్మక, ఓరిదురాత్మా! దశముఖా! ఎన్నిమాయల్లు చేసినం జేయుము. శీఘ్రముగా నీవు రామచంద్రుని బాణానలమున కా హుతిగాం గల''వని, దూషింపందొడంగెను.

— (*) హనుమంతుండు సీతకు ముద్రిక నొసంగుట. (*) —

ఆమెకు నమ్మకము గలుగలేదనుట సెఱింగి, యనిల సుతుండు ప్రమాణపూర్వకముగా నెన్నియో విషయములు జెప్పిన యామె యత నింగని రామచంద్రునియొక్కయు లక్ష్మణునియొక్కయు, లక్షణము లును, రూపములును, గుణములును, ప్రవర్తనములు మొదలుగాగల విషయములం జెప్పవలసినదిగా యడుగుటయు, వాయుసూనుం డామెకు నమ్మిక గలుగులాగున వర్ణించి యన్నియుం జెప్పి రామచంద్రుం డిచ్చిన ముద్రిక నొసంగెను. అప్పటికామె నమ్మకము గలదై, యాయంగుళీయ కమును మహాభక్తియుం బ్రియమును నతిశయింపగాం గైకొని ముద్దాడి యక్కునంజేర్చి తనకు వాటిల్లిన మహాపదవంబంతయుం జెప్పి, రామ లక్ష్మణుల క్షేమ వర్తమానము దెలియుటచే యుప్పొంగి, సుగ్రీవునింగొని యాడి "హనుమంతా! త్వరితము వానరేశ్వరుని సహాయముతో వచ్చి రాక్షసుల నాశముంజేసి నన్ను రామచంద్రుండు కొనిపోవునట్లు ప్రయ త్నింపు"మని చెప్పి, రఘువల్లభుండును తానును నడవులలో సంచరించు టయు, కాకాసుర వృత్తాంతము మొదలుగాగల కొన్ని విషయములును రామచంద్రునకుం దనపైంగల ప్రేమయు వక్కాణించి తన శిరోరత్న మునుదీసి, రామచంద్రునకు గుఱుతుగా నొసంగుటకై యతనిచేతికిచ్చెను ఆంజనేయుం డా శిరోరత్నమునుంగొని మహాభక్తితో యా పతివ్రతా మణికి మ్రొక్కి "జననీ! వానరాధిపుండగు భానునందనుని సహాయమున నసంఖ్య వనచర దళములతో లక్ష్మణసహితుండై రాఘవేశ్వరుండు శీఘ్ర మునవచ్చి ఈలంక ముట్టడించి పాపాత్ముండైన దశకంధరుని పుత్ర పౌ త్రామాత్యబంధు యుతముగా సంహరించి నిన్ను కొనిపోవును. ఇది సత్యము, నీవు దుఃఖము మానియుండు"మని ధైర్యముంజెప్పిన, యామె యతనింగని "హనుమంతా! రావణుండు రెండుమాసములు వ్యవధియొ సంగి యాలోపల నేను తన్ను వరింపని పక్షమున నన్ను వధించి భక్షిం చునటుల రాక్షసస్త్రీల కనుజ్ఞయొసంగియున్నాండు. కావున, త్వరితముగా

రామచంద్రుండు రావలయును. సుగ్రీవ ప్రముఖులను నేను ప్రియమున నడిగితినని చెప్పుము. నీవు తడవుసేయక పోయి వారలంగొని రమ్మ''ని చెప్పిన యాదేవికి పునర్నమస్కృతిఁజేసి, శాంతి నొందఁబలికి యనుజ్ఞఁ గైకొని ప్రయాణంబయ్యె.

—(*) హనుమంతుఁ డశోకవనంబుఁ బెఱుకుట. (*)—

అపుడతఁడు తనలో "నేను సముద్రమును లంఘించి యింతదూరము వచ్చితిని. జానకిని పొడగంటిని యామె క్షేమమునను వార్తను రామచంద్రాదులకు చెప్పఁబోవుచున్నాఁడను. ఈసమయమునఁనే నూరకపోవనేమిటికి? నాశక్తి నిచ్చోటి రాక్షసులకుఁ గొంత యెఱుగఁజేసి పోయెదఁగాక"యని యెంచి సీత కూర్చుండియున్న వృక్షమును మాత్రము విడిచి తక్కిన యావనమునఁగల సకల తరుచయమును వేళ్ళతోఁ బెఱికివైచెను. అటులచేయుటకు నంచున్న రాక్షసులు భయభ్రాంతులై పరుగున రావణునియొద్ద కరిగి వనచరుఁడు వచ్చుటయు, సీతతో సంభాషించుటయు, వనంబంతయు నాశమొనరించుటయు నాదిగాగల వృత్తాంతములను విన్నవించిరి.

పదునొకండవ ప్రకరణము ముగిసెను.



# శ్రీ రామవనవాసము.

## వచనకావ్యము.

### పండ్రెండవ ప్రకరణము.



తుదవరకును ఇచ్చటనుండి కథ సంగ్రహించి వ్రాయఁబడినది.

రాక్షసులవలన వనచరుండు వనముఁ బెరికిన వృత్తాంతమును విని దశకంఠుఁడు మహాగ్రహముఁగొని "వానిం బరిమార్చిరండు పొం"డని మహాశూరులం గొందఱను బనిచెను. వారు మహా దాడంబరముతో వచ్చి యాంజనేయునిఁగని యనేక బాణములు ప్రయోగించిరి. అనిలజుండు వారి శరములు వారించుచు కదిసి, యొకనిచేత నూడిన గదం గొని యందఱ నోలిగా మర్దించెను, ఆవిధంబెఱింగి రావణుండు సేనాపతులఁ బంపుటయు, హనుమంతుఁడు గదిచేయాది వారిని సంహరించెను పిమ్మట పంక్తిముఖుఁడు మంత్రులను బంపెను. వారిని సయితము వాయుపుత్రుండు నేలఁగూల్చెను. వనచరుని శక్తి కాశ్చర్యముఁజెంది యక్షుండను వానిఁ దన కుమారుంబిలిచి "యా దుష్టవానరుని మడియించి"రమ్మని చెప్పెను. అక్షకుమారుఁడు బహుళ సేనాయుతుండై రథంబెక్కి వచ్చి హనుమంతునిఁ దాఁకెను. మహా పరాక్రమ బాహు బలాన్వితుండగు సమీర కుమారుండక్రమమున సేనాసహితముగా వానినిఁ నేలఁ కూల్చెను. అదియెఱింగి రావణుఁడు కుమారుని మరణమునకు దుఃఖించి యాగ్రహం బతిశయింపగా ఇంద్రజిత్తును తన పెద్దకుమారుని బిలిచి యుత్సాహము గలుగులాగున నతని శౌర్యమును గొనియాడి మర్కటదాపర్థముగా ప్రయాణముఁజేసెను. ఇంద్రజిత్తు బలములతోఁగూడి వచ్చి హనుమంతునిందాకి తనశక్తి ప్రకటనమగునట్లు కొంత తడవు నానాస్త్ర

—(*) ఇంద్రజిత్తు హనుమంతుని బ్రహ్మాస్త్రముచే బంధించికొనిపోవుట. (*)—

ములుం బ్రయోగించి యుద్ధముఁగావించి తన శరములు వానరోత్తముని యెడల నిరర్థకములగు చుండుటఁగని యచ్చెరువొంది బ్రహ్మాస్త్రము నరివోసి ప్రయోగించెను. దానిచే కట్టు పడవలసినట్లు మున్ను నియమము గలిగియున్న కతన నయ్యస్త్రమును గౌరవించుటకై యాంజనేయుండు

హానిచే బద్ధుండయ్యెను. అంతట నింద్రజిత్తు మహా సంతోషముతో నత నింగొనిపోయి కొలువునున్న రావణుని ముంగనిలిపెను. రావణుం డత నిం జూచి యతని వృత్తాంతమును చెప్పవలసినదిగా యాజ్ఞాపించుటయు, వాతాత్మజుండు సర్వమునుం జెప్పి "ఓయిరావణా! మహాప్రతాపవంతు డైన రాముని దేవిని సాధ్వీమణిని దొంగిలితెచ్చుట నీకు క్షేమకరమగు నదిగాదు. బుద్ధిమంతుడవేని యామెను రామచంద్రునకు సమర్పించి శరణువేడుము లేనిచో సుగ్రీవ సహాయముతో వచ్చి రాఘవేశ్వరుండు పలికి ముట్టడించి నిన్నును నీవారిని సంహరించి సీతం గొనిపోవు"నని లంకి పెక్కువిధముల నీతి బోధించుటయు కోపముంజెంది యతని వధిం పుడని దైత్యుల కాజ్ఞాపించె. అపుడచట నుండినవారిలో మిక్కిలి బుద్ధి మంతుడును, రావణుని తమ్ముడునునైన విభీషణుండనువాడు వారించి అన్నతో దూతను చంపుట దోషమనియు, శిక్షింపం దలంచినచో, నేదేని యంగ వైకల్యము నొనరించుట ధర్మముగాని వధింపరాదనియుం జెప్పిన యతని ధర్మవాక్యముల నాదరించి, "కోతులకు తోంక యలంకారము గావున యీ మర్కటుని వాలమునుకాల్చి పురము వెడలం దరిమివే యుం"డని రాక్షసులతో చెప్పిన, మత్తులైన యాదైత్యు లాంజనేయుని తోంకకు గుడ్డలుచుట్టి నూనెలోముంచి రగిలించి పురమున నాల్గుదెసల ద్రిప్పుచుండిరి. రాక్షస స్త్రీలవలన యా వృత్తాంతము సీతయెఱిగి దుః ఖించి యగ్నిహోత్రునిం బ్రార్థించిన యామె మహిమచే యనలుండు హనుమంతుని వాలమును దహింపక వేడిమిలేక చల్లగా మండుచుం డెను. అంత నయ్యగచర సత్తముండు శరీరము సంకుచితముం జేసి కట్లు వదలించుకొని మహోగ్రాకారముందాల్చి వెంటనున్న రాక్షసులంజంపి తోకయందలి మంటతో మింటికెగసి విభీషణుని గృహము దక్క తక్కిన లంకాపురమునంగల సకల మందిరములకును నిప్పునాటించి దగ్ధము గా వించెను. బహుతర సుందరములైన రావణప్రముఖుల హర్మ్య సౌధ

—(*) హనుమంతుడు లంక గాల్చుట. (*)—

ప్రతతులన్నియు భస్మమై నేలంగూలెను. మిన్నది మండుచున్న పెనుమం టలలోంజిక్కి వెలువడజాలక, స్త్రీలు పురుషులు బాలురు వృద్ధులు మొదలుగా నెల్లవారును హాహా కారములుచేయుచు, నేడ్చుచు మండి భస్మమై కూలిరి. మహాదాశ్చర్యకరమైన వాయునందనుని శక్తి సామ ర్థ్యములుగాంచి దేవత లతని ననేకవిధములం గొనియాడిరి

ఈప్రకారముగా నంజనీపుత్రుండు లంకాపురమునుగాల్చి నాశ మొనరించి పిమ్మట తానొనరించిన పనివలన జనకసుత కేదేనియుం గీడు గలిగెనేమోయని మరల నామెయొద్ద కరిగిచూచి సంభాషించి యనుజ్ఞ గైకొని సముద్రము నొద్దకుంబోయి మండుచున్న వహ్నినంబుధిజలము లలో చల్లార్చికొని యచ్చోటి కొండయెక్కి, తనరాకకై యావలియొడ్డు నగాచియున్న యంగదాదులయొద్ద కరుగువాడై పూర్వోక్తప్రకారం బున నెగసి యంబరమునంబోయి వారిముందు దుమికెను.

అంగదాదు లతనిం జూడగానే పరమానందముంజెంది మంచి ఫలముల నతనికి దెచ్చియిచ్చి యాలింగన మొనరించి గౌరవించి సీతా వృత్తాంతము నడిగిరి. హనుమంతుండు వారినివిడిచి యంబుధి లంఘించి పోయినది మొదలుకొని మరలం నచ్చోటికిం జేరి నప్పటివరకును జరిగిన వృత్తాంతంబొకటియుం దప్పకుండునటుల నెఱింగించి సీతాదేవి క్షేమము ముగా నుండుటం జెప్పెను. వానరులు సంతోషమగ్నులై యావర్తమాన మును, రామలక్ష్మణ కపినాయకుల కెఱిగింపవలయునని వేగిరపాటుతో ప్రయాణంబై పోవుచు మార్గమధ్యమున సుగ్రీవుని దగు మధువనముం జొచ్చి యడ్డగించిన వనపాలకులం గొట్టి యందలి తేనియంగ్రోలి ఫలం

—(*) వానరులు మధువనంబుజొచ్చుట. (*)—

బులుమెసవి వినోదించుచుండ రవినందనుని మేనమామయు, వనరక్ష కాగ్రేసరు డున్నైన దధిముఖుండనువాడు వారల నాక్షేపించి వారిచే దెబ్బలుతిని యటనుండిపోయి రామలక్ష్మణ సహితుండైయున్న సుగ్రీవునకు వారు చేసిన దుండగములు విన్నవించెను. సుగ్రీవుండు కోపింపక వారల త్వరితముగా తనయొద్దకు బంపవలసినదిగా చెప్పిన దధిముఖుండు వచ్చి సుగ్రీవుని యాజ్ఞం దెలియంబలికెను.

అంగదాదులు ప్రయాణంబై పోయి దశరథ నందనులకును సుగ్రీ వునకును నమస్కరించినంతట హనుమంతుడు సీత క్షేమముగా నుండు టంజెప్పి జరిగిన వృత్తాంతమును ఆమె చెప్పిన మాటలును నెఱింగించి తనచే నొసంగిన శిరోరత్నము నిచ్చెను. దానినింగని రామచంద్రుం డెంతయు దుఃఖించిన సుగ్రీవుండు శాంతిల్లజేసి లంకాపురము ముట్టడిం చుటకై ప్రయత్నముచేసి యఖిల వానర బలములం గూర్చి సిద్ధము గావించెను.

రామలక్ష్మణ సుగ్రీవులు వానరబలంబులతో లంకకు ప్రయాణంబగుట. —

ఈప్రకారము తెరుచర బలంబులు సన్నద్ధంబగుటయు తత్సేనాని వహాంబులతో గూడి ధరణి గ్రక్కదలు చుండగా రామలక్ష్మణులును సుగ్రీవుండును ప్రయాణంబై క్రమక్రమంబుగా నడిచి దక్షిణపు సముద్రతీరంబుఁజేరి యంబుధి మహాఘోషంబుతో భయంకర కల్లోల యుక్తంబై యుండుటంగని దాని దాటుటకు వెరవుగానక రామచంద్రుండు దర్భలపై శయనించి యనేకవిధంబుల సముద్రునిఁగూర్చి తమకు దారి నొసంగుమని ప్రార్థించెను. సాగరుండు త్రోవ నొసంగకుండుటయు రామచంద్రుండు కోపముఁజేరి వింటబాణంబు సంధించి యార్ణవజలంబులు నింకించెదంగాక యని ప్రయోగింపయత్నించుటయు సముద్రుండు భయమొంది ప్రత్యక్షంబై "రామచంద్రా! కోపము నుపసంహరింపుము. నన్నుతరించుటకు వెరవుజెప్పెద వినుము, వానరులచే పెనుబండలుం గొండలుం దరువులును దెప్పించి వారధిం గట్టింపుము. మీ సైన్యంబునంగల నలుండనువాడు ముట్టినచో రాలు సయితము నీట మునుంగక తేలుచుండును. అతని కట్టి వరంబుగలదు. మీరు సులభముగా దాటి పోవచ్చు"నని చెప్పితిరోహితుండయ్యె. అంత రామచంద్రుండు వనచరులంబిలిచి నలుని సహాయముతో వారధిం గట్టుడని నియమించె బలీయులైన కపులు కొండలు వృక్షములుందెచ్చి వైచుచుండగా నలుండు సేతువుం గట్టదొడంగెను. ఇట్లున్నసమయంబున రావణుని తమ్ముడైన విభీషణుం డంతరిక్ష మార్గంబున వచ్చి శ్రీరామచంద్రుని శరణుజొచ్చి "దేవా! సీతకొఱకు విరోధముచేయుట కుశలముగాదనియు, సీతాదేవి నర్పించి సుఖంబున నుండుమనియు నేను నాయన్నయైన శతముఖునకు హితవుజెప్పిన నామాటలు చెవుల నిడక దుర్మంత్రుల వాక్యంబుల నాదరించి సోదరుఁడ ననెడి మరియాదయైనం దలంపక నన్ను పాదంబుచే దాచివెడలనడచె. అటువంటి దుశ్శీలునియొద్ద నుండనొల్లక నీ మరుగుజొచ్చి భవద్దాసుండనై మనవెంచివచ్చితి రక్షింపుమని" ప్రార్థించిన రఘుకులేశ్వరుం డతని గరుణించి మన్నించి యభయంబొసంగి "రావణుని సంహరించి నిన్ను లంకా రాజ్యాధిపతిం జేసెద"నని యపుడే యతనికి పట్టాభిషేక మహోత్సవ జేయించెను. అంతలో నలుండు సేతువు నిర్మించుటయు దళంబుల

తో నందఱును సులభముగా సాగరమును దాటిపోయి లంకాపురమున్ ముట్టడించిరి.

—(*) వానరులు లంకముట్టడించి ధ్వంసముచేయుట. (*)—

అటుల ముట్టడించి కోటలెక్కియు, బురుజులుగూల్చియు, గోడలు త్రోసియు, మేడలు గోపుర ప్రాకారములు గూలద్రోసియు, నగడ్తలు పూడ్చియు పురము నల్లకల్లోలము జేయుటయు, నేల యీనిన చందమున చెలరేగివచ్చి నానావిధంబుల పురంబు నాశమొనరించుచున్న భీమాకారులైన వానరులంగని పౌరులు భీతిల్లి యార్చుచు నేడ్చుచు వీథులంబడి పరుగెత్తసాగిరి. పట్టణంబున మహాఘోష జనించి లంక యేడ్చుచున్నదోయని తోచుచున్నట్లుండెను. తమకుం దొడరిన కష్టములకు సహింపలేక యా బాలవృద్ధముగా నెల్లరును రావణుని నిందింపందొడంగిరి. అంత తద్వృత్తాంతము నెఱింగి రావణుండు కోపించి బహుళ సైన్యముల నాయిత్తముజేసి యుద్ధమునకుం దలపడుటయు, పోరు ఘోరమై ప్రవర్తిల్లెను. ఆ సంగరమున రామలక్ష్మణులు విజృంభించి యుద్ధముంజేయం గడఁగిరి. లక్ష్మణుండు యింద్రజిత్ప్రముఖుల ననేకులం జంపెను. రామచంద్రుండు రావణుని తమ్ముఁడగు కుంభకర్ణుని దునిమి పిమ్మట పంక్తికంఠుని వధించెను. ఈరీతిని రావణ కుంభకర్ణాదులు హతులగుటయు, రఘువరుండు తమ్మునిఁబిలిచి విభీషణునిం గొనిపోయి లంకాపురంబున పట్టాభిషిక్తునిం గావించి రమ్మని యాజ్ఞాపించెను. లక్ష్మణుండన్న యా

—(*) విభీషణుని పట్టాభిషేకము. (*)—

జ్ఞనుసారముగా విభీషణునిం గొని చని పుణ్యోదకములు దెప్పించి యభిషేకింపంజేసి, మహా విభవముతో పట్టంబుఁగట్టిన యతం డానందంబెసంగం గానుకలుగొని సౌమిత్రితోడ రామచంద్రుని యొద్దకువచ్చి నమస్కరించి తాను కొనివచ్చిన బహుమతులు సమర్పించెను.

రాఘవేశ్వరుండు విజయుండై విభీషణునకు పట్టాభిషేకంబును జరిగించి మైనంతట తగినవారలంబనిచి జనకరాజ నందనను రావించెను. పతివ్రతారత్నంబైన సీత తన పతియొద్ద కరుదెంచి యమ్మహాత్ముని పాదకమలములకు నమస్కరించి వినయంబున నోరనిలిచిన, రామభద్రుండామెయందు కళంకంబు గలిగియుండ బోలుననెడి సందేహము గలవాఁడై పరిగ్రహింప నొల్లకున్న వల్లభుని యభిప్రాయంబు నెఱింగి తన నిష్కళంక




రావణ యుద్ధము.

త్వము స్పష్టమగుటకై భూమిజ యగ్నిప్రవేశముఁ జేయ నిశ్చయించెను.

—(*) సీత యగ్నిప్రవేశము చేయుట. (*)—

అపుడచ్చోట కట్టెలుచేర్చి గొప్ప మంటలు గలుగు లాగున నిప్పంటించిరి. సాధ్వీమణి ధరాసుత శుచియై "నాయందెట్టి దోషమునుం గలుగదేని యీ యగ్నివలన నిసుమంతయుం కీడు పొరయకుండునుగాక" యని పలికి ప్రదక్షిణ మొనరించి యా పెను మంటలోఁజొచ్చెను. నిరుపద్రవముగా నందు నిలిచియున్న యామె మహిమంగని యందఱు నాశ్చర్యమొంది యామె ననేకవిధంబులఁ గొనియాడుచుండిరి. తత్సమయంబున నగ్నిహోత్రుఁ డామె నిష్కళంకత్వం బ్రకటించుటకై ప్రత్యక్షంబై సీత దోషరహితయని చెప్పి రామున కప్పగించి తిరోహితుండయ్యె. అంతట నెల్లవారలును పరమానందంబుఁ జెందిరి. రామచంద్రుండును సంతోషించి జనకనందనను పరిగ్రహించి ప్రియంబెసంగ మన్నించెను. దేవతలును మునులును సీతారాముల నాశీర్వదించి పొగడిరి.

ఈలాగు రఘుకుల నాయకుండు, సీతాదేవింబడసి రావణునిదగు కామ గమనంబుగల పుష్పకంబనెడి విమానముదెప్పించి, విభీషణ ప్రభృతులైన రాక్షసులును, సుగ్రీవాంగద హనుమత్ప్రముఖులైన కపి పుంగవులుం గొలువగా సకల బల సంయుతుండై విమానంబుపై సీతాలక్ష్మణ సహితుఁడై యారోహించి యయోధ్యకుఁ బ్రయాణంబయ్యెను.

—(*) శ్రీరాముడు సీతాలక్ష్మణులతోడ నయోధ్యకేగుట. (*)—

పుష్పకారోహణంబుఁ జేసి యంబరమార్గంబునఁ బోవుచున్న సమయమున రఘువరుండు తాము తిరిగిన చోటులును, నివసించిన చోటులను వనములును, నదులును, కొండలునుం జూపి, యందంగల విశేషంబులు వివరించుచుండ యామె మిక్కిలి యానందంబునుజెందెను. విమానం బయోధ్యను సమీపించినంతట యొకచోట క్రిందికిదిగి నిలువఁజేసి, తమరాకను భరత ముఖ్యుల కెఱింగించుటకై ముందుగా హనుమంతుని బంపుటయు నతండరిగి భరత శత్రుఘ్నులం గని నమస్కరించి రామచంద్రుండు వచ్చుటం జెప్పిన మహానందంబుతో వారలు త్వరితంబుగా పురాలంకారముఁ జేయించి సకలవిధ వాద్యంబులును మంగళ తూర్యములును మెరయగా, గురుజన బంధుమిత్ర పురోహితామాత్య దండనాయకులంగూడి బహుళ సేనా పరివార యుక్తముగా రాఘవేశ్వరుం దోడ్కొనివచ్చుటకై యయోధ్యనుండి యెదురుగా చనుదెంచిరి.

భరత శత్రుఘ్నులు మహా విభవముతో నట్లు చనుదెంచి సీతా లక్ష్మణయుతుండైన రామభద్రునిం బొడగని తదీయ చరణారవిందములకు సాష్టాంగ దండ ప్రణామంబు లాచరించి మహీనందనకు నమస్కరించిన యంతట భరతుండు సౌమిత్రి నాలింగనముఁజేసిన శత్రుఘ్నుం డతనికి మ్రొక్కెను. తత్పూర్వమే హనుమంతుడు చెప్పగా సకల వృత్తాంతములు నెఱింగియున్నవారుగావున, వరుసగా సుగ్రీవాంగద జాంబవ త్ప్రభృతులను, విభీషణ ముఖ్యులను వేఱువేఱఁ గౌగలించి మర్యాదఁ గావించిరి. అంత వసిష్ఠ ముఖ్యులంగాంచి సీతా రామలక్ష్మణులోలిగా యామహాత్మునకు నమస్కారంబు లొనరించినవారలు వారి కనేక దీవనలొసంగిరి. ఇట్టుల నెల్లవారును నానందంబును జెందియుండగా తత్పూర్వము దాల్చియున్న మునివేషంబులు దొలంచి రాజలక్షణంబులు శోభిల్ల వారిని రమణీయవస్త్రాభరణాదులు ధరింపఁజేసి యంత నలంకృతంబైన భద్ర గజంబుపై రామచంద్రుని భూపుత్రి సహితముగా నాసీనుఁజేసి యిరువంకల భరత శత్రుఘ్నులు వి జామరంబు వీచుచు వెనుకనుండి సుమిత్రాసుతుండు శ్వేతచ్ఛత్రమును బట్టగా జయజయ ధ్వనులును, బహుతర వాద్యరవంబులును, మంగళాశీర్వాద నినాదంబులును నింగి ముట్టుచుండ గదలి శుభముహూర్తంబున దేవేంద్ర విభవంబుతోడ రమ్యాలంకార శోభితంబై యొప్పుచున్న యయోధ్యానగరంబుఁ బ్రవేశించి రాజమార్గంబున జనుదెంచుచుండ, సంతోష భరితాంతరంగులై యప్పురజనంబులు సీతారాములపై పుష్ప లాజాక్షతలు చల్లువారును, కర్పూర నీరాంజనంబు లొసంగువారును, దీప హారతులు నివాళించువారును నై, తమకు మరల సీతారాముల సందర్శన భాగ్యంబు లభించినందున పరమ సంతుష్టాత్ములై ప్రమోద సముద్రంబున నోలలాడుచుండిరి.

ఈప్రకారము వైభవంబెసంగ రామచంద్రుండుపోయి నగరు ప్రవేశించి యంతఃపురంబున కరిగి సీతాలక్ష్మణ సహితుండై కౌసల్యా కైక సుమిత్రలకు నమస్కరించి నిలిచిన వారు నేత్రపర్వముగా, రామలక్ష్మణులను భూపుత్రినిఁగని కౌఁగలించి దీవనలొసంగి యానంద పరవశులై యుప్పొంగిరి.

పిమ్మట రామచంద్రుండు నిజ సౌధంబున కరిగి తన వెంటవచ్చిన సుగ్రీవ విభీషణాదులకు తగిన విడిది పట్టులఁజూచి, సైన్యముల నమవగు చోటుల విడియించి సౌమిత్రి నతని నగరున కరుగ ననుజ్ఞయొసంగిన,

యన్నకు మ్రొక్కి యతండు పోయి నిజ ధామంబున తన సతీ ప్రముఖుల సంతోషమగ్నులం జేసెను

ఇటుల మిక్కిలి సంతోషముతో నాఁటిదినముగడపి, మఱునాఁడు, మంత్రి సామంత బంధుమిత్ర పురోహిత సేనానాయకులును, వసిష్ఠాది గురుజనులును, తమ్ములునుం బరివేష్టించియుండగా రఘుకులేశ్వరుఁడు కొలువు గావించియుండగా, కులగురుండు సకల జనానుమతంబున రామ చంద్రునింజూచి, "ఓయి రామభద్రా! ఇంక మీతండ్రిచే పాలింపఁబడు చుండిన రాజ్యభారమును వహించి నీవు సర్వజన ప్రియంకరుఁడవై ధరా పాలనం బొనరింప యత్నింపుము. తడవుఁజేయక పట్టాభిషిక్తుండ వగుట కర్తవ్యం"బని చెప్పిన రఘువరుండు సమ్మతించె అపుడు భరతుండు భక్తితో బద్ధాంజలియై యన్న ముందునిలిచి యమ్మహాత్ముఁ డరణ్య మున కరిగినది మొదలుగా నప్పటివరకును, పాదుకల ప్రధానముగా నర్చించుచు తాను జరిగించిన కృత్యములు సర్వమును విన్నవించి "అప రాధము లుండినచో క్షమించి భవదీయ రాజ్యభారమును గైకొని కరు ణతో మమ్ముఁ బాలింపు"మని విన్నవించి నమస్కరించెను.

—(*) శ్రీరామచంద్రుని పట్టాభిషేక మహోత్సవము. (*)—

పిమ్మట వసిష్ఠమహర్షి పట్టాభిషేకమునకు శుభముహూర్తము ని ర్ణయించి చెప్పిన సకలనిధ సన్నాహములును గావించుటకు తగిన వారిని నియోగించి, రామభద్రుండు నానాదేశ రాజులును బంధుమిత్ర జనంబుల ను బిల్వఁబంపెను. అయోధ్యా నగరమును వైకుంఠపురమునుం బోలె బహు తరాలంకార కలితము గావించిరి. పౌరులు తమ తమ గృహము లలంకరించి ద్వారపార్శ్వములం గదళీ తరువులు నిలిపి మాకంద దళతో రణములంగట్టి రమణీయముగా నొప్పునట్లు జేసిరి. పచ్చల తోరణముల చేతను, ముత్యాల ముగ్గులచేతను, చలువ పందిళ్ళచేతను నయోధ్యా పురము చూపరులకు నేత్రోత్సవకరంబై యుండెను. క్రమముగా సకల కార్యములు సిద్ధమొనరింపఁబడెను వసిష్ఠ ప్రముఖులైన మునులును రాజులును, బంధుమిత్ర ప్రతతులును, సకుటుంబులై రథగజతురంగపదా తి వర్గములతోడ నొక్క మొగి నరుదెంచిన భరతుండు వారల కందఱ కును విడుదులుచూపి విడియించెను. అంతట వసిష్ఠుండు హనుమదాద్యు లఁబిలిచి చతుస్సముద్రముల జలములును, పుణ్యతీర్థములునుం దెప్పించి, సీతారాములకు మంగళ స్నానముఁజేయించి యనర్ఘ రత్నభూషణాంబర

ఘోరులంజేసి పుష్ప చందనాలంకృతులు దనర నొప్పుచున్న వారలం దో డ్కొనివచ్చి విలసిత శృంగారాభిరామంబైన కొలువు మందిరమున మణి మయ సింహాసనముపై రాఘవేశ్వరుని జనకజతోడ నాసీనుంజేసి, బ్రా హ్మణులు మంత్రంబులు పఠింప శుభలగ్నమున నభిషేకించి జయధ్వను లును, విప్రజ నాశీర్వాదములును, బహువిధ మంగళతూర్యరవములును, జనుల కోలాహల నిస్స్వనములునుం గలిసి యాకాశమునఁ బ్రతిధ్వనులు గలుగుచుండగా పట్టముఁగట్టిరి. శ్రీరామచంద్రుం డివ్విధమున పట్టాభిషి క్తుండగుటయు, రాజులు వరుసగా తాముఁ గొనివచ్చిన కానుకలు సమ ర్పించి పాదాక్రాంతులై బహువిధముల సంస్తుతించిరి. అట్టి సమయమున రఘువల్లభునకు సౌమిత్రి పరిశుద్ధములైన ముత్తెములు గూర్చిన తెల్ల గొడుగుంబట్టెను భరత శత్రుఘ్ను లిరువంకల నిలిచి చామరములు వీచుచుండిరి. సుగ్రీవాంగదాది వానర శ్రేష్ఠులొకవైపునను, విభీషణ సంపాతి ముఖ్యులైన రాక్షసవీరు లొకప్రక్కను సువర్ణ పాత్రములు కర ములదాల్చి సేవించుచు వరుసలుగా నిలిచియుండిరి తపోధనులు విప్రో త్తములును, నిరుదెసలందు నున్నతాసనము లలంకరించి విలోకించుచుం డిరి. దేశాధిపతులు ముందువైపున బద్ధాంజలులై నిలిచియుండిరి. ఆస మయమున రామచంద్రుండు లక్ష్మీసహితుండై వైకుంఠ మందిరమున గొలువుదీరియున్న శ్రీమన్నారాయణుడునుంబోలె సీతాదేవి వామభా గమున నాసీనయైయుండగా యెల్లవారకును నేత్రపర్వ మొనరించుచుం డెను. ఇట్టి మహాసభయం దాయిన కులేశ్వరుండు సంతోషాంతరంగుడై యుండ హనుమంతుడు పాదాంబుజంబు లొత్తుచుండె. దేవత లంబరము ననుండి పుష్పవర్షముం గురిసిరి. మింట నచ్చరల నాట్యమును, గంధర్వగా నములును, నిర్జర దుందుభి ధ్వనులును నతిశయించెను లోకారాధ్యుండై న కౌసల్యానందనుండు రాజ్యాభిషిక్తుండగుటచే, ఋతుభేదములేక సకల తరువును, కిసలయ కుసుమఫల భరితములై యొప్పెను. లతాతతులు పుష్పించి సుగంధములు వెదచల్లుచుండెను. చల్లని మందమారుతము వీవఁదొడంగెను. ఖగమృగాది సర్వజంతు సమూహములును పరమానం దమును జెందెను. ప్రపంచంబంతయు నవీనరమ్యశోభా కలితంబై కను పట్టెను. జనులురామరాజ్యమున తమ కెట్టికొఱంతలునుం గలుగవని మిక్కిలి సంతుష్టిని వహించి రఘువల్లభునికి శుభముఁ గోరుచుండిరి. అంత రాఘవేశ్వరుడు మునులకును, విప్రకోటికిని, రాజులకును, సుగ్రీ

వాంగద హనుమదాదులకును, విభీషణ ప్రముఖులకును, పేదసాదలకును, వారివారికిఁ దగిన మర్యాదలు గావించి బహుమతులొసంగి యందఱను మృష్టాన్న భోజన పరితుష్టులం గావించుటయు, ప్రమదాయత్తచిత్తులై యెల్లవారును రామచంద్రునివలన ననుజ్ఞనొంది తమతమ స్థానములకు వెడలిరి. తత్సమయమున రాఘవుండు సుగ్రీవ విభీషణులంబిలిచి, మిక్కిలి గారవించి, "మీసహాయమున నేను మహాత్కార్యము లొనరించి మనోరథ, సిద్ధిపడసితి, మన సఖ్యము మరువకుండుఁ"డని యాలింగనముఁ గావించి వీడ్కొలిపెను. పిమ్మట, తమ్ములు సేవింపుచుండగా మిథిలేశ నందనఁగూడి సకల సుఖములు ననుభవించుచు, రాఘవేశ్వరుండు ప్రజలను కన్న బిడ్డల చందమున నరయుచు న్యాయముఁ దొలఁగక జనకరంజకముగా పెక్కువేల సంవత్సరములు భూమిని పాలింపుచు, దిగంత విశ్రాంత యశోవిరాజితుఁడై లోకస్తుతి యతిశయింపగా పరమానందమున వెలయుచుండెడు.

## ఫలశ్రుతి.

పరమ సుజ్ఞాన స్వరూపుఁడును నాశ్రిత జల మందారుఁడును, కరుణామయుఁడును, ననంత సద్గుణగణ ధాముఁడును పుణ్యశీలుండును ప్రవిమల చరిత్రుండును నగు శ్రీరామభద్రుని వనవాస వృత్తాంతంబైన యీ భవ్యచారిత్రమును భక్తియుక్తులై చదివినవారికిని వినినవారికిని శ్రీజానకీజానీ కృపా విశేషముచే నాయురారోగ్య భోగభాగ్యములును పుత్రపౌత్రాభివృద్ధియుం గలిగి యైహిక సుఖము లనుభవించి పాపరహితులై దేహాంతమున శాశ్వతంబైన వైకుంఠ పదవినంది సౌఖ్యము లొందుట కర్హులై యొప్పెదరు.

క॥ రవిచంద్రులుఁ జుక్కలున | ర్ణవములు పర్వతము లెన్నినాళ్ళుగలుగునీ
భువిసంతదనుకయీకృతి | ధ్రువముగ వర్ధిల్లుగాక తోరంబుగమన్॥

శ్రీరామ వనవాసచరిత్రము.

సంపూర్ణము.

శ్రీమద్వేంకటేశ్వరార్పణమస్తు

సమస్త సన్మంగళానిభవంతు, సర్వేజనా స్సుఖినోభవంతు.



ఆనంద భారతి పవర్ ప్రెస్, నెం 63 కృష్ణప్పనాయకన్ గుంటవీధి, మద్రాసు.

త్వరపడుడు ! సకలమైన మేహవ్యాధులు తీరును !!! త్వరపడుడు !!!

# మేహనివారణి అమృతసంజీవి నూనె.




మిత్రులారా! ఈమేహనివారణి సంజీవినూనె సుమారు 50 సం॥ ముందు హిమాలయపర్వతములయందు ఒక మహాఋషి వల్ల కనిపెట్టబడినది ఈ ఔషధము దైవానుగ్రహమువల్ల మా పెద్దలకు వుపదేశింపబడినది. ఈ సంజీవినూనె మా చెన్నరాజధానిలో అనేకరోగులకు ఈ నూనె ఒకసారి మావద్దతీసి సేవించినవారు తమ స్నేహితులకు తెలిపించినందువల్ల వారి మూలములవల్ల రోగములు నివారణలేక రోగములచే బాధపడుచు మనస్సురోసి యెట్లును తోచక గొప్ప అవస్థలో చింతించే రోగులకు యీ నూనె స్వల్పధరలో తయారుచేయడమైనది.

ఈనూనె కొన్ని శాస్త్రసంబంధమయిన నూటయిరువదిపచ్చి మూలికలున్ను ఉప్పువగయిరా అనుపసరుతో తయారుచేసి అనేకరోగములను ఖండించబడిన ముఖ్యమైన ఔషధము యెటువంటి దుర్గుణమైన వ్యసనాలున్నా ఇంకా పలువిధమేహరోగములను భస్మముగా నశింపజేయు సంజీవి అమృతనూనె యని చెప్పనగును.

ఈనూనెవల్ల నివారణమగువ్యాధులవివరం:—కంఠమాల, అడ్డకర్రిలు, కొరుకు, ఆసనసంబంధమయిన మూలవ్యాధులు, పెట్లసవాయి, చిట్లపిరంగి, నల్లమచ్చలు, సవాయి, గ్రంధి, మేహతామర మచ్చలు, మేహదురదలు. గజ్జి. మేహములు,. పార్శ్వవాయువు, మేహవాయువు, సూతకజన్ని, కాళ్లుచేతులు పట్టుపట్టుట. ముఖమువుబ్బుట, తెల్లసెగ, పచ్చసెగ, మూత్రములోవచ్చు చెడువ్యాధులు, నడుమునొప్పులు, కుసుమవ్యాధి, అధికమేహమువల్లవచ్చు పచ్చకామిర్లు, మూతకొరుకు యేనుగు కాళ్ళువలె వుబ్బుట మొదలయిన మేహరోగములను ఖండించి రక్తశుద్ధిచేసి జనులు ఆశ్చర్యపడునట్లుగా దేహము సూర్యునివలె తేజస్సును, మన్మథునివలె పుత్రసంతానమున్ను గలుగజేయును, ఔషధమునకు పత్యనోటీసు బుడ్డితో పంపబడును. తమయొక్క వ్యాధి యెన్నిదినములుగా యున్నదిన్ని రోగముయొక్క వివరం తెలియపరచవలెను. మీ యుత్తరములు రహస్యముగా వుంచబడును.

- దినములుగడచిన వ్యాధులకు 5 పూటలు నూనె — 3-0-0
- సాధారణమయిన వ్యాధులకు 3 పూటలు నూనె — 2-0-0

# కస్తూరిమాత్రలు.

ఈ మాత్రలు జలదోషము జలుబు వీట్లను తాంబూలముతో చేర్చి పుచ్చుకొనవచ్చును గర్భిణీ స్త్రీలు తాంబూలముతో భుజించినయెడల సుఖముగ ప్రసవించుదురు.

0-8-0

---

మా విలాసము:—యన్. వి. గోపాల్ అండుకో.,

నెం 63, కృష్ణప్పనాయకన్ గుంటవీధి, సౌకార్ పేటపోస్టు, మదరాసు.




## గోల్డ్ పెయిన్ బామ్ (లేక తలనొప్పిమందు.)

ఈ ఔషధమువల్ల తీరునట్టి వ్యాధులు:—కీళ్లనొప్పులు, తొడనొప్పులు, నడుమునొప్పి, పార్శ్వవాయువు, బీజరోగము, ఒంటితల్లనొప్పి, పార్శ్వపునొప్పులు, గొంతునొప్పి శిరోభారము ఇంకనుకొన్ని వ్యాధులకు ఈ తైలము 3,4 సారులు 5 నిమిషములులేక 10 నిమిషములకు ఒకలేప రుద్దుచుండినయెడల పైచెప్పినవ్యాధులన్నియు పటాపంచలై పోవును దీనిని వుపయోగించువిధము ఔషధముతో పంపబడును. సీసా 1-కి ధర 0-8-0 మాత్రమె, డజను 1-కి ధర రు. 5-0-0 పోష్టుచార్జి ప్రత్యేకము.

యూకలిప్టసుఆయిల్ అను నీలగిరితైలము బుడ్డి 1-కి 0-4-0 డజను 1-కి 2-8-0

## గోపాల్స్ టానిక్కు.



ఆకలిని కలుగజేసి బలమును ఇచ్చునట్టి ఔషధరాజము.

1 గోపాల్స్‌టానిక్కు అను ఔషధము హాయముతోను, పలువిధములగు వనమూలికలచేతను తయారుచేయబడి జనులకు మిక్కిలి వుపయోగకారియగు పరమశ్రేష్ఠమైన ఔషధరాజము.

2 గోపాల్స్‌టానిక్కు అను ఔషధము బలహీనము, దేహశ్రమ, తలతిప్పుట, నపుంసకత్వముతొలగించి దేహమునకు బలమును కలిగించును. మగతనము లేనివారికిగూడ ఈ ఔషధమును పుచ్చుకొనిన లింగమునకు బలమును కలిగించి ఇంద్రియ పటుత్వమును, దేహదారుఢ్యమును గలుగజేయు గొప్ప ఔషధరాజము

3 గోపాల్సుటానిక్కు అను ఔషధము జీర్ణశక్తిలేని వారికి ఈ ఔషధము పుచ్చుకొనినతోడనే ఆకలిని కలిగించి యెటువంటి పదార్థమునైనను త్వరలో జీర్ణముకలిగించి రక్తమును వృద్ధిపరచి దేహపటుత్వమును కలిగించుగొప్పదగు ఔషధరాజము.

4 గోపాల్సుటానిక్కు ఈ ఔషధముతో సమానమగు టానిక్కు మరేదియును లేదు. నరములకు బలమును కలుగజేసి వృద్ధులనుసహా వయోవంతులుగ జేయును.

5 ఈ ఔషధముపుచ్చుకొను విధము:—భోజనమునకు ముందు ఈ ఔషధమ్మును కొంత చల్లని మంచినీళ్ళలో అర్ధటీస్పూను మొదలు ఒక టీస్పూనువరకు కలిపిపుచ్చుకొనవలయును. దినమునకు 3 పర్యాయములుపుచ్చుకొనవలయును మందుపుచ్చుకొనినవెంటనే యేదయిన ఆహారమును భుజింపవలయును. దీనికి యేలాంటి పథ్యములేదు.

సీసా 1-కి రు 1-8-0

ముఖ్యగమనింపు:—ఈ ఔషధరాజమును విడువక మూడుసీసాలు సేవించినయెడల యేలాంటి వ్యాధులను దగ్గరచేరనీయక తొలగించివేయును.

---

మా విలాసము :—ఎన్. వి. గోపాల్ అండు కో.,

నెం 63, కృష్ణప్పనాయకన్ గుంటవీధి, సౌకార్ పేటపోస్టు, మదరాసు.

## మేలురకం రోమసంహారి పౌడరు.

దేహమునందు యేభాగమందయిననుండు వెంట్రుకలను బోగొట్టదలంచి ఈపౌడరును వుపయోగించుచు వచ్చిన యేయొక్క అపాయములేక శుభ్రముగా వెంట్రుకలి వీడిపోవును. సీసా 1-కి 0-8-0 రోమసంహారిసోబు 3 బిళ్లలుగల పెట్టె 1-కి0 12-0

## రక్తశుద్ధి అయఃకాంత ద్రావకము.



తెల్లని వెంట్రుకలు నల్లనగుట, పురుగులుకత్తిరించుటను, అధికవుష్ణమువల్ల రాలిన వెంట్రుకలను మరల పెరుగనిచ్చును, కండ్లు చేతులు కాళ్లుమంటలనుపోగొట్టును, ముఖమునకు తేజస్సుకలుగజేయును, దేహమునందుండు వుష్ణమును పోగొట్టి చేతులుకాళ్లనడుములోగలుగుఆశక్తత నొప్పులనుపోగొట్టి బలమునిచ్చును పయిత్త్యపు వాయువులను ఒకమండలములో ఎన్నటికిని రానివ్వక బహు ఆకలియున్ను జీర్ణశక్తియున్ను కలిగించును, వదలిన నరములను బలపరచి దృఢమును కలుగజేయుటలోదీనికిమించినఔషధము యింకొకటిలేదు. గోళ్ళలోను, కండ్లలోను, నెత్తురు లేక, తెల్లబారియున్నవారు యీద్రావకమును ఒక మండలము 40 రోజులు సేవించిన యెడల దేహమాంద్యంతం క్రొత్తరక్తమును వ్యాపించును పైత్త్యపుపసిమికిని పాండు గుల్మం చేతులుకాళ్ళువాపు గుండెనొప్పి మొదలయిన వాటిని 8 రోజులలో స్వస్థపరచును. స్త్రీసంభోగము కూడదు.

20 రోజులకు రు. 1—2—0 40 రోజులకు రు. 2—0—0

## సర్వవిషసంజీవి అను

### తేలుకాటుకు మందు.



ఇది నూతనముగా కనిపెట్టబడిన సొగసైన పరమౌషధము దీనిని వుపయోగించిన 5 నిమిషములలోపల ఘోరక్రూర బాధను చల్లార్చి చల్లదనము గలిగించును, తేలుకుట్టిన తర్వాత ఆర్భటించుచు వచ్చిన మనుష్యుడు మందు వేసిన తర్వాత ఆనందముతో నవ్వుచు వెళ్లును. సీసా 0-8-0 12 సీసాలు 5-0-0

### మూలరోగ సంజీవి లేహ్యము.

లోపలిమూలము, బయటమూలము చీముతోచేరిన మూలము, బెట్టమూలము, రక్తమూలము మొదలగు షాతరోగములను సకలవిధ మేహావుష్ణములనున్ను పారదోలును, మూలరోగులకుఆస్పత్రిలోతీరకున్నను తమయౌషధమువల్ల నివత్తియగును.డబ్బి 2-0-0

---

మా విలాసము:—యన్. వి. గోపాల్ అండు కో.,

నెం 63, కృష్ణప్పనాయకన్ గుంటవీధి, సౌకార్ పేటపోస్టు, మదరాసు.

# హానుమంతసంజీవి లేహ్యము

(వెండిభస్మముతో చేరినది.



ఈ దివ్యౌషధము 40 దినములు సేవించినయెడల యవ్వనము నందు కేవలము స్త్రీలోలురై యుండుటచేతను దేహపటుత్వముతప్పి సత్తువలేనివారై జీర్ణశక్తిలేక బలముడిగి జ్ఞాపకశక్తిలేక సంభోగవాంఛ బొత్తిగా లేనివారల దుఃఖమునుపోగొట్టి శుక్లమునువృద్ధిపరచి యౌవ్వనవంతులుగా జేయుటయందు ప్రసిద్ధికెక్కినది, ఈ దివ్యౌషధము నపుంసకత్వము, త్వరిత స్ఖలనము, లింగముయొక్క అశక్తతను పోగొట్టి నరములకు బలమిచ్చును, దేహమునకు తేజస్సు కలిగించును. ఈలేహ్యభస్మములు, వృష్ణవాయువు, పార్శ్వవాయువు, పిత్తమయికం, నోరూరుట, పసరుబడుట, తలత్రిప్పుట, రొమ్మునొప్పి, కాళ్ళుచేతులుపోట్లు, మేహకాక, అశక్తి మొదలయినవి నివర్తించి ధాతువును గట్టిపరచి సౌఖ్యమును కలుగజేయును.

20 రోజులకువచ్చు లేహ్యము వెండిభస్మముచేరినది 2-0-0

40 రోజులకువచ్చు లేహ్యము వెండిభస్మముగలది పోస్టేజితో సహా 4-0-0

## దృఢధాతుకరణి.



ఇది అనేక కారణములచేత శుక్లదోషమేర్పడి దేహపటుత్వముచెడి జీర్ణశక్తియు సంభోగవాంచయులేక కష్టముతో కాలము గడపువారిని రక్షించు సంజీవకరణి, ఈ లేహ్యము నీరైన శుక్లమును మణివలె ఘట్టిపఱచి రతియందు శీఘ్రవీర్యస్ఖలనము పోగొట్టును. సకల మేహములు మూలరోగములు, అ[illegible] మాంద్య, ముఖరోగములు, సోమరితనము, నడుమును, కా[illegible] నొప్పులు మొదలగు బలహీనతచే గలుగు సకల దుర్[illegible] నిశ్శేషముగా ఖండించును. స్త్రీలకుగలుగు తెలుపు, [illegible] మొదలగు సకలవ్యాధులను బోగొట్టును, శరీరబలమును హెచ్చించును. [illegible] నరసిన వెంట్రుకలను నలుపుజేయును. ఇంద్రియనష్టములేక పలు[illegible]వలన బలహీనతచే కృశించినవారీ దివ్యౌషధము 20 దినములు సేవించిన నత్యాశ్చర్యమగు శుక్లవృద్ధిబొంది సయ్యౌవనవంతులై సర్వసుఖము అనుభవింప శక్తులగుదురు. బాలురు, గర్భిణీస్త్రీలు, వృద్ధులు వ్యాధిలేనివారు సదా సేవించి సంపూర్ణ ధాతువృద్ధిని బొందవచ్చును. ఇవి భుజించుటకు మిగుల రుచికరముగానుండును. ఈదృఢధాతు సంజీవికరణిని సేవించిన మూడవదినమే సంతోషచిత్తులగుదురు.

20 తులములు డబ్బి 2-0-0

---

మా విలాసము:—యన్. వి. గోపాల్ అండ్ కో.,

నెం 63 కృష్ణప్పనాయకన్ గుంటవీధి, సౌకార్ పేటపోస్టు, మదరాసు

# సెగరోగనివారిణి.



మూత్రము వెడలునపుడు పోట్లు, మంటలు, మూత్రద్వారమున్నుండి తెల్లగాగాని, పచ్చగాగాని చీమువంటి ద్రవము వెడలుట, పొత్తికడుపు నరములు బిగదీయుట మూత్రకోశమున బొట్లు తరుచుగా విసర్జనముచేయుట, మూత్రము బొట్లుబొట్లుగా వెడలుట మొదలగుగుణములతో నీరోగము ప్రారంభించినవెంటనే ఈద్రావకము యేడుపూటలుసేవించిన నాళముదగ్గర పుండు మాని చీమువంటి ద్రవముకట్టి మూత్రము ధారాళముగా వెడలును. నాళమునయందలి జిలజిల మానును ఈద్రావకము పాత సెగరోగములనుకూడ నతిత్వరలో మాన్పును.

దీని వెల **1-4 0**

రోగము త్వరలో పూర్తిగకుదురుటకు మూత్రమార్గమును శుభ్రముగానుంచవలయును అందులకుగాను ఆమార్గమున పిచ్చికారుపెట్టికడుగుట యుక్తము, కోరువారలకు పిచ్చికారును అందులకు ఉపయోగించుమందును డైరక్షనుతో 1 రూపాయకు పంపబడును.

మా కంపెనీయందు నూతనముగా తయారుచేయబడి అనేక సర్టిఫికేట్లను పొందిన

# (శకుంతలా) వెంట్రుకలుపెరుగు తైలము.



సోదర సోదరీమణులారా!

భూలోకమునందు స్త్రీపురుషుల కిరువురకు ఆనందము అలంకారమనునది సాక్షాద్భగవంతుని కృపాకటాక్షముగాయున్నది అట్టియందమున కనుకూలమయినది వెంట్రుకలు, గనుక ఈమహోపకారియగు తైలమును వెంట్రుకలకు చరిమి దువ్వుచూవచ్చినచో ముఖోల్లాసముగా వెంట్రుకలు పెరిగి నలుపువర్ణముగాయుండుటుల జేసి నేత్రములకు చల్లని పార్వనిచ్చియందుండు రోగములను శుభ్రముగానివారించి [illegible]టియందు నీరుకారడం తలలోనుండుకురుపులు, వెంట్రుకలు పగులుట, మయికం, తల[illegible]ప్పుట, దేహమునందు [illegible]ట, గజ్జి, దురద, చమటగబ్బు, కలబందకంపు మనోవ్యాకూలం, [illegible] మొదలగు సర్వవ్యాధులను పోగొట్టి దేహమునకు ప్రకాశమున్ను సువాసనయున్ను కలుగజేయును ముఖమునకు తేజస్సునిచ్చును పుష్టదేహముగలవారు యీ తైలములో కొబ్బెరచమురుచేర్చి ఉపయోగించవలయును

యీ వాసన తైలమును తలకుచరిమి దువ్వుకొన్నయెడల వాటియొక్క సువాసన యిరుగుపొరుగుయిండ్లకుకూడా ఘుమాయించును ఇది నిజమో అబద్ధమో సందేహముగలవారు ఒక డబ్బిమాత్రముకొని వుపయోగించిన మీకే తెలియును.

5 పలములు గల డబ్బి 1-కి **0-12-0**

---

మా విలాసము:—యన్. వి. గోపాల్ అండ్ కో.,

నెం. 63 కృష్ణప్పనాయకన్ గుంటవీధి, సౌకార్ పేటపోస్టు, మదరాసు.